# శిఖరిక



'కవిరత్న' శ్రీ నీలా జంగయ్యగారి కృతులపై వ్రాసిన
సారస్వతవేత్తల వ్యాసాలు

(వెండి బంగారు పండగల కలయిక)

ప్రచురణ :

శ్రీ నీలా జంగయ్యగారి
స్వర్ణోత్సవ సన్మాన సంఘం
H. No. 2-1-527/7, నల్లకుంట, హైదరాబాదు-500 044

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : 1989 ఫిబ్రవరి

మూల్యం : రూ. 50/-

ముఖపత్ర రచన : శ్రీ మడిపడగ బలరామాచార్యులు
శ్రీ ఆనందకుమార్‌లు

ప్రతులకోసం

1. ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్‌రోడ్డు - హైదరాబాదు

2. టాగూర్ పబ్లికేషన్స్
కాచిగూడ చౌరస్తా - హైదరాబాదు

3. నవయుగ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
సుల్తాన్‌బజార్ - హైదరాబాదు

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,
హైదర్‌గూడ, హైదరాబాదు-500 029.

# అంకితం

"అసమాన రసోర్మ్ములలో
అవనిని పండించాలని
రసదేవతయై జగాన
ప్రబలే కవితాలక్ష్మికి"

'కవిరత్న'

# ప్రకాశకీయం

'కవిరత్న' శ్రీ నీలా జంగయ్యగారి స్వర్ణోత్సవ సందర్భాన్ని పురస్కరించుకొని సన్మాన సంఘంద్వారా మేమీ పుస్తకం 'శిబిక'ను ప్రకటిస్తున్నాం. 1979 లో వారి సారస్వత రజతోత్సవ సన్మాన సంఘం ప్రకటించిన "మధుకోశం"లోని పదహారు వ్యాసా లీ శిబికలో చేర్చాం.

ఇందులో 'కవిరత్న' వెలయించిన ఒక్కొక్క గ్రంథంమీద ఒక్కొక్క విమర్శన వ్యాసం వ్రాయించి అచ్చువేయించి జంగయ్యగారికి వారి స్వర్ణోత్సవంలో ఉపాయనంగా సమర్పిస్తున్నాం. సారస్వత రంగంలో మూడున్నర దశాబ్దాలుగా కృషిచేసిన సంగతులు బాగా ఎరిగిఉన్న కవి పండితులు, అధ్యాపకులు, విమర్శకులు, మిత్రులు ఈ వ్యాసాలు వ్రాశారు.

సాహిత్యంలో కొత్త పాతల మేలిమి దెలిసిన విజ్ఞాన ధనులే 'కవిరత్న' జంగయ్యగారి కవితా పరిమళాలకు వాహకాలై మధుకోశంలో మధురూపంగా ప్రకాశించిన వారితో కలసి 'శిబిక' నెక్కిన మరికొందరి మధురస కాంతులు ఏకమయ్యాయి. ఈ 'శిబిక' 'పుష్పకం'తో పోల్చ తగిందే కాని పోలిక సత్య పంథాలో అవసరం లేదు. దీనిలో నిజంగా ఎందరెక్కి ప్రయాణించినా స్థలం ఖాళీగానే ఉంటుందని మీరే గ్రహిస్తారు. ఈకల్పన నిజమయిందని ఆనందిస్తారు.

కోరిన మేరలో తమ అమూల్యమైన సమయాన్ని వ్యాస నిర్మాణంలో వెచ్చించి అందజేసినందుకు సన్మాన సంఘం పక్షాన వారందరికీ కృతజ్ఞత లందిస్తున్నాం.

మాకు వారు గుర్తుగా, వారికి మేము గుర్తుగా ఈ 'శిబిక'తో స్వర్ణ శోభ లందు కొన్నట్లు భావిస్తాం. ఈ సువాసనలు, ఈ రసకాంతులు శిబికాత్మకమై పాఠక లోకంలో విస్తరిస్తాయన్నది మా విశ్వాసం. ముఖ పత్ర రచన 'శిబిక'ను

తీర్చిన ఉత్తమ చిత్రకారులు 'మధురకవి' బిరుదరాజితులు శ్రీ మడిపడగ బలరామాచార్యుల వారికి ప్రత్యేక ధన్యవాదా లర్పిస్తున్నాం.

శ్రీ జంగయ్య గారి కవితలకు అద్దం పట్టి ఆధునికాంధ్ర సారస్వత నిర్మాతలకు, పరిశీలకులకు పరిశోధకులకు చదివేపని కల్పించు తీరులో రచించిన శిబిక లోని వ్యాసాలు ఆత్మ చైతన్యోద్ధరణలకు దీప్తి వంత మవుతాయన్న సదాశయమే ప్రచురణకు మూలమయింది.

రసజ్ఞులైన సారస్వతేయులంతా ఈ శిబికనుచూసి హర్షిస్తారని వ్యాసాలను చదివి అభినందిస్తారని 'కవిరత్న' శ్రీ నీలా జంగయ్య గారి ప్రతి గ్రంథాన్ని వదలక చదివి అభినందిస్తారని నమ్ముతున్నాం.

ఇట్లు
**ఎం. కులశేఖరరావు**
ప్రధాన సంపాదకులు
'కవిరత్న' శ్రీ నీలా జంగయ్య స్వర్ణోత్సవ సన్మాన సంఘం

# మనవి

స్వాతంత్ర్యా నంతర తెలుగుదేశాన సారస్వత రాచరిక రంగాలలో మహోత్తాలమై ప్రశస్తి గాంచిన వారిలో శ్రేష్ఠులయినవారు ముగ్గురు నాకంట బడ్డారు. ఒకరు బూర్గుల మరొకరు దేవులపల్లి ఇంకొకరు శ్రీ పి. వి. నరసింహా రావుగార్లు. ఈ ముగ్గురిలో ఇద్దరు వామనాకృతులు. ఒకరు బూర్గుల మరొకరు దేవులపల్లి. రస గుణప్రభావ సంపన్నత్వంతో ఇద్దరూ త్రివిక్రములే. అయితే బూర్గులవారు రాచరిక రంగంలో శిఖరాయమానంగా ఎదిగి నాకందకుండా పోయారు. రామానుజరావుగారు సరసులమధ్య నిష్కపటులమధ్య సరస సాహిత్యమధుమూర్తులమధ్య నిష్కళంకుడై కలం ప్రవృత్తిలో కమనీయ చరిత్ర గలవారై భాసిస్తున్నారు. నేనేం చేయాలి ? ఎవర్ని ,సమాశ్రయించాలె ? పెద్దల్ని చిన్నలు అనుకరించి తీరాలె ! తమ లక్ష్యాన్ని చేరాలె! నాకందుబాటులో ఉన్నది అప్పట్లో రామానుజ రావుగారే. ఆంధ్రసారస్వత పరిషత్ప్రాంగణంలో జరిగే సారస్వత సమావేశాల్లో తరచూ పాల్గొంటూ రస, గుణ గ్రహణ పరి ణతుడనౌతూ వచ్చినాను. లేనిచో నేను ఆ రాచరిక వ్యవస్థలోనే అంటిపెట్టుకొనే వాణ్ణి. అది నాకు దినదినం దూరమవుతూ పోయింది. జీవనంలో అర్థదృష్టికూడా సన్నగిల్లిపోయిన నేను ఏం చేయాలి ? ఉద్యోగాని కనుకూలించిన విద్యను ముందు పొందాలి. శ్రీ రామానుజరావుగారే నన్ను ఉద్యోగాభిముఖుణ్ణి చేసినా దని చెప్పుకుంటే అది అతిశయోక్తి కాదు. రామానుజరావుగారి మూలంగా హుమాయూన్ కబీరు వంటి విద్యావేత్తల్ని ఎందరినో దగ్గరగా చూసే భాగ్యం కలిగింది. నేను రాచరిక రంగంలో అడుగుపెడతాననేమాట ఇక కల్ల అనేటట్లు వికారభూయిష్టమై సాగిపోతూ ఉన్న పరిస్థితులు పెరిగిపోయినాయి. అవి మెరు గైనప్పుడుకదా నామనస్సు దాని నాహరించునది. ఏ మంచివ్యవస్థలోనైనా విజ్ఞాన రంగం (విద్యారంగం) మాయాప్రదీప్తం కావన్నంతవరకే అందలి జనం శాంతి సుఖదాయకంగా వర్థిల్లగలదు. అందుకే మొదట శబ్దప్రపంచాన్ని ఆవ రించదలచినాను. ఇది సంపూర్ణ సంస్కారణశీలంతో వెలుగునప్పుడుకదా రాజ్య భూములు అత్యుదాత్త రసరమ్యం కావడం జరిగేది.

నేను బుద్ధితెలియని కాలాన డబ్బులేక అవసరాలు తీరవని దలచి పేద ననుకొన్నాను. బుద్ధితెలిసిన పిదప డబ్బుతోనే సర్వస్వం జరుగదనికూడా తెలిసి గుణధనుల నాశ్రయించి అక్షరజగత్తును విస్తరిస్తున్నాను.

శిఖరాయమానంగా ఎదిగిన విశ్వనాథాదులు భాషాప్రపంచాన్ని ఏలుతున్న రోజులవి. వానమామలై, దాశరథి, నారాయణరెడ్డి, శ్రీశ్రీ, కాళోజీ వంటి కవి సూర్యులు ఉదయించిన తెలుగుభాషలో నేనూ ప్రవేశించినాను కాంతికణంగా. ఈ నా సాహిత్యలక్ష్మికి జరిగే నా ప్రయాణంలో రజతోత్సవం ఒకమెట్టు- స్వర్ణో త్సవం రెండో మెట్టు

నన్నాదరించి నా కోర్కెలకు ఊపిరులుపోసిన కరుణామయుల్ని వెనక్కి తిరిగి చూచుకొనడానికి కలిగించిన అవకాశం వాటిని మెట్లుగా భావించిన నేను ఈ రోజును మరువజాలను. నాపై బాధ్యత ఉందంటే అది భగవంతుని దయ యేనని వాడే మోయగల డీ విశ్వభారాన్ని అని తలచే నా లక్ష్యానికి నేను చేరుతాను.

సంఘానికి వ్యక్తి మూలధనం. వ్యక్తినిర్మాణం జరగాలంటే ముందు విద్యలో సంస్కారం ఉదయించాలె. విద్య అంటే నా దృష్టిలో తెలుసుకొనడానికి వీలైనది.

సినిమారంగం - ప్రచారసాధనాలనదగిన రేడియో టెలివిజన్ ఆదులు పత్రికల వంటివి లాభార్జనలో బుజగ్రస్తమైతే వాటివల్ల ఏర్పడే వాతావరణ కాలుష్యాలు అతిశయించి జనజీవనంలో నిండి జాతి క్షీణిస్తుంది. మన పిల్లలు ఉత్తమ సంస్కారజీవనం చేయవలెనని సంకల్పించిన తక్షణమే వాటిలో సంస్కారణలు జాతీయతాభావ పరంపరలు విలసిల్లడానికి మనం చేయగలిగింది చేయాలె. అందుకు దేశీయులైన పెద్దల బాధ్యత యెంతో ఉన్నది. నేను గ్రహించిన తీరులో నా వచనాలు-అందుకు దోహదపడేవిగా ఉండాలన్న ఒక చిన్న లక్ష్యంలో సాగి వస్తాయి. అందుకే ఈ మధుకోశంపేర శిఖిపేర నా రచనల వైభవం ప్రదర్శితమవుతుంది. నా మొత్తం గ్రంథాలకు ఇందులో దీపికలు పట్టిన వారు అధ్యాపకులు-కవులు-పండితులు-విమర్శకులు, సాహిత్యజీవనంలో సిద్ధహస్తులు. ఉదారులు-ఉత్తములు.

నా కవితా లతాంగి సుమసౌరభ శోభలను పరిశీలించతగిన యోగ్యులే మధుమాధుర్యాలను రసకాంతులను మీ కందించడానికి యత్నించినారు. వారంద రికీ నా ధన్యవాదాలు. అందుకే ఇది శిబిక పేరున మీదరి చేరుతుంది. చదవండి ! చదివించండి !! తెలుగుకవిత్వంలో పద్యం రత్నపాత్రిక. దానిలో కవితామృతం మధుమానసయై భాసిస్తుంది. నిర్విరామ భావప్రభవమైన కవిత-అమృతాభయ ముద్ర కలిగి జీవధర్మాన్ని ప్రకాశమానంచేయ సమర్థమై నిలుస్తుంది. 'విశ్వ శ్రేయః కావ్యమ్' అనే ఋషివర్యుల దీవన అందుకొంటుంది. మీలో ఒకడనై తరించడానికి నా కవనలక్ష్మి జేగీయమానమై యలరుగాక ! విశ్వహిత ప్రభా వైభవాల వెలయించుగాక ! ముత్తెమంత కవిత్వం బాధ నాలోఉంది. అది ముల్లోక కావ్యరస సముద్రాలనునిండి పరమాత్మగా అవతరించి విశ్వాన్ని మంగళప్రదం చేస్తుంది. నా గమ్యం రమ్యం. దానిని పొందడానికే నా తపన. అందుకు మీ అందరిచేయూత అవసరమనే భావిస్తున్నాను. ఈ గ్రంథం నా సన్మానసంఘం పక్షాన ప్రకాశం కావడం ఎంతో ఆనందంగా ఉన్నది. సన్మాన సంఘానికి పాఠకులైన మీకు నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలర్పిస్తున్నాను.

హైదరాబాదు,
26-1-89

సు(కవి)జన విధేయుడు,
**నీలా జంగయ్య**

# విషయసూచిక



'దానశీల'
శ్రీ బాదం రామస్వామిగారు
ఈ గ్రంథ ముద్రణకు ద్రవ్యదాతలు
ధర్మపత్నితో - పుత్రునితో

# రమ్యాపథము

విద్వాన్ సాహిత్య శిరోమణి **కేశవపంతుల నరసింహశాస్త్రి**

శ్రీ నీలా జంగయ్యగారు సంతరించిన ఖండకావ్య సంపుటియగు ఈ ''రమ్య పథము''నందు ముప్పది యెనిమిది మజిలీలున్నవి. కంటకములు, గలుసు రాళ్ళు లేక సుఖముగా నడుచుటకు వీలైన ఈ రమ్యపథముపై నడచునట్టి సారస్వత పథికులకు ప్రతిమజిలీకూడ ఒక విందును చేయును, ఒక స్వాగతమును పలుకును. సహజకవి జంగయ్యగారు వేసిన మీ పంథాలో అందఱును నడువవచ్చును. అందఱికిని గావలసిన వన్నియు నిందులో గలవు. ఇచ్చట మొదట సాక్షాత్కరించు మజిలీ కాలచక్రము. ఈ చక్రము ఈ చక్రభ్రమణమునందు కాలత్రయము, ఋతుషట్కము, వత్సరము, అనునవి పూటీలై, ఆకులై, బుద్దియై యిరుసునఁ దిరుగుటను మనము చూడవచ్చును. జీవునికి అది కాంతి సముద్రము, దాని భ్రమణమున కంతములేదు. ప్రాణికోటి మనుగడ దానిచేతిలో నున్నది.

రెండవ మజిలీలో ఒక ఉపాధ్యాయుఁడు కూర్చునియుండును. అతఁడు అజ్ఞానాంధకారమును జీల్చునట్టి కాంతితో విజ్ఞానవేదికపై నధివసించియుండును. శాస్త్రసాగరములను మథించి అమృతము నిచ్చిన మహనీయుఁడు, విశ్వోపకారి, జాతిహితుఁడు, పంచవర్ష దేశీయులగు బాలురకు ఊహ లుబికివచ్చుటకై వీణను మీటు కళారతుఁడు. తత్త్వవేత్తలు, మంత్రులు, రాజులు, గ్రంథకర్తలు, కవులు అందఱును అతని సృష్టియే, ఆయన దేవుఁడు ఆయన బ్రహ్మ.

ఆయనను దాటి ముందుకు మూడడుగులు వేయగానే ''భారతవీరా! ఓ భారతవీరా!'' అను సందేశగీతము వినఁబడును. అందులో ''వందేమాతరం'' అంటూ మ్రొడమ త్రిప్పకముందడుగు వేస్తూ వైరి గుండెలదిరేలాగ, మరఫిరంగి గుండులాగ స్వదేశభక్తిని, శక్తిని చాటిచూపమన్న మాటలు, ప్రచండ ప్రణవనాదమై ప్రసిద్ధిగాంచుమన్న బోధలు మనస్సునకు హత్తుకొనును.

నాలుగవ మజిలీలో స్వయం భూదేవుని శిథిలాలయము సాక్షాత్కరించును. అందలి శిథిలశిల్పములతో అనాటి శిల్పుల పురాకృత సుకృత పరిపాక లబ్ధమైన శిల్పచాతుర్యము చాటున కవి కవితా చాతుర్యము తొంగిచూచును. సహజ కవికి సాధ్యముకాని సలక్షణ కవితాసరస్వతి గోచరించుచు, ఇది పూర్వజన్మ సంస్కారమా? ఒక పుణ్యమూర్తి ప్రసాదమా? లేక ఘుణాక్షర న్యాయ లబ్ధమా? అన్న సందేహమును బొటమరింపఁజేయును. ఆలయమునందలి శిల్ప విన్యాసము నాట్యశాస్త్రమువలెను, పాషాణములు ప్రాణములున్న కళాజగత్తుగాను గోచరించును. చరిత్ర సృష్టించిన ఆ శిథిలములు కరుణరసమును పిండును.

ఆ పైన మనకు దర్శనమిచ్చువాఁడు వేంకటేశ్వరస్వామి. ఆ దేవుని గజేంద్రమోక్ష బలిశిక్షాది మహిమలు గొనియాడుచు, జీవుని యసహాయతను నివేదించుచు, 'పరమదయాకర' నన్ను పాలింపుమని వేడుచు ముందుకు సాగినచో ''ఎవరవో'' అన్న గీతము వినబడును. ఆ గీతమునందు ఒక వలపులరాణి ప్రతిఫలించును. ఆమె చిరస్మరణీయగాను, మాయనికలగాను, ప్రేమసరస్సునందలి పూలపడవగాను, అమనియంచలి మధురయామినిగాను, స్వర్గఖండము గాను గోచరించి మనకు శృంగార రస తాదాత్మ్యమును ప్రసాదించును.

ఆ పై ప్రయాణమున వచ్చునట్టి యేడవ మజిలీలో ''మన శాస్త్రి'' లాల్ బహదూర్ దివ్యస్వరూపము మనముందు నిలుచును. అష్టాదశ సంఖ్యతో సన్నిహిత సంబంధమున్న భారతావనిని అష్టాదశవర్షములు పాలించి, అష్టాదశ దినములు రేగిన పాక్ ద్వంద్వయుద్ధాగ్నిని చల్లార్చుటకు తాష్కెంటు సంధిపత్రముపై నుంచిన తన నామాక్షరముల మషీపంకము తడియారకమునుపే వీరస్వర్గ మలంకరించిన లాల్‌బహదూరుశాస్త్రి దివ్యతేజము మన కనులకు మిరుమిట్లు గొలుపుచు, ఇచ్చిన శాంతిసందేశమచ్చట ప్రతిధ్వనించును. అతఁడు కృష్ణ భగవానుఁడు, అతడు బుద్ధభగవానుడు. దుఃఖపరవశయైన కవివాణి గాద్గద్యము, విశ్వవీణ శోకరాగము, అచ్చట వినిపించును.

ఆ తరువాత, మార్గమొక మలుపు తిరుగును. ''త్యాగరాజస్వామి'' చిరు తాళముల లయతో చేయు రామనామామృత గానముతో పులకింపఁజేయుచు దర్శనమిచ్చును. పోతరాజు ముందుపలెనే వాణి త్యాగరాజు ముందు నిర్దుష్ట

గుణాలంకార శోభితయై నిలిచినది. సహజకవి కలమునుండి సలక్షణ రచన తీగలు సాగినది. జగత్తునందలి రాజులందఱును త్యాగహీనులు, ఆయన త్యాగ రాజు, రాగరాజు, సంగీత సాహిత్యములతో రాముని సేవించి తాను తరించి లోకమును తరింపఁజేసిన కవిరాజు. ఆయన గానమును వినుచు చెట్లు తలలూపి నవి, గుట్టలు స్తబ్దములై నిలిచినవి, నదులు పొంగి పొరలినవి, ఉదధి ఉబ్బి పోయినది.

ఆ ప్రక్కననేయున్న కవి యౌవనాంబుధిలో నుబికివచ్చిన "మారు ముద్దు" కుమారుని ముద్దుగొనుట మనకు కనపడును. దానివెంటనే వచ్చు పదవ మజిలీ "పికసందేశము" ఆ సందేశము పికమునకే సందేశము. అది పికమును దీనమానవ గాథలు గానము చేయుమని బోధించుట మనకు వినఁబడును. ఆ సందే శమును స్మరించుచు నడువగా "సారవిచార" ఘట్టమును జేరెదము. అది ధర్మ విచారము, నిత్యానిత్య వస్తువివేకము. "అణోరణీయాన్ మహతో మహీయాన్" అను శ్రుత్యర్థమును ప్రతిపాదించును, మానవలోకమునందు పెల్లురేగిన మోస మున కాయుధములుగా ధర్మము, దానము, కర్మ మొదలయినవి ఉపయోగించుచు జనుల జీవనముల హతమార్చుచున్నవను ఆక్రందన మచ్చట వినబడును. నిత్య సత్యమైన పరమాత్మను దెలుపు ఓంకారమే శరణ్యమను సిద్ధాంతము శ్రవణ గోచరమగును. ఆ పైన నొక మజిలీ దాటి మరియొక చోటికిఁ జేరుకోగా "ఒక్కడు వేరొక్కడు" కనబడుదురు. ఒక్కడు, దారిలోబడి దాహమునకు తట్టుకోలేక మూల్గుచు, విలపించుచు, ఆకలికి అలమటించుచు, మృత్యుగహ్వ రమునందు చిక్కి ఏడ్చుచుండును. వేరొక్కడు పెత్తనముకొఱకై కారులో పరుగెత్తుచు, ప్రణయలీలలో దేలిపోవుచు, చెలితో గలిసి రాగాలు ఆలపించుచు తిన్నది అరుగక మందులకై వెదకుచుండును. ఖేదమోదముల కాస్పదమైన యా చోటునుండి తప్పుకొని ముందుకు నడచినచో "మాయారాక్షసము–సత్య పరాక్రమము" అన్న పదునాల్గవ మజిలీని చేరుకొందుము. సృష్టిలో మాయా కల్పితమైన రాక్షసత్వము సత్కర్మల నెపమున నెట్లు విజృంభించునో సత్యమైన దైవశక్తి దాని నెట్లు అణచునో అచ్చట చూడగలము. దానిప్రక్కనే నిర్భయ స్థానము గలదు. "నాకు భయంలేదు" (నేను = ఆత్మ) అచ్చట ఆత్మతత్త్వము గోచరించును. చిత్కళలు భాసించును, గురువు పరబ్రహ్మరూపమై శిష్యునికి పరమాత్మ భిన్నతను ప్రసాదించును. నాదబ్రహ్మానంద మయత్వమును జేకూ

ర్పును. ప్రపంచ సుఖములందలి నిస్సారతను దెలుపును. అది ఆత్మతత్వ విచారము, అనంతయు వేదాంతసారము.

అక్కడ మనము ఆగిపోవలసినదే, కాని ప్రక్క మజిలీనుంచి "కోకిల ధ్వని" వినబడుటచేత ముందునకు అడుగుపడును. ఆ కుహూధ్వని, సుధా మధురగీతమై, అచ్చటి ప్రకృతి మంగళారామమై, మిధునతాపమును గలిగించి లాగుకొని పోవును. ఆ కైపునుండి యెట్లో తేరుకొని "నిత్యసత్యాల" వైపునకు మనస్సును మరలించుకొనగలుగుదుము. మనస్సునందు ఆత్మనుమించిన (ఆత్మ సంపమును మించిన) తాదాత్మ్యము మరొకటి లేదనియు, వనితామణి మనవెంట రావనియు, బ్రతుకులో బాధ తప్పదనియు, కుట్ర చేయనివాడు కోటికొక్కడును లేడనియు, నింకను వలసినన్ని సత్యములను అచ్చట గుర్తింతుము.

మనమెంత కాలము వహించినను గిల్లికజ్జాలకు వచ్చువారుందురు. అట్టి వారిలో చైనాతో చెలిమిచేసికొని భారతోర్విపై గ్రుడ్లురిమిన అయూబ్ ఒకడు. అట్టి సందర్భములందు చేతులు ముడుచుకొని నిర్వీర్యులై కూర్చొనుట భార తీయుల ధర్మము కాదని ప్రోత్సహించు "వీరభారతి" వినపడును. అందులో భారతీయ సైనికుల పరాక్రమము, విజయము ప్రపంచ విఖ్యాతిని గనిన చరిత్ర స్వరూపము గోచరించును.

కొంచెము ముందునకు సాగగా ఒక 'తోటమాలి' ఆవేదన చెవులలోం బడును. అతఁడు పెంచి పెద్దచేసిన గులాబీకన్యను భగవంతుని పాదములపై సుంపదమనుకొనుచుండగా, దానిని తుమ్మెదవిటుడు తాకి తేనెను గ్రోలి వెళ్ళి పోయెను. ఆ దృశ్యమును జూచిన తండ్రి తోటమాలికి గుండెలో దిగులుగగ్గెను. తాను వండి నైవేద్యము చేయుదమనుకొన్న యన్నమును పిల్లి ముట్టినట్లయ్యెను. దుఃఖము వెల్లువలై పారుచుండగా నా తోటమాలికి (భక్తునికి) జ్ఞానోదయ మగును 'సర్వం విష్ణుమయం' అన్న సత్యము గోచరించును. పూవు, తావి, మధువు, మధుపము అన్నియు విష్ణుమయములే యని తెలిసికొని తృప్తిపడును.

ఆ భక్తునివద్దనుండి మనము కదలీకదలక మునుపే ప్రక్కనున్న మజిలీ నుండి 'సహింపను' అని ఒక పొలికేక వినపడును. అది స్వతంత్ర భారతముపై

నౌక పరాయి ప్రభుత్వము వేసిన బాంబు చప్పుడును విన్న వీరుని సింహ నాదము. పచ్చపచ్చని భారతదేశము భస్మరాశిగా మారుటను సహింపనని పలికిన పలుకు. కాని కాలగర్భమున లీనముగాని ప్రాణికోటి లేదుగదా! అన్న విచారము కలుగగానే ప్రక్క మజిలీలో 'మృత్యుమాత' వికటాట్టహాసము విన బడును. అమెకు రూపము లేదుకాని, యుగయుగాలనుండి రూపవంతుల రూప ములను తనలో దాచుకొనుచున్నది. తల్లులు నవమాసములు మోసి కన్న పిల్ల లను తన పొట్టలో పెట్టుకొనును. ఆమెను గన్నవారెంత ధన్యులోకాని ఆ చావు తల్లికి చావులేదు. ఆమె చీమను సయితము చంపని బుద్ధభగవానుని, ఏసును, వివేకానందుని, గాంధీని తన పొట్టఁబెట్టుకొన్నది. ఆమెను నమ్మినను నమ్మ కున్నను మేలుచేయదు, ఆమె రక్కసి.

అక్కడినుండి కాలికి బుద్ధి చెప్పవలెను. అపరిహార్యమైన మృత్యువును స్మరింపక జీవితకాలమునందు సత్కర్మల నాచరించి మోక్షమునకై లేదా స్వర్గా దులకై ప్రయత్నింపవలయునని తలంచుచు ముందుకు సాగినచో, క్రతువులు, యాగములు, సత్కార్య రూపములే కనుక మానవుఁడట్టిపనులు చేయవలయునని బోధించు వేదవేత్తలు, వేదాంతులు, తుదిగా మౌనము సర్వశ్రేష్ఠము, అది నాదబ్రహ్మ సాక్షాత్కారమును, దివ్యానందమును, ముక్తిని జేకూర్చును. విశ్వాంతరాళ ప్రగతిని భగవంతుఁడేకూర్చును. అట్టి సత్యమును నమ్మినవానికె 'వాంఛాఫలసిద్ధిరస్తు' అని దీవించుచున్న మజిలీకి చేరుదుము. 'మన ఏవ మనుష్యాణాం కారణం 'బంధమోక్షయోః' అను సూక్తి ననుసరించి, ఎట్టి విలయమునందైనను జడమైన ప్రకృతిని మేల్కొలిపి సుఖమునిచ్చునది మనస్సే, దాని 'అభయ హస్తమే' ఆ పైనున్న మజిలీలో మనకు దక్కును.

అచ్చటినుండి బయలుదేరినచో, భారతజాతి పరదాస్య శృంఖలములనుండి విడివడి, స్వతంత్రములైన ఉచ్ఛ్వాస నిశ్వాసములను విడుచుటకు పెట్టుకొన్న ముహూర్తపు మజిలీ 'పంద్రాయగస్టు'కు చేరుకొందుము. అచ్చటి సుప్రభాతమున రెపరెపలాడుచున్న మువ్వన్నె పతాకమును జూచిన ప్రకృతి పులకింపులను, ప్రజల యుత్సాహమును, జగతిపైఁ బ్రసరించిన మహోదయ రేఖలను, వాని ధాటికి విరిగిపోయిన యుగయుగాల చీకటిపొగలను గాంచి, త్రివర్ణపతాకమునకు నమస్కరింపఁగల్గుదుము. ఆ ప్రక్కన నొయ్యార మొలికించుచున్న 'ఇందు

వడన' భారతేందిరయని గ్రహించి, తరతరాల వారసత్వముతో మనకు లభించిన యీ సుందరాంగికి మకరెండమునందు గూడును, లేదా గుడినికట్టి నిలుపు కొందుము.

అటనుండి కదలి ఇరువదియారవ మజిలీలో దేవునిఁ గలిసికొందుము. కలిసికొని మనలో రేగిన కవిత్వ వాంఛకు లక్ష్యమునుగా దీనమానవజాతి జాగృతి యగుగాక అని వేడుదుము. కవి దైవసమానుఁడు కావలయుననియు, లోకుల ఆదరానాదరములను లెక్కసేయని వాఁడుగా నుండవలయుననియు, సమతను, మైత్రిని, త్యాగమును, శాంతిని, కావ్యక్షేత్రమునఁ బండించి లోకుల యనుభవ మునకుఁ జేకూర్పవలయుననియుఁ గోరుకొందుము.

ఆ ప్రక్కనున్న మజిలీ 'మానసంరక్షణ' బోర్డు ఇది వట్టి బూటకమే మాటలలోనే కాని చేతలలో లేదని ప్రబోధించును. ఓహో! అని మనము ముందునకు పెక్కుగా వచ్చు 'కవిప్రశంస' ఘట్టము ఉత్తమకవికి కావ్యహేతువు వేదన అనియు, భావుకత, పారవశ్యము సాధనములనియు, పండితునికన్న కవి గొప్పవాఁడనియు, శబ్దములతని భావచిత్రములను గీయఁజాలవనియు, అతఁడు జగచ్చక్షువనియు ప్రశంసించును. పిమ్మట స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు చేదోడైన మహాత్ములు, అక్రమ పరిపాలన నడ్డగించిన పుణ్యాత్ములు, సోదరమానవ ప్రేమికులు, కక్షలు జాతికి కలుషమనియు, ఇతరేతర జాతులపై వ్యతిరేకత చావవలెననియు తలఁచు, మేధావులు, ఘనులు, 'శాంతిపరులు' దర్శన మిచ్చెదరు.

ఆ తరువాతి మజిలీలలో కవి మన యెదుట నిలుచును. తన కవితా స్వరూపమును వివరించును. తన కవితాజ్యోతిని 'దీపావళిగా' వర్ణించును. 'నేను కవినోయ్' లోకమునందు జరుగు అన్యాయములను, అక్రమ ప్రవర్త నలను వెల్లడించి తీరెదనని యుద్ఘోషించును; నేను మహాశక్తిని, ప్రకృతికి సకల సౌందర్యములను జేకూర్పఁగలను, మానవులకు భక్తిని గలిగించి ముక్తి కాంతను వారిముందు నిల్పఁగలను. 'లోకాన్ని మారుస్తాను' అనును. నాలోని రాగరసము ప్రకృతి పులకింపులతో, చిరుగాలి చిగురుల మేతతో నుభికినది. ఉత్తమ కవితారీతులచే చిత్తము లలరింతును. నాకు మనసురెక్కలేర్పడినవి 'బంధాలులేవు' అనును. నేను సాధించిన 'యోగ్యజీవనము' నికృష్టముగానున్నది, ఆహారము, నిద్ర, సంభోగము అను సుఖత్రయము త్రిమూర్తులని నమ్మి

సేవించినచో జీవనము నికృష్టమగును. వాని స్థానమున ధ్వని (నాదము), దృష్టి (భ్రూమధ్య దర్శనము), భక్తి (ఆత్మతాదాత్మ్యము) గల యోగమే కవితా యోగము. కవితాకృతితో ముక్తిని సాధింతునను. అప్పుడా యోగము నికృష్టము కాదు.

ఆ పైన వచ్చు ముప్పదియైదవ మజిలీ 'నాభూమి' అందులో జన్మభూమిపై గల ప్రేమరసము తొణికిసలాడును. ఆ పైన ప్రకృతిమాత హృదయమును బులకరింపఁజేయు 'పాపలు' తల్లుల నోముల పంటలు, ముద్దుల విందు చేయుదురు. ఆ పైన 'ఆటపాటలు'. అందులో జగన్నాటక సూత్రధారి యాటలు ఆనందమును జేకూర్చును. అంతట, చివరిమజిలీ 'నా యనుభూతి'ని చేరుకొందుము.

కవి అందులో తన ద్వంద్వానుభూతిని వెల్లడించును. ప్రపంచమునందలి యే యనుభూతియు ద్వంద్వమున కతీతము కాదని తెలుపును. నిత్యసత్యమైన యాత్మానుభూతికై యత్నించుట మానవుని శ్రేయస్సుకు మూలమగునని చెప్పుటయే తన యనుభూతి సారమని యుద్బోధించును.

ఇతిశమ్

**పూజలు దేవతలకే చేయాలి.**
**సన్మానాలు కవులకే జరగాలి.**

# జ్ఞానమందిరం

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి

ఒకసారి నాకు జంగయ్యగారు కనబడి తాము వ్రాసిన ఒక పుస్తకం అందించి సహజంగా చిందులొలికే చిరునవ్వు నణచుకొని 'సారూ! ఈ పుస్తకం చదవండి. చదివిన తర్వాత మీకు నచ్చకపోతే నన్ను మీరు రచయిత అను కొనకపోయినా బాధపడను. ఏదో రచన చేశాను. దాని గుణదోషాలతో నాకు నిమిత్తం లేదు. పరిసరాలను పరిశుభ్రం చేయాలనే మహత్వాకాంక్షతో ఈ చిన్న ప్రయత్నం చేశాను. అంతే కాని నేను స్రష్టనూ కాను, ద్రష్ట సంతకం చే కాను. ఏదో సామాన్యుణ్ణి! కూసే అలవాటుంది, వ్రాసే అలవాటుంది. నోరూరుకోదు, కలం ఆగదు అన్నారు. నిజంగా రచయిత ఎలా ఉండాలో చెప్పకుండానే చెప్పే ప్రయత్నం చేశారు. శ్రీ జంగయ్యగారు ఈ కాలంలో రచనలు సాగిస్తున్న రచయితలే ఐనా శ్రీ జంగయ్యగారికి సాంస్కృతిక లాక్షణికులన్నా, ప్రాచీనాంధ్ర సాహిత్యమన్నా ఆదరాభిమానాలెక్కువ. ఆయన అన్ని రచనల్లో ఈ లక్షణం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. శ్రీ జంగయ్యగారికి కవిత్వం ఒక హాబీకాదు. ఏదో ఒక రాజకీయ సిద్ధాంతాన్ని ప్రచారం చేసుకో వడంకోసం ఆయన కలం ఎత్తరు. ఏదో కులానికో, మతానికో సంబంధించిన సమాచారాన్ని అందించడానికి తమ రచనలను సాధనంగా వాడుకోరు. ఛందో బందోబస్తులను విరగగొట్టాలని ఆరాటపడరు. పాత ఛందస్సుల్లో తప్ప రచన చేయను అని భీష్మించి కూర్చోరు. రెండు మూడు రాజకీయ పక్షాల్లో కార్య కర్తలుగా పనిచేశారు. రకరకాల మనుషులతో, పనులతో పరిచయం సంపాదించుకున్నారు. డా॥ లోహియా, కాకోజీ వంటి విశిష్ట వ్యక్తులతో కొన్నాళ్ళపాటు సన్నిహితంగా ఉన్నారు. తాను పుట్టిన గ్రామాన్ని, తాను మెలిగిన పరిసరాలనూ, తనకు తోచినట్టుగా అవగాహనం చేసుకున్నారు. సారస్వత రాజకీయ వేదికలెక్కి అనేకాంశాలపై ఉపన్యాసాలిచ్చారు. రాజకీయ జీవితం అచ్చిరాలేదో ఏమో, అధ్యాపకవృత్తి చేపట్టారు. వ్యాపారం పెట్టుకో

షుని తండ్రి ఎంత బలవంతపెట్టినా ససేమిరా కాదని బడిపంతులయ్యారు. పిల్లలకు బోధిస్తూనే తామూ వైదుష్యాన్ని సంపాదించుకున్నారు. పాఠశాల మొగమెరుగని, కళాశాల మెట్లెక్కని శ్రీ జంగయ్యకు సమాజమే పాఠశాల ఐంది. అనుభవాలే దేశికత్వం వహించాయి. తర్కనాత్మక సాహిత్యం కంటే వివరణాత్మకమైన సాహిత్యం ఉపాదేయమని ఈయన నమ్మకం కాబోలు! ప్రతి గ్రంథంలో వ్రాసుకొన్న మున్నుడులు-ఈయన వివేచనాపటిమనూ, లోకావ లోకనా విధానాలనూ చాటగలుగుతున్నవి. శబ్దార్థ సౌకర్యాల సృష్టికోసం పడే తపనకంటే, విషయవివేచనంమీద ఈయనకు గౌరవం రానురాను అధికమౌ తున్నట్లు తోస్తున్నది. నిజానికి అచ్చమైన కవిత్వాన్నీ, అందులోని రస పారమ్యాన్నీ అనుభవించగల సహృదయులు సకృత్తుగానే ఉంటారు. అందుకే జంగయ్యగారు ఎన్నిపాటలూ, పద్యాలూ, కావ్యాలూ వ్రాసినా వాచ్యార్థానికి ఎన లేని ప్రాముఖ్యాన్నిచ్చి, పఠితృలోకానికేదో సందేశాన్నివ్వాలనే కుతూహలంతో అహరహం తహతహలాడుతూంటారు. జీవితంలో ఎన్నో ఢక్కాముక్కీలు తిన్న రచయిత. అనుభూతులకంటే, అనుభవాలకే ఎక్కువ ప్రాధాన్యమిస్తారు. అనుభవాలను కాచి, వడబోసి, సూక్ష్మీకరించి ధ్వనిలోకంలోకి ఈడ్చుకుపోతే రచయితకూ, కేవలం అక్షరాస్యుడైన పాఠకునికీ లంకె ఏర్పడడం ఎప్పుడోకాని జరిగే పనికాదు. నిజాయితీని నమ్మిన శ్రీ జంగయ్య అనుభవాలను శక్తి వంతంగా చెప్పగలరు. ఆయన గ్రంథాల మున్నుడులలోని భావాలన్నీ ఆత్మ కథాపరిధిలోనికి వస్తూ ఉంటాయని పదిలంగా చదివే పాఠకునికి తెలియకపోదు. కష్టపడి చదువుకొని తమ భావాలను నిర్దుష్టంగా ప్రకటించుకోగలిగే శక్తిని సంపాదించుకున్నారు. కేవలం ఏదో వ్రాసిపారేయాలనీ, తామూ రచయితం అనిపించుకోవాలనీ ఉబలాటం శ్రీ జంగయ్యకు లేదు. తామేం వ్రాస్తున్నారో తమకు తెలిసే వ్రాస్తారాయన. ఇన్ని లక్షణాలున్న వ్యక్తి రచయితగా ఇంత కాలం మనగలిగి దాదాపు 20 గ్రంథాలువ్రాసి రజతోత్సవాలు జరుపుకొనగలగడం ఎంతో సంతోషింపదగిన అంశం. ఈ ఉత్సవాలను ప్రోత్సహిస్తున్న, సహృద యులు ఒక మంచి రచయితను గుర్తించగలిగినారనడంలో సందేహం ఉండ కూడదు.

శ్రీ జంగయ్య రచనల్లో శబ్దార్థాలకంటే, భావాలకు ప్రాముఖ్యం ఎక్కువ. అందుకే ఎక్కడైనా శబ్దాలంకారం ఒలికితే అది అక్షరరమ్యతను కోరే పాఠకు

లను తృప్తిపరచడానికేమో అన్పిస్తుంటుంది. మానవతా సందేశాన్ని సాధ్య మైనంత సరళంగా అందించాలనే కుతూహలంకొద్దీ ఆయన సూటిగా చెప్పడంలో రచన నేర్పును ప్రదర్శిస్తూ ఉంటారు. వ్యంగ్యార్థ ప్రతిపాదనం, ధ్వని ఇత్యాది మహాకవిత్వ లక్షణాలను ఆయన పెద్దలకే వదిలేశారు. అందుకే అన్ని గ్రంథా రంభాల్లో వ్రాసిన అభిప్రాయాలు శ్రీ జంగయ్య ఎంత భావుకులో, ఎంత పర హిత చింతనుడో, ఎంత ఆర్ద్రమనస్కుడో, ఎంత గట్టిగా సూటిగా అధిక్షేపించే శక్తిగలవాడో అవగతమవుతుంది. ఈ మాటను చూడండి.

"పాసిపోయిన పప్పుచారును భిక్షుకునికి దానంచేసి వెంటనే తనకోసం స్వర్గంనుండి పూలరథాలు వస్తూఉన్నాయా అని ఆకాశంకేసి చూసేవారినిగూర్చి నేను సంభావించనుగాని, మంచిపని అనుకున్న వెంటనే ఎవరి ఆజ్ఞలకు లోను గాక ఆ పనిని చేసే వానిని నేను ఎంతగానో గౌరవిస్తాను."

సమకాలీన సమాజంలోని కుళ్ళును, స్వచ్ఛమైన తన దృక్కోణంతో చూసి, తమ రచనల్లోకి అనువదించి అనేక ప్రక్రియల్లో అందించి కృతార్థు లయ్యారు.

శ్రీ నీలా జంగయ్యగారి "జ్ఞానమందిరం" వివిధ విషయాలను పొదుగు కున్న ఖండికల సంకలనం. ఇందులో కథాకావ్యం ఒకటి ఉంది. శతక లక్ష ణాలు పులుముకున్న పద్యాలూ ఉన్నవి. వచనకవితాఉంది. గీతాలూ ఉన్నవి. వృత్తాలూ ఉన్నవి. ద్విపదలూ ఉన్నవి. కావ్యాత్మ అన్న శీర్షికతో చక్కని వచనమూ ఉన్నది. ఇష్టదేవతాస్తుతీ ఉంది. పూర్వ మహాకవుల సంకీర్తనంఉంది.

ఈ సంకలనంలో 'విశాల', 'భావోదయం', శాంత సత్యల వివాహం', 'వధూవరుల పాట', 'ఆణిముత్యాలు', 'పీర్లపండుగ', ప్రబోధ సందేశం', 'గంధమందిరం', నడుస్తున్న చెట్లు', 'హాయిహాయి', 'ప్రశ్నవై దర్శించు', 'కవిత', 'కృష్ణ', 'కులం', 'నరుడు హరుడు', 'రహస్యం' అనే శీర్షికలున్న కవితలున్నవి.

'విశాల'లో ఒక కథ ఉంది. అది 'శాంతసత్యల వివాహం'తో పూర్తి ఔతుంది. కథకు పూర్వం దేవతాస్తుతి, కవితా ప్రాశస్త్యం "పసిపాప నవ్వువలె

ప్రజలు సత్కవిత”గా రూపుదిద్దుకొన్నవి. కథ వర్ణాంతర వివాహో దంతం విశ్వమానవ సమైక్య భావపేటిక. ఈ కథలోని ఛందోబద్ధ సంభాషణలు సురు చిరార్థాలను ప్రతిపాదిస్తున్నవి. రచయితకున్న విశాల దృక్పథం. నిర్దుష్టమైన గమ్యం గోచరమౌతాయి.

‘వధూవరుల పాటకు రాగతాళయుక్తంగా అభినయ పురస్సరంగా పాడుకో వచ్చు. సరికొత్త భావాల బంభరాల సవ్వడులను ఈ పాటల పద్మాల్లో వినవచ్చు.

‘ఆణిముత్యాలు’ ఎనిమిది తేటగీతి పద్యాలే ఐనా లెక్కకు మించిన నీతులను స్ఫురింపజేసే కవితా శకలాలు.

‘పీర్ల పండుగ’ కవిగారి స్వభావోక్తి చిత్రణకు మచ్చుతునక.

‘ప్రబోధ సందేశం’ మకుట నియమాన్ని గుణాశిస్తూ సాగిన 65 తేట గీతుల శతక శకలం. “లెమ్ము ఓ తెల్గువీర! వేగమ్ము దలచి” అనే మకుటం సకటంగా సాగిపోయిన ఈ పద్యాల్లో ఎంతో సందేశస్ఫూర్తి ఇమిడియున్నది.

“శత్రువులు నిర్వురే నీకు జగతియందు
ఆకలొక్కటి అజ్ఞానమరయ రెండు”

వంటి పంక్తులను ఎన్నింటినైనా ఎత్తి చూపవచ్చు. ‘గంధ మందిరం’ శ్రీమద్భగవద్గీతా సంకీర్తనం.

‘నడుస్తున్న చెట్లు’ ఇది వచనకవిత. ఇందులోని చెట్లను మనుషులకూ, రాజకీయ పక్షాలకూ సంకేతాలుగా మలచి కవి సహృదయునికి సూటిగా లోకాన్ని చూపించారు. ఈ సంకలనంలోని ఈ శీర్షిక శ్రీ జంగయ్యను కవితాప్రాంగణం లోకి ప్రవేశించే అర్హత ఉన్నదని నిరూపిస్తున్నది.

‘హోయి హోయి’ తెలు భాషకూ, తెలుగు కవులకూ చక్కని నివాళి.

‘ప్రశ్నవై దర్శించు’ ఇది మరొక వచనగీతం. మానవునిలో ఆత్మ విశ్వాసం మేల్కొవాలని తామీ గీతంలో ఠగుల్కొల్పుతున్నారు శ్రీ జంగయ్య గారు.

'కవిత'లోని ఆరు తేటగీతుల్లో ముచ్చటగా కవితాలక్షణాలను తెలుపడానికి ప్రయత్నం చేశారు కవి.

'కృష్ణ' తేటగీతుల్లో, సీసపద్యాల్లో శ్రీ కృష్ణపరమాత్మ మాహాత్మ్యమును అభివర్ణించారు శ్రీ జంగయ్యగారు.

"నీ చరణప్రసూన మధునిర్ఝరిణీ కణగర్భరమ్య సం
సేచన, బ్రహ్మయై సకల సృష్టి చరాచర జీవకోటికిం
దోచ, మదూహలో విమలతో యజమల్లన బూచి దిక్కులన్
గాచిన వాగ్విలాసి! ననుగావ నుతింతు రసైక దృష్టులన్"

అనే పద్యం ఈ శీర్షికా సరస్సులో పూచిన హృద్య పద్మకుసుమం.

'నరుడు హరుడు' అనే శీర్షికకు ఔచిత్యం ఎందుకో నాకు తోచడం లేదు. ఇందులో కవితా పారమ్యానికి కవి నీరాజనాలిచ్చినాడు.

సత్యం, ప్రేమ, కవిత్వం, జగత్కల్యాణ సంధాయకాలని ఎలుగెత్తి చాటినాడు శ్రీ జంగయ్య కొన్ని వృత్తాల్లో, కొన్ని కందాల్లో, కొన్ని సీసాల్లో, 'రహస్యం' అంటూనే అంతా తెలివిడిచేశారు.

జ్ఞానమందిరంలోని వివిధ శీర్షికలను స్థాలీపులాక న్యాయంగా పరిచయం చేసే ప్రయత్నం చేశాను ఈ చిన్నవ్యాసంలో. వ్యాసారంభంలో నేను ప్రకటించిన అభిప్రాయాలు కేవలం శ్రీ జంగయ్యగారితో నాకున్న చనువునూ, ఆయనపై నాకున్న అభిమానాన్నీ, ఆయన రచనలను గూర్చిన నా వైయక్తిక మైన తలపోతలను సూచిస్తున్నాయి.

శ్రీ నీలా జంగయ్యగారు చక్కని రచయితగా తెలుగు పఠితృలోకం ఆదరాభిమానాలను చూరగొంటూ ఉండాలని ఆకాంక్షిస్తున్నాను.

**గుడ్డివానికి తోవ చూపవచ్చు.**
**బుద్ధిలేనివానికి దెలుప కష్టం కావచ్చు.**

# మధువనం

డా॥ కె. వి. ఆర్. గోపాలాచార్యులు

కావ్యము అనగా కవనవ్యాపారమని మన అలంకారికులు నుడివిరి. విశ్వ శ్రేయః కావ్యమ్ అని యనుటలోను పరమార్థ మిమిడియున్నది. మధువనం అనే కావ్యఖండికలో ఫలజాతులు పుష్పజాతు లనేకములు ఆస్వాదయోగ్యంగా వున్నాయి. భరతుని నాట్యశాస్త్రానుసారము లాక్షణికంగాను మనం ఈ కావ్యాన్ని ఆనందించవచ్చు. సంస్కృతాంధ్ర కవుల కవితామార్గము ననుసరించినదియై సరళరీతిని ఈ కావ్యము పండిత పామరులను సైతము ఆకర్షించుచున్నదనుటలో సందేహములేదు. మంగళశ్లోకములను మనవారు తమ కావ్యసమాప్తికి గ్రథనము చేయుట కలదు. అదేరీతిని ఈ మధువనమున కూడా "శారద" తల్లిని స్తుతించి కవి తన జన్మను సార్థకముచేసికొనినాడు. ఉదాహరణకు :

మధుర బింబాధర విపంచిని
మాటిమాటికి మీటితీయని
రాగరసముల దనిపి జీవుల
నిలిపినావమ్మా ! జగముల గెలిచినావమ్మా !

అనిన కవియొక్క పరిపూర్ణ పాండితీగరిమ తేటతెల్లమగుచున్నది. శ్రీరాముని స్తుతించి 'ఆయువు' అను శీర్షికన తనభక్తి ప్రపత్తులను చక్కగా వెల్లడించు కొన్నాడీకవి. సాధారణంగా కవులు తమ కవిత్వంలో అచేతనములందు చేతనత్వం ఆరోపిస్తారు. 'కన్నీటికథ'లో ఎడబాటునుబడెనన్న మల్లెతీవెలతకు అంటున్న 'మిడుకు' మిడకటం అనే పదాలు సర్వసాధారణంగా మనం వాడుకునే పదాలు. ఏం అలా మిడుకుతున్నావు ? అంటారు. అతిసహజమైన పదజాలాలు జొప్పించబడి వున్నాయి ఈ కవితలో. ఎరజాజులు నిజంగా మురిపంగా తలలో ముడుచు కొనేవే. చేమంతుల అందాలు చూడగల కవిహృదయం మెచ్చుకోతగ్గదే.

విరహ విప్రలంభ శృంగారాన్ని మనం ఈ లతపరంగా ఆస్వాదించవచ్చును. 'భిన్నత్వంలో ఏకత్వం' అనే పరమవేదాంతాన్ని బోధిస్తున్న మరొక మచ్చు తునక–

నేనే నీవై నా లోకం
నీవే నేనై నా లోకం
ఏకమైన భావమే నా
లోకమై తనరారు స్వర్గం

అది రమణీయంగా కనబడుతుంది. దైవము నన్ను వీడి ఎలా పోతాడు? జీవాత్మ, పరమాత్మల 'తత్త్వమసి' అనే సత్యాన్ని చాటుతుంది. నేను - తాను అనే గేయం. నరనారాయణులకు భీకర సంగ్రామము వాటిల్లగలదను హెచ్చరిక కూడా కలదు.

తానే నేనను భావమున
తాను జూడకున్ననాడు
నేనే తానను భావమున
నేను తెలియకున్ననాడు
నరునకు నారాయణునకు
జరిగితీరు పెను సంగరము

'నేనే నువ్వు నీవే నేను' అనే తాదాత్మ్యత స్పష్టంగా గోచరిస్తుంది. దేవు డేరీతిగను తనను వీడిపోలేడను ఆత్మవిశ్వాసము కొనియాడదగినదియే. నాయికా నాయకుల శృంగారము అతిసరళమైన రీతిని పూతోటలో సంకేతస్థాన మేర్పరచు కొనిన వారి సహజానురాగము ఆనందములో అన్నీ ఒక్కటని చెప్పటంలో పరమానంద సద్బ్రహ్మచారి అయిన అలౌకికఆనందాన్ని గుర్తుచేస్తుంది గేయం.

అందిన యానందంలో అన్నీ ఒక్కటి అనుటలో ఆ రసాస్వాదన సహృదయుని హృదయంగమమగుచున్నది.

ఏకాంతమనే గేయంలో చంద్రుని పనికిమాలిన వాడుగా తెలుపబడింది. పాలు పనికిమాలినవాడుకాగా చుక్కల్ని చుక్కలతోసహా సహృదయుల రజింప చేయుటం రాత్రియందు శోభాయకం వుంటుంది. 'మధురగీతి'లో పార్వతీ పరమేశ్వరుల ప్రణయగాథ స్ఫురణకువస్తుంది. ఆకాశమును ఒక చుక్కలతోటగా తెలపటం అతిరమణీయంగా వుంది. రమణీయమైన పదజాలంతో కావ్య నిర్వచనాన్ని అనుసరిస్తూ గేయాన్ని వ్రాయటం ఆధునిక కవుల వైశిష్ట్యాన్ని చాటుతుంది. జోలపాటలోని ఆ లాలన ఆనందభరితమైనదని చెప్పుటలో సందియము లేదు. ప్రబోధాత్మకమైన గేయసంపుటి మనం ఇటీవల కాలంలో అరుదుగా చూస్తాం. అటువంటివికూడా ఈ మధువనంలో ఒక జ్యోత్స్న రూపంలో మన ముందు నిలిచింది. ప్రస్తుత దేశస్థితిగతులను చాటుతుంది. ధర్మం అనేగేయం. ఇతరుల యాచించటం అంత నీచత్వం లేదని బోధించటంలో పరమ ధార్మికత వెల్లడవుతుంది.

దేశరక్షణ కోరుట ధర్మం!
ఆశ వదలి జీవించుట మర్మం!
ఆదరించమని పరదేశీయుల
నడిగే భావం మనకే హేయం!

కులమతాల కుటిలత్వాన్ని ఆమూలాగ్రంగా పెకలించమనే ప్రబోధం కూడా మనం ఈ 'ధర్మం' అనేగేయంలో గ్రహించగలము. తరతరాలుగా కరడు గట్టుకుపోయిన ఈ కులమత వ్యవస్థ సమాజంలోంచి తొలగించాలన్న కవితావేశము నిజంగా సమాజవ్యవస్థను మార్చగలుగుతుందన్న నమ్మకం ప్రతి ఒక్కరికి గలుగుతుంది. బాపు చూపిన శాంతిమార్గమును ఈ మధువనంలో యిమిడ్చి మరల మరం శాంతియుత సాధనకై పురిగొల్పుచున్నా డీ కవి. పిల్లల భవితవ్యం తల్లిదండ్రులు తీర్చిదిద్దటంలో వుందను పరమసత్యాన్ని చాటుతున్న మధువనంలోని ఆదేశము అను గేయము.

మాతా శత్రుః పితా వైరీ
యేనబాలో నపాఠితః
నశోభతే సభామధ్యే
హంసమధ్యే బకోయథా॥

అను న్యాయమున పిల్లల మంచిచెడ్డలకు తల్లులే బాధ్యులు.

పిల్లల గని పెంచే ఓ తల్లుల్లారా! ఆ
పిల్లల మంచే మీదోయమ్మల్లారా!

స్త్రీయే సకల విశ్వాధిపత్యమునకు కారణమని తెలుపుట సమంజసముగా యున్నది. వైరాగ్యాన్ని ఇనుమడింపచేసే మరొక మధులతా గంధమొకటి అంతా ఒకదే అను గేయము.

శోకార్ణవ సంసారములోపల
సుఖముల వెదుకుట తప్పన్నా!
కుటిల మతులతోకూడి వసించుట
కూడదనుటదే గొప్పన్నా!

'కూటికొరకే కోటివిద్యలు' జానెడు పొట్టకోసం ఈ ఆడంబరమనే సత్యాన్ని తెలుపుతుంది క్రింది పద్యము.

చిన్నపొట్ట నింపుటకొరకేకద
చేసెటి చేష్టలు రామన్నా
నేను గొప్పనుచు పరులు తక్కువని
పిల్చుట తప్పని తెలియన్నా!

సర్వమానవ సౌభ్రాతృత్వము నేటి రాజకీయ వ్యూహంలోని విశిష్టమైన అంశాలను ప్రతిబింబింపజేస్తుందీ పాట. ఆర్థిక సమానత్వం మనం కోరుతున్నాము. అది ఆచరణలో ఏ మాత్రం కనబడటం లేదు.

ప్రతి మనిషి జీవితనౌకలో పయనిస్తాడు. కొందరు మోక్షమను పేరున విరాగులవుతారు. కొందరు బైరాగులు అవుతారు. పుణ్యతీర్థములు సేవించి కొందరు తృప్తిపడతారు. కాని ఎక్కడకు వెళ్ళినా చిత్తశుద్ధి వుండాలంటా డీ కవి. 'బాటసారి'లో ఓ మానవుడా నీ వెందుకు యిటునటు పరుగుతీస్తావు? చీకటి వెలుగులనేవి నిన్ను ఎక్కడకు వెళ్ళినా విడవవు. కన్నీరు కాంచని రాజ్యమేదీ

కానబోము. అందుచే నీ వైరాగ్యమెందులకు, గృహస్థుడవయి చిత్తశుద్ధితో మోక్షమును సాధించవచ్చును. ముందు నిన్ను నీవు తెలుసుకో. నీలోని పరమాత్మను తెలుసుకుము. ఈ క్రింది పాట పరిశీలిద్దాం.

వెలుగు చీకటి లేనిలోకం
కష్టసుఖములు లేని బ్రతుకుల
ఎత్తు వంపులు లేని భూముల
జనన మరణము లేని జీవుల
వెదకి కాంతువదెక్కడా ?
పయనమయ్యే దెక్కడా ?
పరుగుదీసే దెక్కడా ?

ఏమి ఆర్జించాలన్నా బాధలు తప్పవు. బాధతోపాటు సుఖముంటుంది. సుఖదుఃఖాలు కావడికుండలు. ఇన్నివున్న ఈ ఖండికలో విప్లవనాదంకూడా వినిపించాడీ కవి.

దోపిడి దోపిడి దోపిడి-యుగయుగాల తరబడి దోపిడి !
పేదల బ్రతుల దోపిడి
అమాయకులకే అమాసలు
మాయకులకే పున్నాలు

కార్మికలోకం కడుపుమంట కామందుల చేతుల్లో రైతుబిడ్డ అలరారుతున్న తీరు కవిని ఆవేశపరచిందంటానికి చక్కని పద్యం ఏరుకోవచ్చు.

అశాంత హృదయుల
అభాగ్యజీవుల
నిశాలోకమున నాశారేఖలు......

పసిపాప బోసినవ్వులు, చంద్రుడు ఆకాశంలోని మబ్బులలో కనబడినట్లుగా పాప ముంగురులలో ముఖము నవ్వించను ఉపమానము చాలబాగుంది.

నింగి మబ్బుల చెలిమి నీడలో రాజు
ముంగురులలో పాప ముఖము నవ్వింది.

చిచ్చిరాజు భుచిరాజు అను పదాలను వాడి సరళరీతిలో గొగ్గిపల్లుతో కూడిన పాప పలుకులను అందించినాడు. వీరరసమును పురికొల్పుచు భారత సైనికులారా! లేవండోయ్ రారండోయ్ అనే శంఖారావం పూరించబడింది. చెండాడుము అనే గేయం యుద్ధవీరులను సైతం ఆకట్టుకోగలదు.

రణజిద్దావాగ్ని శూర
భారత సైనికవీరా !
చెండాడుము చెండాడుము
నిరుపేదల మోసగించు
పరదుర్మదహంకారుల
గూండాల కుతంత్రాలను
అమాయకుల హతమార్చే
ఆహ్యాఖాన్ సైనికులను
చెండాడుము చెండాడుము......

అనే విప్లవనాదం వినిపిస్తుంది కవితలో. మరొక గేయం రా ! ప్రతివానిలో సంచలనాన్ని కలిగిస్తుంది. ఉత్తేజాన్ని విరజిమ్ముతుంది.

ప్రతిక్షణం ప్రభాఝురుల
ప్రకీర్తులను పండింపగ...రా
నరుని బ్రతుకులోని పున
ర్నవమన్నది విరియదా
చీకటి కూపాన నిండు
ఆకలి బూకలు దీరవు...
పరాంతకాళి దుస్మరా !
విరానా రా ! పురారి రా !

రా !

ఉత్తేజకరమైన భావాలతో, సృష్టినే కదిలించివేయగల భావగంభీరత కలిగిన ఈ గేయం పదే పదే పాడుకుంటాం. తెలుగుజాతిమీద గౌరవాన్ని, తెలుగుజాతి ఔన్నత్యాన్ని నలువైపుల చాటింపచేయాలని తన మధువనంలో సాగరా! ముందుకు సాగరా! అనే గేయాన్ని సృష్టించటం జరిగింది.

అది త్రిలింగ శ్రీ విభవము
అఖిల మహోన్నతికి జవము
వరవీర విహారసీమ
అరివీర భయంకరమని
సాగరా ముందుకు
సాగరా!

తన తెలుగుగడ్డమీద అప్యాయత, తన దేశాన్ని గౌరవించుకోవటం ఈ గేయంలో తెలుస్తుంది.

ప్రియుడు తన చెలితో మాట్లాడు చందము చెలిగనవే అను గేయంలో ఈ క్రింది విధమున తెలిపినాడు.

మంచిపోపు వెన్నెలలో
మనిషి వలపు పండెనహో
తొలిరేయికి వలపు పాఠ
ములు నేర్పిన వలరాజు
మన మొక్కటిగా గూచిన
వినువీథిని సాగునే

అని వలపు కన్య సౌకుమార్యం తెలుపుచున్నదీ గీతిక.

చంటిపిల్లలు దేవునితో సమానమంటారు పెద్దలు. అట్టి పాపల కన్నులలో స్వర్గాలెన్నో చూపిస్తున్నా డీ కవి.

ఈ పాపలే పరమాత్ముని రూపాలు
ఈ లోకమెల్ల నిండి ఆడిపాడేను

అనటంలో కవి చిన్నారి హృదయాలలో చొచ్చుకొనిపోయాడని చెప్పవచ్చు.

పారంపర్యంగా వస్తున్న దాస్యశృంఖలాన్ని ఛేదించుకొని విడిపోదాము అని అంటాము. 'అడిగే దెవ్వ'రను గేయంలో.

నలుగురిలో మనము
కలిగిపోయి బ్రతకాలా!

మన ఐక్యతను కాపాడుకోమని హెచ్చరిక కూడా తెలుస్తుంది.

విశాలాంధ్ర సాధించిన
వీరుల యాశయ మిదియా
మనమైక్యత కోల్పోతే
మన నడిగే దెవ్వరురా!

ఈ లోకంలో విడదీసే వాళ్ళేకాని ఐక్యం చేసేవాళ్ళు లేరని నీతిని బోధిస్తుంది గేయం.

ఎవరివే అను గేయంలో

మధుర మందారముగ సు
స్మిత దుకూలము కదలగా
శతశతానందాలు పండిన
గతిని నా మది పొంగి నిల్తువు

ఎవరివే: అనొక రమ్యకావ్యాత్మనేమో రసజ్ఞతను వెలిబుచ్చుట చాల రమ్యముగా కనబడుచున్నది. చెలిమిని తేనెతో పోల్చటం చాల ఆధునికం.

ఇక్ష్వాక కాలమునాటి అతి ప్రాచీనమైన సాంప్రదాయములను అప్పటి సామాజిక స్థితిగతులను కళ్ళకు కట్టినట్టుగా తెలుగుపండగలో తెలుపబడినది.

కాకతీయుల ఖడ్గతేజము
సింగభూపతి చిద్విలాసము
తెలుగుజాతికి జీవకళికయి
...తెలుగు భూముల బలము నిలిపిన
తెలుగు పండుగ వచ్చుచున్నది

ప్రపంచ తెలుగు మహాసభల అతిమనోహరమైన సాహిత్య సమారాధన మన కందించినా రీకవి.

చైతన్యదేవత అను గేయమున భూమిని పంచభూతముల సంచయ మన్నాడు. ఈ సంచయము, సంచయనమని పదాలు సాధారణంగా మనం వింటున్నవే.

రసాన్ని ఒక దేవతగ ఆరాధించటం ఏ కావ్యంలో అంతగా చూడం. అటువంటి రసదేవతకు ఊపిరిగా నిలిచి కవితామ తల్లిని స్తుతించి తమ వినయ మును ప్రకటించిన కవి ధన్యుడు. ఇకముందు కార్యక్రమమును తెలుపుచు

కవితల పంటలు పండించేము
నవరస రాగము లొలికించేము

అని కవుల నందరిని ప్రోత్సహించటం ఈ కవి కవితాసౌభాగ్యానికి నిదర్శనము.

మధువనంలోని యీ గేయసంపుటి వివిధ భంగిమలలో నృత్యముచేయు నాట్యలతికవలె ప్రతివానిని ఆకర్షించగలదని ఆశిద్దాం.

**నన్మతులు మామిడి పండ్లు**

**చిలుకలా కళ్ళు తిర్చే వాండ్లు**

# దర్శనము

**టి. గౌరీశంకర్,** ఎం. ఏ.,

సమాజం పరిణామశీలి, సాహిత్యం సమకాలీన స్థితిగతులకు దర్పణం. ఆ యా కాలాల్లో వెలువడే సాహిత్యం సామాజిక పరిణామాలతోపాటు మార్పులు పొందుతుంది, మలుపులు తిరుగుతుంది. ఇందుకు మత, సాంఘిక, రాజకీయ ఆర్థికాది పరిస్థితులు దోహదపడతాయి.

తెలుగు సాహిత్య చరిత్రను పరిశీలిస్తే ఆదికావ్యమయిన భారత రచన వెనుక ఆనాటి మత, సాంఘిక, రాజకీయ పరిస్థితులు ప్రేరణ వహించి, కారణ భూతమయ్యాయి. భారత రచనానంతరం వెలువడిన సాహిత్యం చాలావరకు ఏదో ఒక ఉద్దేశానికి, ఉపదేశానికి, ఉద్యమానికి ఉపబలకంగా వెలువడినదే.

ప్రాచీనయుగంలో, ప్రధానంగా మత ప్రచారానికి, ధర్మ ప్రతిష్ఠాపనకు సాహిత్యం అంకితమయితే, ఈనాటి ఆధునికయుగంలో సామాజిక సమస్యల సజీవ రూపకల్పనకు, ఆర్థిక, సాంఘిక, రాజకీయాది పరమయిన వ్యసనాలకు, వ్యాఖ్యానాలకు అద్దం చూపేదిగా రూపుదిద్దుకొంది.

ప్రతి కవి కూడా తాను వ్రాసింది సమాజానికందించాలని, సమాజం నుంచి దానివల్ల కలిగిన "రియాక్షన్"ను గమనించాలని ఆశిస్తాడు. ఈనాటి కవిత్వం చాలావరకు ప్రజలకోసం వ్రాయబడుతున్నది కాబట్టి ప్రజల భాషలో ఉండాలనే ఉద్దేశంతో ఈనాటి ఆధునిక కవి వచనకవితా ప్రక్రియను చేపట్టి, వ్యావహారిక శైలి ననుసరిస్తున్నాడు. ఆధునిక భావవ్యక్తీకరణకు, సామాన్యుడి లోగిలిలోకి వెళ్ళి పలుకరించేందుకు వచనకవితా ప్రక్రియ "కవచం" లాంటిదని భావించడం, తదనుగుణంగా ఈనాడు వచనకవిత బహుళ ప్రచారం పొందింది.

ఈనాడు కవిత్వం రాసేవాళ్ళలో దాదాపు ఎనభై శాతం వచనకవితా ప్రక్రియను చేపట్టిన వాళ్ళే. అంతమాత్రాన వీళ్ళకు ఛందోబద్ధమయిన పద్యం,

గేయం రాయడం రాదని భావించడానికి వీల్లేదు. ఇప్పుడిప్పుడు, పద్యకవులుగా ప్రసిద్ధికెక్కినవాళ్ళు కూడా వచనకవితలు రాస్తున్నారు. మొదట మనవిచేసినట్లు సామాజిక పరిణామాల దృష్ట్యా సాహితీ ప్రక్రియలు కూడా మారుతూ వుంటాయి.

ఇలా వచనకవిత్వం, పద్యకవిత్వం రాసి మెప్పించగల కవులు ఈనాడు చాలా కొద్దిమంది మాత్రమే కనిపిస్తున్నారు. అలాంటివారిలో శ్రీ నీలా జంగయ్యగా రొకరు.

వీరు ప్రాచీన కవితా సంప్రదాయాన్ని జీర్ణించుకున్న వారే గాక ఆధునిక కవితాపోకడలను, సమకాలీన సామాజిక సమస్యలను ఆకళింపు చేసుకున్నవారు. అందుకే వీరు పద్యం రాసినా, వచనం రాసినా మెప్పించగలరు.

"దర్శనము" అనే వీరి ఖండకావ్యం పద్యం, గేయం, వచనం మూడింటి యొక్క సంగమం. సాధారణంగా ఆధునిక కవులంతా అభ్యుదయ దృక్పథాన్ని రచనలలో కనబరుస్తున్నవారే. అంటే మార్క్సిజమ్, భౌతికవాదం పునాదిగా, ఆకలి, అన్యాయం, ఆవేదన, ఆర్థిక అసమానతలు వస్తువులుగా తీసుకొని, సగటు మనిషిని కథానాయకునిగా చేసుకొని రచనలు చేస్తున్నవారే.

కానీ, ఈ కవి "దర్శనము"లో ఇహలోకానికి సంబంధించిన భౌతికావసరాలు, నిత్యనైమిత్తిక కార్యక్రమాలు, రాజకీయాలు, రచ్చబండలు, రగిలే గుండెలు, దోపిడీలు, రాపిడిలేగాక-విశ్వసృష్టి, మానవాతీత శక్తి, ఆ సృష్టికర్త గవేషణ, దైవరహస్యాన్ని తెలుసుకోవాలనెడి తపన, జిజ్ఞాస, ఆధ్యాత్మిక చింతన కూడా దర్శనమిస్తాయి.

తీసుకొన్న ఆయా వస్తువులను బట్టి కవి తన ప్రతిభా వ్యుత్పత్తులతో పద్యంగా, మాత్రాబద్ధమయిన గేయంగా, వచనంగా నడిపించారు. వాటిలో కొన్నింటిని విహంగ వీక్షణంలా స్పృశించడానికి ప్రయత్నిస్తాను.

కావ్యాదిలో, కవి తన పీఠికలో - ''నాకంటె పెద్దవాడవయితే ఈ పుస్తకాన్ని చదవడం మానేయి, చిన్నవాడవనుకొంటే చదివేసేయి..." అని మనవి చేశారు. నిజంగా ఇది చిన్నవాళ్ళుగాక - అంటే ఇక్కడ 'చిన్నా, పెద్దా' అన్నది

వయసుతో పరిగణనలోకి తీసుకోవలసినదికాదు; మనోవికాసాన్ని, బుద్ధి పరిపక్వతను బట్టి తీసుకొన్నట్లయితే-పెద్దవాళ్ళు చదివి అవగాహన చేసుకోవలసిందే.

'రాముడు', 'కృష్ణుడు', 'శివుడు', 'వెంకటేశ్వరుడు' అనే పేర్లతో వ్యవహరించబడే భగవంతుడు అనేవాడు అసలు ఉన్నాడా, లేడా అనే మీమాంసలోకి దిగకుండా, మానవాతీతమయిన ఒక శక్తి ఉందని; ఈ చరాచర జగత్తు సంతా ఆ దివ్యశక్తి నడుపుతుందనే నగ్నసత్యాన్ని అందరూ ఒప్పుకొని తీరవలసిందే. ప్రపంచం వైజ్ఞానికంగా ఎంత ముందుకు వెళుతున్నా,

ఆ శక్తిని వారి వారి అభీష్టానుసారంగా సాకారంగా, నిరాకారంగా భావించి పూజించుకొనే వారున్నారు.

కవి ఈ 'దర్శనము'లో మొదట 'పల్లవింతు, అనే శీర్షిక గల కవితా ఖండికలో ఆ విశ్వపతిని సంస్మరిస్తూ—

'నీకయి సందె తంబురను నిర్మలనాదము లీన మీటితిన్' — అని అంటారు.

ఇక్కడ కవి తన హృదయంలో ప్రతినిత్యం నిర్మలమయిన మనస్సుతో ఆ భగవంతుని నామగానం చేస్తున్నానని చెప్పారు. ఇక్కడ రెండు విధాలుగా అన్వయం చేసుకోవచ్చు. ఓ ప్రభూ ! వికార, ప్రలోభ భూయిష్టమయిన నా ఈ హృదయతంబుర నుంచి మలినరహితమయిన, స్వచ్ఛమయిన, అపశ్రుతిలేని రాగం వెలువడే దాకా నేను మీటుతూనే వున్నాననీ, అంటే వీటినుంచి విముక్తి కొరకు నీ నామగానం చేస్తున్నానని ఒకటి, ఈ హృదయ తంబురను నీ నామోచ్చారణతో మీటగానే నిర్మలమయిన నాదం వెలువడుతున్నదనీ-అంటే నీ నామ మహిమ వల్ల పాపపంకిలం పటాపంచలయి పోయిందనే రెండవ భావాన్ని గ్రహించవచ్చు. ఇక్కడ 'తంబుర' అనే పదప్రయోగం ఎంతో ఔచిత్యంగా ఉంది. తంబుర అనే వాయిద్యాన్ని సాధారణంగా సర్వసంగ పరిత్యాగులు ఉపయోగిస్తుంటారు. అంటే ఇక్కడ కవి తాను ఇహలోక పరమయిన కామ, క్రోధాది అరిషడ్వర్గాన్ని పరిత్యజించి, నీ అన్వేషణకై సర్వసంగ పరిత్యాగసనయి బయలుదేరాననే తత్త్వాన్ని చెప్పకనే చెప్పారు.

అదే ఖండికలో ఒకచోట.

> ''విశ్వవిఖ్యాత సాహిత్య వేణుపును
> పాటగా మానవతను సప్తస్వరాం
> ... ... ...
> ... ... ...

అంటూ కవి ఇక్కడ మానవతా వాదిగా దర్శనమిస్తారు.

మరొకచోట— నేడు నవనాగరికత వేస్తున్న వెర్రితలలను ఖండిస్తూ ఈ శిలీముఖాన్ని వదిలారు—

> "ఒక్క జడదానినిం జూచి చక్కబుక్క
> నాగమును మించి నీ జడ నాట్యమనుచు
> కత్తిరింపుల కురుల గమ్మత్తు గాంచి
> ఏమి వ్రాయునొ కవిరాత ఖామెరుక"

అదే భావ తీవ్రత కలిగిన మరో బాణం—

కాలగతి శీర్షికలో ?

> "నాగరికతకై ఒక పంగనామ మిడుచు
> ఆడమగలకు నొకయింత తేడలేని
> హిప్పి వేషాలతో మతిహీనులగుచు
> రామకృష్ణ హరే యన్న రమ్యమగునె"—

హిప్పీ వేషాలతో వచ్చిన 'హరే రామ హరే కృష్ణ' ఉద్యమాన్ని కవి నిరసించారు. గంజాయి, నల్లమందు వంటి మత్తుపదార్థాలకు బానిసలై, ఆ భగవంతుని స్మరించటం అన్నది మహానేరంగా పరిగణించారు.

భూమి, ఆకాశం, గాలి, నీరు, వెలుతురు అన్నవి ఆ సృష్టికర్త నిర్మితాలు. కాలగమనం, ఋతు సంక్రమణం ఆ అతీతశక్తి నియుక్తాలు. శిశిరంలో మోడు వారిన ప్రకృతి వసంతపు రాకతో చిగురిస్తుంది. జగమంతా రాగరంజిత మవు

తుంది. ఇది ప్రకృతి ధర్మం, కాలగమనంలో ఒక మజిలీ. దీని నెవ్వరూ ఆప లేరు, ఉద్దేశపూర్వకంగా చేయనూలేరు.

ఈ ఆమనిలో అరుదెంచే ఉగాది పర్వాన్ని గూర్చి ప్రస్తావిస్తూ— "ఉగాది" అనే శీర్షికలో కవి ఒకచోట—

ఎంతకాలంబు నిబ్బువి సంతరించు
కొన్నదో తెల్పు వారిట నున్నవారె.
కాలమే భూమియై తిరుగాడు చుండ
బొంగరము తిర్గునన నుబ్బిపోదురెవరు :—అంటారు.

సృష్టి, లయ అన్నవి చర్విత చరణాలు. ఎన్నో యుగాలనుంచి ఎన్నో తరాలు ఈ కాలాంబుధిలో కలిసిపోయి మళ్ళీ కొత్తయుగం, కొత్తతరం అన్నవి ఆవిర్భవిస్తూనే వుంటాయి; ఇది ఒక గొలుసు చక్రం వంటిది. కానీ సృష్ట్యాదిని, కాలగమన ప్రారంభాన్ని మాత్రం ఇతవరకు ఎవ్వరూ ఫలానా నాటినుంచి అని చెప్పలేకపోయారు. ఈ అనంత కాలభ్రమణం అన్నది దాని సహజగుణం, బొంగరంవలె! బొంగరాన్ని సూత్రధారి తిప్పినంత వరకు అది తిరుగుతూనే ఉంటుంది. బొంగరాన్ని ఒక వ్యక్తి ఎలాగయితే తిప్పుతున్నాడో అలాగే ఒక అదృశ్యశక్తి ఈ భూమి అనే బొంగరాన్ని తిప్పుతోందని కవి ఇక్కడ స్పష్ట పరుస్తున్నారు. ఆ శక్తిని ఎవరయినా కనుగొన్నారా అని ప్రశ్నిస్తున్నారు. కను గొనేందుకు ప్రయత్నం చేస్తున్నారా అనే ఆర్తి మూర్తీభవించింది కావ్యంలో.

కవి పరలోక మోక్ష సాధనకై ఆధ్యాత్మిక చింతననే కాదు, ఇహలోక జీవన సౌరభ్యానికి వేళ అభ్యుదయాన్ని సంభావిస్తున్నారు.

"సంక్రాంతి" అనే శీర్షికలో - ప్రాంతీయ దురభిమానాలతో ఈరిక వెత్తిన స్వజాతి కలహాన్ని గర్హిస్తూ, సకల జన సమైక్యతను కాంక్షిస్తూ—

క్రాంతి పథమును గూర్చు సంక్రాంతి లక్ష్మి
తెలుగు వారి వైరమ్ముల ద్రెంపగాత
... ... ... ...
... ... ... ...

మానవోన్నతి కాదర్శ మానమయ్యి
సమసమాజ సమున్నత సరణినెంచి
సదయ కవితలు నవ యుగాభ్యుదయమునకు
జయ జయ ధ్వాన రవములు సల్పుగాత !

అంటారు.

కవి చూపు కేవలం నింగి (దైవసన్నిధి) మీదే కాదు నేలమీదా వుంది. "విజయరథము" అనే శీర్షికలోని ఈ ఖండికలో మార్క్సిజం దృక్పథం కనపడుతోంది. ధనస్వామ్య వ్యవస్థ నశించాలి, సమసమాజం అవతరించాలనే నినాదం వినపడుతోంది. గమనించండి-

కూడు లేక నిలువ నీడ
గూడు లేక తరతరాలు
వెనకబడిన జనమంతా
విధిగ నేడు కదలాలి !
ఒక్కడెవడొ ప్రకృతిధనము
మెక్కకుండ చూడాలి !!
... ... ...

కర్షకులూ కార్మికులూ
పీడితులూ తాడితులూ
తరతరాల పెను దరిద్ర
దావానల కీలలో
... ... ...

అనే ఖండిక శ్రీశ్రీ కవితాత్మలోని ఉద్వేగాన్ని, శ్రీశ్రీ కవితాశైలిలోని వేగాన్ని స్ఫురణకు తెస్తుంది.

పరభాష, పరభావ, పరదేశ, పరజాతి
... ... ... ...

పరధ్యాస, పరవిత్త, పరవింత, పరచింత
... ... ... ...
మతిహీన, గతిహీన, పతిహీన, సుతహీన
... ... ... ...
కులభేద, మతభేద, ఇలభేద కలహాల
... ... ... ...

అనే పంక్తులు లయబద్ధంగా సాగి, నడకలో సొగసులను, సొబగులను కనబరుస్తాయి.

"నడిచే దివ్వెలు" అనే శీర్షికలో—

"నడిచే దివ్వెలు—నరులే దివ్వెలు"

అంటారు ఈ కవి.

నిజమే! నరుడు తనలోని స్వార్థచింతనను చంపుకొని. త్యాగనిరతిని పెంచుకొని, తన్ను తాను కరిగినా, నలుగురికీ మంచి చేయాలనే సద్బుద్ధితో వెలిగినప్పుడు — కవి ఇదే కావ్యంలో "నరాంధము" అనే శీర్షికలో చెప్పినట్లు—

చీకటులు రెండు తెరగులు లోకమందు
ప్రకృతి తోబుట్టువె భూమి గ్రాలె నొకటి
ఒకటి మానవుడొనరించె సకల ముడుప
నరుని చీకటి దుష్కర్మ నరకమయ్యె !
... ... ...
చమురు వత్తుల దీపాల చావదాయె
విద్యుదాత్మక కాంతికి వీగదాయె
ఈ ఉపాకాయ కాల్పులకేగదాయె
చీకటులు మ్రింగి జీవించు చీకటాయె......

ఈ చీకట్లన్నీ నరుడు దివ్వెగా వెలిగినప్పుడు తొలగిపోతాయి.

"అఖండాంధ్రము"లో — నే కాదు దేశంలో

అట్టడుగు వర్గాల వారిపట్ల ధనికవర్గాల వారుగనుక న్యాయవర్తనులయి మెలగకపోతే, సమాజంలో సహనం సన్నగిల్లిన బడుగువర్గాలు తిరగబడ తాయని, అప్పుడు పిల్లిని గదిలో బంధించిన చందాన బీభత్సం జరుగ తుందనీ, అది దేశానికి క్షోభయేగాని శోభకాదని కవి ఇక్కడ శాంతియుత విప్లవాన్ని ఆహ్వానిస్తున్నారు.

విప్లవమనగానే కత్తులు, మంటలు, నెత్తురు, శవాలు అనే దురభిప్రాయం వుంది కొందరిలో. ఇది తప్పు. గాంధీజీ ప్రవచించిన అహింసా సిద్ధాంతం కూడా ఒక విప్లవమనవచ్చు. మానవ కల్యాణానికి జరిగే ప్రతి మార్పు ఒక విప్లవమే అవుతుంది.

బడుగు జనమున బలిసిన వారుగనక
నాదరింపకపోయిన నాడు కీడు
దేశగర్భాన రగులుచు తీవ్రమగుచు
క్షోభ జెందిన నాడేమి శోభగనము

జంగయ్యగారి పద్యాలుచూసి జడుసుకోనక్కరలేదు. సాధారణంగా పద్యం అనగానే పఠితకు (ఈ తరం వాళ్ళకు) కొంత ఇబ్బందిగా వుంటుంది. ఆడంబర పదజాలంతో, సంధులతో, సమాస భూయిష్టమై, పదాన్వయ క్లిష్టమై కొరుకుడు పడని నారికేళ పాకంలా అనిపిస్తుంది. కానీ జంగయ్యగారు నిత్య వ్యవహారంలోని పదజాలంతో పద్యాన్ని సరళంగా, సాఫీగా నడిపి(ఈ తరం వాళ్ళ కోసమేమో) అరటిపండు వొలిచి చేతికిచ్చినట్టుగా చెబుతారు. ఇవి గమనించండి,

ఆసనము క్రింద కుంపటి వేసి తలను
తడుపు బట్టద్దునటువంటి వడుపులెల్ల
మోసము లటంచు దెలిసిన ముందువారి
బ్రతుకు పరిమళ సోపాన పంక్తి నడచు

పైన జంగయ్యగారి పద్యాలలోని సారళ్యతను గూర్చి విడమర్చి చెప్పిన నేను ఇక్కడ ఈ పద్యం సారాంశం చెప్పనక్కర్లేదనుకొంటాను.

"స్వరాజ్యము" శీర్షికలో భారతదేశంయొక్క పూర్వ వైభవ ప్రాభవాలను కీర్తించి, చిరకాల దాస్యశృంఖలాలను ఛేదించి, స్వాతంత్ర్యం సాధించి తెచ్చిన వీర యోధులను, త్యాగనిధులను సంస్మరిస్తూ, అమూల్యమయిన ఆ స్వాతంత్ర్యం ఈనాడు స్వార్థం, సంకుచితత్వం' కుహనా రాజనీతి, ముఠాతత్వం ప్రబలటంవల్ల ఛిన్నాభిన్నమైపోతుందనే విచారాన్ని వ్యక్తపరుస్తున్నారు.

... ... ... ... ...

... ... ... ... ...ఉ

న్నతమగు మానవత్వమును నవ్వులపాలొనరించె నింకయే
గతి నవభారతమ్ము మును కమ్మని జీవనమందు నక్కటా!

కవి తెలుగు పలుకుబళ్ళను, జాతీయాలనుకూడా సందర్భోచితంగా వాడారు-

హీనపు వర్తనన్ మతి విహీనులు గద్దెలనెక్కి దున్నపో
తీనిన దన్నచో పెరటి యింటను గట్టుమటంచు బల్కి...

... ... ... ... ...

... ... ... ... ...

ఈ కావ్యానికి మకుటమయిన "దర్శనము" అనే శీర్షికగల కవితా ఖండిక నిజంగా ఈ కావ్యానికి మకుటం వంటిది. హృదయం వంటిది. అందుకేనేమో కావ్యం మధ్యభాగంలో (హృదయస్థానంలో) అచ్చొత్తించారు.

ప్రకృతి, ఆదిపురుషుల సమాగమము, జీవసృష్టికి, అనంత ప్రాణికోటికి మూల రహస్యాన్ని రసభరితంగా చిత్రించారు. ప్రణయ రాగాలు జీవితంలో భాగాలు. కానీ మోహమే జీవితంకాదు, జీవన్మోక్షమూ కాదు. మోహాంధకారంలో కన్నుల యెదుట ప్రత్యక్షమయిన ఈశ్వరుణ్ణి దర్శింపక, తదనంతర దశలో పరితప్త చిత్తుడై మానవుడు తన జీవన చరమాంకంలో చేసే ఆక్రందనను, రసస్పందనను ఈ 'దర్శనం'లో ఆవిష్కరింప జేశారు. ఒకచోట-

అట యముండెందుకో యగుపించి నన్ను
హితము బల్కుచు సన్నిహితు జేసుకొనియు
జనులకు సన్మార్గమును జూపి తనకు
పని కొంత తగ్గించమని బల్కినాడు.

ఇది చాలా భావగర్భితంగా ఉన్నది. భూలోకంలో పాపకృత్యాలు చేసిన వాళ్ళు యమలోకానికి వెళ్ళి అక్కడ ఈ పాపాలకు పరిహారంగా శిక్ష ననుభవిస్తారని కదా మన పురాణాల నమ్మిక. ఆ విధంగా భూమిమీద నానాటికి పాపుల సంఖ్య హెచ్చుతుందని, చచ్చాక వీరందరికీ శిక్ష విధించటంలో యమలోకాధిపతికి కార్యనిర్వహణాభారం నానాటికీ అధికమవుతుందనీ, ఈ భారాన్ని తగ్గించమని కవిని కోరాడట. అంటే, ఇక్కడ భూలోకంలో పెరుగుతున్న పాపుల సంఖ్యను తగ్గించడానికి వారిని సన్మార్గంలోకి మళ్ళించాలి. దీనర్థం కవి తన రచనల ద్వారా ధర్మప్రబోధం చేసి ప్రజలను పుణ్యపథంలో నడిపించాలని.

ఈశ్వరుడే సత్యం, ఆ సత్యమే శివప్రదం, శివమే ప్రకృతియంతా నిండిన సుందర స్వరూపం! ఆతడు సర్వాంతర్యామి అని చెబుతూ-

'నామ రూపములెల్ల తానై నీమముగ లోకాలనేలే
స్వామి కాకారమ్ము లేదట సత్యరూపము తానె యౌనట
చిగురు తానై ఆకు తానై చెట్టు తానై జగము నిండే
ప్రాణులన్నిట ప్రాణితానై పాట తానై వెల్గు శివుడు

'ప్రాణులన్నిట ప్రాణి తానై' అనే చోట పరమాత్మ యొక్క ప్రతిరూపమే జీవాత్మ యని, పరమాత్మ యొక్క ప్రత్యంశంగా జీవాత్మలు రూపు దిద్దుకొన్నాయన్న వేదాంతాన్ని బోధించారు.

ఈ చరాచర జగత్తుకు మూలశక్తి, ఆదిశక్తి, ఈశ్వరాన్వేషణలో కవికి గల జిజ్ఞాస ఇక్కడ తేటతెల్ల మవుతుంది-

హృదయమున ప్రశ్న యొక్కటి ఉదయమయ్యె
అంతుపట్టని ప్రకృతికి - అయ్య ఎవడు
అతని గన్న మహాశక్తి కాది దైవ
మెవ్వరీ ప్రశ్న నన్నాయకేడుపించు

జనన మరణాలు, మానవకోటి పెంపుదల, వియోగ సంయోగాల గూర్చి గణితశాస్త్ర పరిభాషలో ఈ క్రింద చాలా చక్కగా వివరించారు.

కూడికలు తీసివేతలు గుణకములును
భాగహారాలు గణితాన బరగు విధము
చిన్న పెద్దల భిన్నులై భిన్నులగుచు
గుణకముల భాగాహారాల కూడి యంత్రము!

పాంచభౌతిక నిర్మితమయిన ఈ శరీరం నశ్వరమయినదనీ, ఇక్కడ సాధించిన, సంపాదించిన ఆస్తి ఐశ్వర్యం, కట్టుకొన్న భార్య, కన్నపిల్లలు ఏవీ కడకు మనవెంట రావని, చేసుకొన్న పుణ్యం, పెంచుకొన్న మంచితనమే మనకు తరగని సంపదలనే హితవు గరపుతున్నారు "విజయదశమి" అనే శీర్షికలో—

నిను నమ్మించిన జీవపంచకము నిన్నే మోసముంజేసి బా
సిన నా డాలును బిల్లలున్ హితులు నీచే గూర్చు విత్తావళుల్
గని నిన్నాయక వచ్చెనా? సుకరమౌ కర్మంబులే దప్ప భూ
మిని యోధాగ్రణి వన్న కీర్తి మిగిలెన్ మేల్గాదె శూరాగ్రణీ!

"అంధ్య సౌందర్యము"లో నానాటికీ ఉన్నవాడు ఇంకా ధనవంతుడవుతున్నాడనీ, లేనివాడు లేమివాడవుతున్నాడనీ, ఈ అసమానతను గని కవి అంగలార్చారు—

ఉన్న ప్రకృతినిధులు కొన్న వానివియయ్యె
లేని వాని కలిమిలేమియయ్యె
ఓటు పేదదయ్యె సీటు ధనికునిదయ్యె
కలిమి సీటు మెచ్చు ఘనునిదయ్యె

విషయ వాసనాసక్తి గల ఉన్మత్తులను, మోహాంధ చిత్తులను జగదాధారుడైన ఆ ఈశ్వరుడు ఎట్లా అగుపిస్తాడని కవి ప్రశ్నిస్తారు "ముకుర ముఖీ!" అనే శీర్షికలో.

జగమున తమ్ముదామె గనజాలని చంచల చిత్తులై భ్రమన్
దగిలి నిరంతరాత్మ సుఖ దర్పణమందె వశుండు నౌటనే
మగుపడు సత్యజీవన మహాత్మ్యము రమ్యవసంత భామినీ
దృగమల హాసచంద్రికలు ఈరని మోహవభావ సంపదల్

మిగులం ఫలమేమి'లో

... ... ... ...
... ... ... ...
కాశీనాథుడు దప్ప వి
నాశమె కాంక్షింత్రు మనుజనాథులు భూమిన్

శరణుజొచ్చిన శత్రువునైనా రక్షించే దొడ్డగుణం ఆ ఈశ్వరునికే కం దనీ, కుటిలవర్తనులైన ఈ రాజులు, నాయకులు సగా సాటిమనిషి వినాశమే కాంక్షిస్తుంటారనే మానవ నీచస్వభావాన్ని బహిర్గతం చేశారు.

"నెగులనేమి" అనే శీర్షిక గల కవితా ఖండికలో కుళ్ళు, దగా మోసం నిండిన ఈ ప్రపంచం నుండి పలాయనం చిత్తగించడమే ఉత్తమ మార్గ మంటారు కవి—

పరమ దుర్మార్గులైన ఈ నరుల మధ్య
బతుకు చిలుకమ్మ పడరాని పాట్లకోర్చి
మూగదై కాలగర్భాన దాగవలసె
మిగుల ఫలమేమి లోకాలు నెగులనేమి
... ... ... ...
అన్యాయం-అంతస్తుల రాతిభవనమై వెలసితె
న్యాయమేమొ పూరిగుడిసెగా నేలను కరచినా
డిగాలుపడి ఇనబింబం భిక్కమొహంతో నడిస్తే
పట్టపగలు వీథులలో చట్టబద్ధమా దోపిడి !

"నిరుపేదా !" అనే శీర్షిక గల ఈ కవితా ఖండికలో చండిక కరవాలం లోని పదును, ఆవేశం, ఆక్రందన ఒక్కుమ్మడిగా కట్టలుత్రెంచుకున్న ఏరులా ప్రవహించింది !

-3

"అంతే"లో కూడా అంతే!

ఈ కావ్యానికి మంగళం పాడుతూ కవి మంగళప్రదమయిన ఉవాచ చేశారు—

"మనుషులంతా జ్ఞానధనులై - మనుగడకే ప్రాధాన్యమిత్తురు!
మనిషి మంచై దైవమును మరపించునాడే భూమి స్వర్గం!!

నిజమే! నీలా జంగయ్యగారి 'దర్శనము'లో దర్శించిన ఈ ఆదర్శాల వల్ల సమాజంలోని మానవుడు మాధవుడిగా దర్శనమివ్వాలి; అప్పుడు ఈ భూమి స్వర్గంగా మారుతుందనడంలో అతిశయోక్తి లేదు.

**నాకు మేలుజరిగి**
**నీకు కీడుగూడాలనేవాడు**
**ముందల వడతు.**

# కవితా సమాలోచనలు

—ఎల్లూరి శివారెడ్డి

కొందరు మహాకవులు. వారి రచనలు భావతృప్తిని మాత్రమే కలిగిస్తవి. మరికొందరు మహారచయితలు. వారి గ్రంథాలు పాఠకులను ఉత్తేజితులను చేస్తాయి. ఇంకా కొందరు సాహిత్యవేత్తలు ఉన్నారు. వారి రచనా సామర్థ్యం దేశానికి ప్రగతిదారిని చూపిస్తుంది. ఇది కవుల కోవ, రచయితల త్రోవ.

నీలా జంగయ్యగారి రచనలను చదువగా విమర్శకులకు కొన్ని భావాలు తలెత్తడం సహజం. నిజం చెప్పాలంటే సమర్థుడయిన రచయిత విమర్శకుని ఆలోచనా నిమగ్నుని చేస్తాడు. విమర్శకుడు తన అనుభవాలను ప్రాథేయంగా గ్రహించి, ఇతరుల అభిప్రాయాలను వానితో మేళవించి సాహిత్య తత్త్వాన్ని ఆవిష్కరిస్తారు. జంగయ్యగారి "కవితా సమాలోచనలు" పేరుకు తగ్గట్టుగానే ఆలోచనా లోచనాలు. జగత్తు భావమయం. మానవుడు భావజీవి. సృష్టి యావత్తు భావతరంగితము. ఏకాగ్రచిత్తుడైన కవి హృదయం శ్రుతిచేసిపెట్టిన వీణ వంటిది. ఎంత చిన్నసోకుడుకైనా స్పందిస్తుంది. ఆ స్థితిలో ఉండి చేసిన రచన ఈ "కవితా సమాలోచనలు".

జంగయ్యగారు కవి, విమర్శకుడు, అధ్యాపకుడు. కవి యొక్క రసనేతృత్వం, విమర్శకునికి సంబంధించిన అనుశీలనం, అధ్యాపకుల ధర్మమైన బోధన ఈకవికి ఒక వర్చస్సును ప్రసాదించినవి. "ఈ లోకంలో ఎందరో పుట్టినారు, ఎందరో చచ్చినారు. కాని అందరు బ్రతకలేదు." (పు-14) అంటాడు ఈ కవి. తమచుట్టూ ఉన్న ప్రకృతికి అనుగుణంగా, ఆదర్శంగా, నిరాశ నీలినీడలు సోకకుండా బ్రదుకమని ఈ కవి సందేశం. చెప్పడం తేలికే, అలా బ్రదికి చూపించండని పాఠకులు నిలదీసి అడిగే ప్రమాదం కూడా ఉంది. అలా జీవిస్తేనే ప్రమోదం, జీవించలేకుండా ఉంటే ఉన్మాదం. జంగయ్యగారు

"నే ననే మాటను మీరే అన్నట్టుగా చూసుకోగలిగితే ఎంత బాగుంటుంది" (పు. 18) అని మనం అడుగకముందే నోరు మూయిస్తారు.

మరి ఈ రచనలో నవ్వులూ ఉన్నవి. ఏడుపులూ ఉన్నవి. నిట్టూర్పులు కూడ గోచరిస్తవి. అవి సంఘంలో కవికి కనిపించిన భిన్న ప్రవృత్తులు. ఎదుటి వాడు ఏడిస్తే నవ్వే మనము, మనం ఏడిస్తే ఎదుటివాడు నవ్వుతాడని తెలుసుకోక పోవడం నవ్వులాట కాకుంటే మరేమిటి. అందుకే నీలావారు "ఈ ప్రపంచంలో నిజము తక్కువ అబద్ధము యెక్కువ" అంటారు. "కవిని పూజింప నేర్చినాడు పవిత్రుడు. పంచమహాపాపి కవిని గుర్తించలేడు" (పు. 27) ఈ మాట వినగానే కవులంపరు పుణ్యాత్ములా, తక్కినవారందరూ పాపాత్ములా అని మనం అడిగితే జంగయ్యగారి సమాధానం ఎలా ఉంటుందో! కవులు "దేవుని ప్రతి రూపులు" (పు. 28) అని మాత్రమే చెప్పగలరేమో అని నా మట్టుకు నాకు తోస్తుంది. పుణ్యపాపములు ఒక తెగకు సంబంధించినవి కావు, అవి నడతకే పరిమితములు.

జంగయ్యగారి సమాలోచనలను ప్రత్యేకంగా ఎత్తిచూపడం ఏటికి ఏతాం ఎత్తడం లాంటిది. ఇది ఒక వ్యావహారిక సూక్తికోశం వంటిది అనవచ్చు.

ఏ రచయిత ఆత్మీయితనైనా తెలుసుకోవడానికి ప్రయత్నం చేసినప్పుడు అతని వాక్యాల మాటున దోబూచులాడుతున్న నైజగుణం (Instinct) కనిపెట్టడానికి మనం ప్రయత్నం చేయాలి. "కవి జ్ఞానేచ్ఛ చెప్పదల్చినాడో యది లక్ష్య శుద్ధిగా చెప్పినాడా యన్నదే రచనయొక్క పరమార్థం" (పు. 65) అని ఈ కవి ఉవాచ. వీరు చెప్పిన లక్ష్యశుద్ధి నేడు మన రచయితలలో చాలా మందికి పూజ్యం. ఇతరుల భావాల బరువులను మీదవేసుకొని కుంటినడక నడుస్తూ సాహిత్యమార్గంలో కల్లోలం సృష్టిస్తున్న వీరి బెడద విశ్వానికి తప్పేదెన్నడో! దాన్ని దృష్టిలో ఉంచుకొని కాబోలు జంగయ్యగారు "శ్రీశ్రీ వలె నేను వ్రాయలేను. నావలె శ్రీశ్రీ వ్రాయలేడు" అన్నారు. ఇతరుల ప్రభావం మన మీద పడరాదని దీనిద్వారా ఆయన ప్రకటించారు.

నీలావారు పద్యాలు, గేయాలు, వచనకవిత్వం సమర్థవంతంగా వ్రాయగలిగిన వారు. పద్యగుణం గేయానికి, గేయగుణం పద్యానికి ఈ రెంటితోని

లయ వచనానికి అతికించడంలో పేరు నేర్పరులు. అందుకు తగిన శబ్దపుష్టి వీరికి గొప్ప వరం. భావబలం ఉన్నా పదజాలం తక్కువగా తెలిసిన కవుల రచనలు పేలవంగా ఉంటవి. జంగయ్యగారి భావవైశాల్యమూ, పదవైభవం, నిర్మాణ కళతో పొంది పొసగిన రమణీయ కమనీయ కవనీయాలు. అందుకే వారు కవులుగా లబ్ధప్రతిష్ఠులు.

‘మధురం మధు తస్మాచ్చసుధా తస్యాః కవేర్వచః’

ఇది చంద్రాలోకంలోని మాట. మాటమాత్రమే కాదు కవి సాహిత్య జీవనఫలం. [illegible]నుంచి పైకి ఉబికిన రచనాశ్రమ బహుక్లిష్టమైంది. సర్వాంగ సుందరమైన తన కృతి ఆకృతి చూసుకోగల్గిన కవికి ‘హాయి బాధారూపము’ (పు. 117) అనిపించును.

ఈ రచనకు పీఠిక కూర్చిన పెద్దలు జంగయ్యగారిని ఎంతో సంభావించారు. నా కెందుకోగాని తమమాటగా నివేదన వ్రాస్తూ ‘ఈ సమాలోచనలు మౌన శైలికి సంబంధించిన వగును’ అన్న వారి వాక్యమే రుచికరంగా ఉంది. (పు. 28). వీరి తెలంగాణ పలుకుబళ్ళు అత్తరుకంటె ఆహ్లాదకరంగా ఉన్నవి.

ఈ రచనలనుగూర్చి మరిరెండు మాటలు చెప్పి విరమిస్తాను. జంగయ్యగారు నేటికంటె రేపు బాగా ఎదుగుతారు. వారి రచనలో తాత్త్వికతాభావాలు నిండారినవి. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అన్నట్లు రచనల్లో తాత్త్వికత పెరిగితే సంఘంలోకూడా పెరుగుతుంది. భావశబలతతో కూడిన ఈ రచన సహృదయులకు భావభోజనం. భావతృప్తికంటె మించిన తృప్తి - బ్రహ్మానందం తప్ప - మరేదీ లేదేమో అనిపిస్తుంది. భావతృప్తి పొందలేనివాడు శిలకంటె, మలకంటె మందుడు. జంగయ్యగారి పుస్తకం చేతబట్టిన వారికి వివిధములైన భావాలు మనోభిత్తికమీద దృశ్యమానం అగును. అవి కలకాలం పాఠకుని హృదయంలో ఉల్లాసం కలిగించటానికి సమర్థాలు. పేదల ఆకలి, రాజకీయ నాయకుల అల్పబుద్ధి, స్వార్థపరుల బెడద వీటినిచూసి కవిగారు ఆక్రోశించారు. ‘ప్రపంచమున కవులు శివతాండవము చేయాలి. లోకాలకు చైతన్యాలు రావాలి. అని వారి సూక్తి. ఇటువంటి సూక్తులే భావుకులకు విందుభోజనం. ఈ కవిగారి ఈ రచన కలల వెన్నెల పంట.

# ఆవేదన

## డా॥ ఎస్. జి. రామానుజాచార్యులు

కవిరత్న శ్రీ నీలా జంగయ్యగారితో నాకు 13 సం॥ ప్రగాఢ స్నేహం ఉన్నది. బహుకాలం క్రితం వరంగల్లులోని పండిత శిక్షణకళాశాలలో మేమిద్దరం కొంతకాలం ఒకేచోట గడపాల్సి వచ్చింది. అదే మా ఇద్దరి ప్రథమ పరిచయ సోపానం. పరస్పరం అర్థంచేసికొన్న ఆ సమయాన్ని మేమిద్దరం ఏనాడూ మరచిపోలేం. నిజానికి జంగయ్యగారిలో ఆనాడే నవనవలాడే కవితా చైతన్యాన్ని నేను దర్శించాను. ఒక్కొక్కసారి కవిరత్న దారిలో కూడ స్వీయ కవితలను ఆవేశంతో నాకు వినిపిస్తుండేవారు. ఆనాడు నేను కన్న, విన్న కవితలన్నీ వారు ప్రచురించారో లేదో కాని వాస్తవంగా ఆ కవితల్లో కనిపించే భావ పరంపర, రసావిష్కారం, చైతన్య విస్ఫురణ ఇప్పటికీ నన్ను గిలిగింతలు పెడుతూనే ఉంటాయి. దాదాపు పాతిక సంవత్సరాలుగా కవిరత్న కవితాదీక్ష నిరంతరం కొనసాగుతూనే వుంది.

మొన్నీమధ్య జంగయ్యగారి కవితా రజతోత్సవాలను నిర్వహింపదలచిన పరిషత్తువారి నుండి 1956 లో వారు రచించిన ఆవేదన కావ్యపరిచయం చేయవలసిందనే విజ్ఞప్తి నా కందినది. అది నా చిరకాల మిత్రుని కవితాసంకలనం. పైగా వారి కవితావాహిని ప్రవహించిన తీరు తెన్నుల్ని వివరించే సదవకాశం. కాదని ఎలా అనగలను. సరే అనుకొని ఆవేదన ముఖపత్రంపై ఉన్న కవిరత్న కంఠం నుండి వెలువడిన అక్షరపంక్తిని ఇట్లా చదివాను.

కరడుగట్టిన హిమానీ హృది
కరిగి నీరై స్రవిస్తున్నది
పాటలై ఆవేదనాధర
కవిత నాలో పొంగుతున్నది

గాలితరగల తేలిపోనీ
మట్టిలోపడి మాసిపోనీ
శుక్తి గర్భంలోన పడినది
మౌక్తికాకృతి తాల్చుకోనీ

కరడుగట్టిన హిమనగ హృదయం భేదిల్లి కరగి జీవనమై లోకాన్ని ఆనందపరవశం చేసినట్లుగ, ఆనాటివరకు క్షుభితమమౌతున్న జంగయ్యకవి హృదయం బ్రద్దలై ఆవేదనాభర కవిత పొంగి పొరలింది. బాధామయ జన జీవన గాథ కవి ఆవేదన. ఆనాడు క్రౌంచ ద్వంద్వ వియోగోత్థమైన భవ్యకవితా వేశుని శోకమే శ్లోకంగా మారింది. వ్యథిత జనాళి వేదన జంగయ్య కవిరోదన. తన ఆవేదనాభర కవిత గాలితరగల తేలిపోయేది పోయినా, మట్టిలో పడి మాసి పోయేవి పోయినా, శుక్తిగర్భంలో పడినవి మాత్రం మౌక్తికాకృతి తప్పక దాలుస్తుందని జంగయ్య కవి విశ్వసిస్తున్నారు.

ఇచ్చట శుక్తిగర్భం-మౌక్తికం అను పదాలు సాభిప్రాయ ప్రయోగాలు. శుక్తిగర్భంలో పడిన హిమబిందువు మౌక్తికాకృతి దాలుస్తుంది. సహృదయ హృదయ కుహరంలో చొరబడిన రసనిష్యందమగు కవితాబిందువు కవితామృత మనబడుతుంది. మౌక్తికం స్వసౌందర్య ప్రకాశమానం, ఆనంద స్వరూపం కవితామృతం కూడా అంతే. తన రచనలలో కొన్నైనా సహృదయ మనో గ్రాహ్యం కాకపోతాయా? అని కవి భావన. జంగయ్య కవిది కేవల కవిత కాదు. ఆవేదనాభర కవిత ఆవేదన ఆక్రందనయొక్క ఆంతరరూపం. జీవకారుణ్యానికి పర్యాయపదం, నవరసాల్లో అగ్రగణ్యంగా కనిపించే కరుణరసం, తనగుండెలో దాగిన శోకం (కరుణం) అంత, ఇంత అని చెప్పకి 'నా గుండెలోని శోకం ఈ గుండు లెరుగునోయి.' అని జంగయ్యకవి చమత్కారంగా కరుణరసాన్ని గూర్చి సహృదయులకు నివేదిస్తారు. శాస్త్రీయధోరణి ననుసరించి లౌకికంగా ఏర్పడిన శోకాదులు కావ్యపరిభాషలో స్థాయి శబ్ద వాచ్యాలై రస స్వరూపా లౌతాయి.

నాట్యశాస్త్రకర్త నిర్దేశానుసారంగా విభావాది సామగ్రీ సముల్లసితం కానప్పుడు రసత్వ ప్రతిపత్తిని ఎలా సాధిస్తుందని ఇచ్చట ప్రశ్నించవద్దు. స్థాయీదశను పొందిన నిర్వేదాదులు కూడ రసములౌ తాయని రుద్రటు డేనాడో

అంగీకరించాడు. జంగయ్యకవి కావ్యంలో కష్టజీవులు, క్షుధార్తులు, దరిద్ర నారాయణులు నాయకులు. ప్రబంధాలలో వాచ్యరూపంగా గోచరిస్తే ఇచ్చట వ్యంగ్య ధోరణిలో ధ్వని సంకేతంగా స్ఫురించి, స్ఫురించనట్లు వస్తువు గోచరిస్తుంది. తాడిత, పీడిత వర్గాన్ని జంగయ్య ఎలా సంభావిస్తున్నారో చూడండి—

1. రెక్కలాడిన రేబవల్ బుక్కెడైన
   పొట్ట యాకలి చల్లార్ప బువ్వలేక
   ఘోర దారిద్రబాధల కుంది కుమిలి
   కూలిపోయెడి తాపురాల్ దేలుబెట్టు? -భగ్నహృదయం

2. అన్యాయముగ పేదయన్నల ఇల్లు దోచి
   గుడి గట్టి పుణ్యంబు గోరువారు ,,

3. మిత్తిమిత్తని బీద మెతుకుల్లందోచి
   చీమలకు చక్కెరబోయు మాన్యజనము ,,

4. అట్టి కుటిలులె, ప్రభువులై యవనియందు
   పేదవారల కండలు బీకి తినగ
   పుట్టియున్నారు పెద్దలై పుడమి వారి
   బ్రతుకు బండలుగాను ఏగతిదలంతు ,,

5. మెత్త నిరాశా జలధిలో
   మానవుని బ్రతుకే నీడల్లా పరిణమించే
   నీడయే ఏనాటికైనా వెలుగుగా - దైన్యత.

6. ప్రకృతి దయతలచి వరమిచ్చిన నిరుపేదను
   కరకు చూపులతో కను లెఱ్ఱజేయును లోకం
   — ప్రకృతిమృగతృష్ణ

మహాకవి కీట్సు ode to a nightingale లో తన సోదరుని అకాల మృత్యువు వల్ల కలిగిన బాధకు విచలితుడై కవిత్వ ప్రాయముగా [illegible] కవి సాంఘిక వ్యవస్థలో దగాపడిన తమ్ముళ్ళ అన్నలై తత్తిరిల్లు నారాయణుల [illegible] లకు చలించి కవిత్వరూపంలో ఆవేదిస్తాడు.

కవిత ఆనందమయం కావాలన్నారు ప్రాచ్యులు. ఉపదేశమయం కావాలన్నారు నవ్యులు. విశ్వమానవ కల్యాణాన్ని సాధించే జంగయ్యకవి భావపరంపరలో ఈ రెండూ పుష్కలంగా లభిస్తాయి. మచ్చుకు కొన్ని కవితా ఖండికలను దర్శిద్దాం—

1. మతము కులమను మాటలు మసియొనర్చి
   వాడు వీడను చెత్తభావనలు విడచి
   అందరము సోదరులమని ఆత్మనెంచి
   కదలవలె నిద్రలను పీడకలలు వీడి — అస్పృశ్యత

2. తుట్టతుదకును తనమేనితోలుకూడ
   చీల్చియిచ్చును అగ్నిలో కాల్చుకొరకు
   అట్టి తరుకున్నయట్టి జ్ఞానాతిశయము
   మానవులకుండదేటికో మది నెరుంగ — సత్పురుషుడు

3. ఒకరు తలనూనెలేక నింకొకరు యత్త
   రులను పన్నీరు ఘమఘమల్ వెలయుచుంద్రు
   ఇట్టి ఎత్తువంపుల బాటనెట్లు దేశ
   శకటగమనమ్ము సాగును శాంతగతుల. — భగ్నహృదయం

   అడుగు కన్నతల్లికి పట్టెడన్నమిడరు
   కాని చచ్చిన తండ్రికి రానిపోని
   తద్దినములెన్నొ పెట్టెదు తనయులకును
   పుట్టుగతు లుండునే క్రౌర్యపూరితులకు — భగ్నహృదయం

కులమత వ్యవస్థను, స్వీయపరభావనను వీడిన సర్వమానవ సౌభ్రాత్రం, సర్వసమానత గల మూఢాచారాలు లేని వ్యవస్థను నెలకొల్పాలని కవి ఆక్రోశిస్తున్నారు. "చక్రార పంక్తి రివగచ్ఛతి భాగ్యపంక్తిః" అను వాక్యంలో కవితల గురుత్వ సాంఘిక వ్యవస్థలో ఆర్థికంగా వెనకబడటం లేదా ముందుకు వెళ్ళటం అనేవి చక్రాల వంటివనీ వాటి భ్రమణం తప్పనిసరి అనీ వివరించారు; కాని జంగయ్యకవి అసమానతల్లో దేశశకటగమనం శాంతపథంలో ఎట్లా పయనిస్తుందని విలపిస్తున్నారు.

సాంఘిక వ్యవస్థను యథాతథంగా లేదా కల్పితంగా చిత్రించటం పూర్వ కవి లక్ష్యం. సాంఘిక వ్యవస్థ కుళ్ళుగా కళావిహీనంగా మారినప్పుడు ఇట్లా ఉంటే ఎలా? ఇది పద్ధతి కాదని గర్హించటం నవకవి నివేదన. అదే జంగయ్య కవి ఆవేదన. అందువల్లే తన కావ్యేతివృత్తం ఇది అని జంగయ్య కవి ఇలా ఆవిష్కరించారు—

'శ్రాంతి విశ్రాంతులనుగూడి రచనసేయ
దలచి జీవన వృత్తంబు గొలచినాడ -కారుణ్యవార్థి

అన్యాయం, ఆక్రమణ, దురహంకారం, హింస - వీటిని చూచి చలించని కవి ఉండడు. ఆవేశపూరితుడైన వ్యక్తి కవిగా మారటానికి ఇవి ఒక్కొక్క సారి ఉపకరిస్తాయి. నేటి సాంఘిక జీవితంలో ఎన్నెన్నో మహత్కార్యాలు చేస్తూకూడ కొందరు అనామకులుగా ఉండిపోతారు. ఏమీ చేయనివారు కూడ న్యాయమూర్తులుగా చలామణి ఔతున్నారు. ఇందుకు జంగయ్యకవి హృదయం 'ఆత్మాహుతి ఒకడైతే-అధినేతగ మారునొకడు' అని క్షోభించింది.

ఒక్కొక్కసారి క్రిక్కిరిసిపోయే సాంఘిక సమస్యల్తో సతమతమౌతూ ఇదమిత్థమని తేల్చలేక హతాశులై జంగయ్యకవి ఎదురు ప్రశ్నలు వేస్తారు చూడండి—

'ఎండమావులలోని నీడలను నీళ్ళుగా భావించిన
దాహము గొన్నవాని గతి యేం కావాలి?
తిరుగుబాటు చెయ్యాలా? చావాలా?'

సాంఘిక జీవితంలో మోసం సర్వత్ర వ్యాపించిందనీ, అది ఎండ మావుల్లాంటిదనీ అక్కడ ఏదో లభిస్తుందని ఆశగొన్న పిపాసార్తునికి శూన్యమే ఎదురౌతుందనీ అలాంటి సమయంలో 'తిరుగుబాటు చెయ్యాలా? చావాలా' అని సరిపూర్ణకాత్మకంగా ప్రశ్నించారు జంగయ్యకవి. దీనికి సమాధానం 'అమ్ముల పొదిలో ఒక నిజమ్మిలాగు' అను వాక్యంలో కన్పిస్తుంది. ఒక నిజాన్ని లాగటానికి అవసరమైతే ఆయుధాన్ని పూనాలని జంగయ్యకవి ఉద్బోధిస్తున్నారు. ఇలాంటి భావాలను పరిశీలించినప్పుడు 'కవిరత్న' విప్లవసీమకు సమీపంలో ఉన్నట్లు కన్పిస్తారు.

కేవలం శ్రామికవర్గాలు, బడుగుజీవులు, దరిద్రనారాయణులే కాక పాల బుగ్గల పసిబిడ్డలు, వారి నవ్వులు-ఆ నవ్వులకై తమ సర్వస్వాన్నీ త్యాగంచేసే మాతృమూర్తులు, మాతృవాత్సల్యాన్ని పూజనీయ తత్వయుతా జంగయ్యగారి ఈ కవితా ఖండికల్లో దర్శనమిస్తారు-

1. ఆ మూగనవ్వులో అర్థమేమిటోగాని
కలచివైచును దుర్జనుల ఎడంద — పెంపుడుతల్లి

2. అట్టి ప్రేమయె నాలోన నతిశయిల్లి
కొండవలె భారమైదోచె గుండెపైని
పరువులెత్తెడి జలరాశి తరగలట్లు
పొంగి పొరలెను ప్రేమాబ్ధి నింగిదాక — మాతృశ్రీ

3. శాశ్వతానంద రాశియై సాగునట్టి
మాతృవాత్సల్య మేరీతి మరువనెంతు ,,

4. నీ చంకలో నిల్చి నెలవంక జూచిన
స్వర్గసౌఖ్యమువేరు జాటగలమె ? ,,

5. నీదు ఋణబంధము క్తికై ఈదులాడు
కంటె నింకొక స్వర్గసౌఖ్యంబుగలదె ? ,,

6. అట్టి మాయమ్మ ప్రేమలో దట్టుకొనియు
ఆమెలో లీనమగుటయే అమరసుఖము ,,

రుద్రటుడు, విశ్వనాథుడు మొదలైన ఆలంకారికులు నవరసాలనేకాక ప్రేయోరసాన్ని వాత్సల్యరసాన్ని కూడ అదనంగా స్వీకరించారు. ఈ కోవకు చెందిన కవితా ఖండికలు జంగయ్యకవి కావ్యాల్లో కోకొల్లలుగా కన్పిస్తాయి.

నిరంతర ఉత్సాహంతో విశ్రాంతిలేక పయనించే కవితా రథసారధి జంగయ్యకవి. రానున్న పాతిక సంవత్సరాల్లో పూర్తికొన్ని అభ్యుదయ కావ్యాలను రచించి స్వర్ణోత్సవాలను కూడ ఘనంగా జరుపుకుంటారని ఆశిస్తున్నాను.

# కాంతిపుంజాలు

-డాక్టర్ అంతటి నరసింహం
ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారాల ప్రత్యేకాధికారి

'పుంజ'మంటే సమూహం అనిఅర్థం. పుంజాలు అంటే సమూహానికి బహువచనం. అంటే సమూహాలు అనిఅర్థం. "కాంతిపుంజాలు"లో అనేకమైన కాంతిసమూహాల సమూహాలున్నాయన్నమాట.

ప్రకాశమానమైన విషయాలు ఇందులో వున్నాయి. బహుధా ప్రకాశించిన వ్యక్తుల గూర్చిన ప్రశంసలిందులో వున్నాయి.

సర్వశ్రీ డాక్టర్ విశ్వనాథ సత్యనారాయణ, డాక్టర్ దాశరథి, డాక్టర్ నారాయణరెడ్డి, దేవులపల్లి రామానుజరావు, కాళోజీ, మిరియాల రామకృష్ణ, డాక్టర్ దివాకర్ల, మసంతరావు వెంకటరావు, డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు, డాక్టర్ ముకురాల, ఉన్నత రాజకీయ పదాధిష్ఠితులు సంజీవయ్య, కోదాటి నారాయణరావు, ఉమ్మెత్తల కేశవరావు, మండలి వెంకట కృష్ణారావు, కొణిజేటి రోశయ్య మొదలయిన కవిపుంగవుల, రాజకీయ వాదుల కీర్తికాంతులే ఇందు ప్రకాశితములు. ఒక్కొక్కరు ఒక్కొక్క కాంతిపుంజము. అందరూ కలిస్తే కాంతిపుంజములు.

పై అందరియెడా గల భక్తి గౌరవాలు ఇందు ప్రదర్శితాలు. అంతేగాని వారేదో ఈ కవికి ఇస్తే వాళ్ళగూర్చి పొగడడంగాదు. దీనివల్ల ఈ కవియొక్క మృదువైన ఉదారమైన మనస్తత్వం బయటపడుతున్నది.

నీలా జంగయ్య ఈ కవి పేరు. 'జంగమ' అంటే నడుస్తున్న శివుడు అని శైవగ్రంథాలు చెబుతున్నవి. అంటే నీలాకారంలో నడుస్తున్న శివుడు అని మనం శ్లాఘించి గూర్చి చెప్పవచ్చు. నేను మాత్రం ఈ పేరుయొక్క వెనుక ఉండే

ఒగా ఉచ్చరిస్తూ వుంటాను. అంటే జంగా నీంయ్య అని. అంటే నడుస్తున్న కృష్ణుడు అని. కవులు కలుసుకున్నప్పుడు పరస్పరం ఛలోక్తులు విసురుకుంటారు గదా!

ఈ కవి చిన్నప్పటినుంచీ కవిత్వ "పిచ్చి"గలవాడు. పెద్దల దగ్గర చేరి అమరం ఆంధ్రనామ సంగ్రహాదిగా సంప్రదాయపద్ధతిలో చదువుకొన్నవాడు. పేదరికం చేత చదువు కష్టసాధ్యమయింది. అందరిలాగా వరుసగా స్కూళ్ళల్లో కాలేజీల్లో, విశ్వవిద్యాలయాల్లో చదవలేకపోయాడు. విద్యయందు ఎంత పట్టుదల వుందోగాని ప్రైవేటుగానే కట్టి పెద్దపెద్ద పట్టాలను గూడా పొందాడు. కవి కావాలని తపస్సుచేశాడు. నేటికి అనేక గ్రంథాలు వెలువరింపగలిగాడు. నేడి తెలుగువారల్లో కవి అనిపించుకున్నాడు. పట్టుదల వుంటే మనిషి ఎంత ఉన్నతి కయినా పోగలడనడానికి శ్రీ జగయ్య ప్రబలమైన ఉదాహరణ.

బ్రతకడానికి చిన్న చిన్న ఉద్యోగాలు చేశాడు. విద్యలో ఒక్కొక్కమెట్టే ఎక్కి ఉద్యోగాల్లోగూడా ఆ విధంగానే ముందుకు సాగుతున్నాడు.

వ్యక్తి సౌమ్యుడు. చక్కగా నిండుగా చిరునవ్వుతో పలకరిస్తాడు. మర్యాదగా ప్రవర్తిస్తాడు. ఉన్నతుడుగా వుండిగూడా వినమ్రుడుగా కనిపిస్తాడు. ఇవన్నీ ఎందుకంటున్నానంటే పైగుణాలన్నీ అతనిలో ప్రత్యక్షంగానూ, కవిత్వంలో పరోక్షంగానూ కనిపిస్తున్నాయి గాబట్టి.

కాంతిపుంజాలు ఈ గ్రంథానికి సార్థక నామధేయం. వర్ణింపబడ్డ ప్రతి వ్యక్తీ సమాజంలో సుప్రతిష్ఠులు. కాంతిమంతులు. వారి కాంతులూ, వీరిపై కవి ప్రసరింపజేసిన కాంతులూ కలిసి కాంతిపుంజాలయ్యాయి.

ఇందులో పద్యరచనా, గేయరచనా కూడా వున్నాయి. రెండింటిలోనూ ప్రజ్ఞ కలవాడే ఈ కవి.

తాను స్వతహాగా కష్టపడిన వ్యక్తిగాబట్టి కష్టజీవులంటే చాలా సానుభూతి ప్రదర్శిస్తారు. వారిని దోచుకోడం చూచి బాధపడతారు.

"బలవంతుల కోపాలు
దుర్బలుల ప్రాణాలు బలిగొంటున్నప్పుడు"

"చాలామంది ఆశల్ని-ఆశయాల్ని-బ్రతుకుల్ని
ఏ ఒక్కడో వమ్ముచేసి సొమ్ముచేసుకొనడం"

వంటి ప్రయోగాలు సార్థకంగా కనిపిస్తాయి పైన చెప్పిన బాధకు.

వ్యంగ్యప్రధానమైన కవిత్వం వ్రాసేవాడు సమర్థుడైన కవి. ఈ కవిలో అవసరమైన పాలు వ్యంగ్యం ఉన్నది.

గాంధీనిగూర్చి వ్రాస్తూ, ఉద్రేకాన్ని వ్యక్తంచేశాడు. ఆ తర్వాత గాంధీ ఆదర్శాల గాదుగదా ఆయన జీవితాన్నే మరిచిపోతున్న మనజనంపై కోపగించు కుంటాడు. చెట్టు పేరుచెప్పి కాయలమ్ముకొనే రీతిలో, గాంధీజీపేరును ఉపయో గించుకొని బాగుపడేవారిని వ్యంగ్యంగా చెప్పుతున్నాడు.

'ఇప్పుడు బ్రదికున్నా, గాంధీకి-
స్వాతంత్ర్య మహావీరయోధుడని
నెలకొక్క వెయ్యి రూపాయలైనా
ప్రభుత్వం శాంక్షన్ చేసిఉండేదని'

పై పాదాలు శబ్దశక్తి, కవితాశక్తి తెలిసినవారికి అర్థం కావడంగాదుగదా హృదయంలో మెచ్చికోలు నిండుతుంది.

కాళోజీ కవిత్వం అంటే - వ్యక్తిత్వం అంటే - బాగా నచ్చినట్లుంది కవికి. నచ్చడమే గాదు. తాదాత్మ్యంగూడా వ్యక్తమవుతుంది. 'కాళోజీ' అనే శీర్షిక గల కవనమంతా మహాభావగమనంతో నిండివున్నది. ఆ భావాలతో తాదాత్మ్యం పొందకపోతే కవి ఇంట్లాంటి భావాలు వ్రాయలేడు.

'పరదాస్యం స్వజనదాస్యం వంటి దాస్యపదాన్నే
అసహ్యించుకుంటాడు'

'స్వాతంత్ర్య పోరాటంలో జయించామన్న ఆనందాన్ని
కోట్లనుంచి వదుల్లోకి దించుకుంటున్న విరాగి'

'నిజం ప్రదర్శిస్తే తల ఎగురునేమో నన్న భయం
అతన్ని చూస్తేనే భయపడుతుంది'

పైన స్వతంత్రత, సత్యనిష్ఠ, నిర్భీకత చక్కగా అక్షర రూపంలో ప్రతిబింబితమయ్యాయి.

ఈ కవి రాజకీయవాది. కమ్యూనిష్టుగా ఉండి, కాంగ్రెస్‌గా ఉండి, పిదప ప్రాంత సోషలిస్టుగా మారారు. ఇది అధిరోహణక్రమమో, అవరోహణ క్రమమో. ఏమయితేనేమి, ఈయన దృష్టి ప్రజాసేవ, బాధితజనసేవ, సమసమాజ సంస్థాపనాపేక్ష.

ఈ కృతిభర్త శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు నేటి సాహితీ సేవకాగ్రణి. సెలా జంగయ్య యొక ఆదినుండీ ఆర్ద్రిత భావంగల వ్యక్తి. ఈ విషయం ఉభయులనుంచీ విన్నాను.

రామానుజరావుగారంటే ఈ కవికి ఎనలేని గౌరవం. గ్రంథకర్తృత్వము నెడా, గ్రంథభర్తృత్వమునెడా గూడా ఆయనకుగల దక్షతను అతివేలంగా లెక్కించి తాను గూడా తన గ్రంథాన్ని అంకితం చేశాడీకవి.

నవీనత, వ్యాసమంజూష, విశాలాంధ్ర పోరాటము మొదలయిన దశాధిక గ్రంథకర్తగా వుండగా, శివశంకరస్వామి, దాశరథి, మునిమాణిక్యం, సినారె, జ్ఞానానందకవి. పోతుకూచి, సిద్దయ్యకవి, జంధ్యాల, వాసిరెడ్డి సీతాదేవి, గుంటూరు శేషేంద్రశర్మ, పల్లా దుర్గయ్య మొదలయినవారెందరో తమ తమ కృతులకు శ్రీ దేవులపల్లిని భర్తగా ఎన్నుకొన్న కారణాన ఇంత గిరాకీగల వరునకు తన కృతికన్యను కూడా యిచ్చి [illegible] చరితార్థుడు.

"సరసాత్ముడనిగదా సాహిత్యకౌముదిన్
కృపమతినిచ్చె శేషేంద్రశర్మ

ఇట్లాంటి దశానేకపద్యాలు రచించి రామానుజరావుగారి త్రిదశత్వాన్ని కొనియాడు. త్రిదశత్వం లేకపోతే ఇంపరు (కృతి) కన్యల సరసత్వంతో గదపటం కానిపన్నిగదా!

పద్యకవిత్వం వ్రాసేవాళ్ళలో చాలామంది పడికట్టురాళ్ళ సహాయాన్ని పొందుతూ వుంటారు. సార్థక పదప్రయోగ దృష్టివహించిన కవి పద్యాల్లో తప్ప, ఫరవాలేదనుకొనే పురాణపద్ధతి కవిత్వం వ్రాసేవాళ్ళు పడికట్టురాళ్ళ ప్రయోగాన్ని పాటిస్తూవుంటారు. ఈ స్థితి మహాకవి నామాంకితుడు బమ్మెర పోతన్నకే తప్పలేదు. మన కవిగారి "సురగిరి విద్యార్థుల టోర్నమెంటు" శీర్షిక గల పద్యాల్లో ఈ పడికట్టురాళ్ళు చాలాచోట్ల చోటుచేసుకున్నవి. ఏమయితేనేమి 'నిరంకుశాః కవయః.'

నీలా జంగయ్యగారి కావ్యరచనా వ్యాసంగం కొనియాడదగినది. ఇప్పటికే ఎన్నో పద్యగేయ కావ్యాలు వెలయించారు. అనేక సత్కారాలు పొందారు. ఇంకా వ్రాస్తున్నారు. త్వరలో శతాధిక గ్రంథకర్త కాబోతున్నారు.



"ఎవడు కవి యన్నమాట ఈ యవనిమీద
తేలలేదింక ముందును తేలబోదు
ప్రతి ముఖంబున కవిత ప్రస్పందమొందు
అది పురాకృత పుణ్యభాగ్యంబు బండి"

(నీలా జంగయ్య రమ్యపథం నుంచి)

# రామలింగ పద్యాలు

...డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం

శ్రీ నీలా జంగయ్యగారు నాకు పరిచయమై దాదాపొక అయిదారేళ్ళ యింది. ఎప్పుడు ఆయన నన్ను కలిసినా లోకాభిరామాయణం మాట్లాడడు. ఏదో సాహిత్య విషయమే ప్రస్తావిస్తుంటాడు. తరచు ఆయన రచనల గురించీ ఆయన సాహిత్య దృక్పథాన్ని గురించీ, ఆయన రచనల వెనుక ఉన్న స్వీయ వేదన గురించీ మాట్లాడుతుంటాడు. విమర్శకులకు కావలసిందీ అదే. అందువల్ల ఓపికతో ఆయన మాటలు వింటుంటాను నేను. సమకాలీన కవులను అర్థం చేసు కోవటానికి తరచు వారితో మాట్లాడటం అవసరం కూడా. అయితే ఒక్కొక్క సారి అనిపిస్తుంది విమర్శకుడు తాను విమర్శింపబూనుకున్న రచనను అర్థంచేసు కోవటానికి రచయితతో స్వయంగా ముఖాముఖీ మాట్లాడవలసిన అవసరముందా అని. రచన రచయిత హృదయ దర్పణ మయితే అందులో ఆయన్ను చూస్తే సరిపోతుందికదా! ఇక ప్రత్యక్ష పరిచయం దేనికి? నిజానికి అవసరం లేదు. అట్టి అవసరం లేకుండా విమర్శ సాగిస్తేనే విమర్శకుని శక్తి బయట పడు తుంది. సాధ్యమైనంతవరకు నేనెప్పుడూ అదే మార్గాన్ని అనుసరిస్తుంటాను. అయితే, సమకాలీనులైన రచయితలతో సంబంధాలు లేకుండా విమర్శకుడుండ లేడు. ఒకవేళ సంబంధాలు ఉన్నా, రచయిత తన రచనా వ్యాసంగాలను గురించి వివరించటానికి ప్రయత్నం చేసినా, వాటి ప్రభావానికి లోనై, తన వివే చనాన్ని రూపొందించుకునే బలహీనతకు విమర్శకుడు లోను కారాదు. అట్లని సహృదయత్వాన్ని త్యజించాలని నా తాత్పర్యం కాదు. సహృదయత్వంతో సాహి త్యాన్ని అధ్యయనంచేసే సాహిత్య విమర్శకుడికి రచయితతో ఎంత పరిచయము మున్నా, విమర్శించేటప్పుడు అది బాధకంకాదు. రచనలో కనపడే రచయితకూ లౌకికంగా జీవిస్తున్న రచయితకూ మధ్యనున్న అంతర్యాన్నీ, సమన్వయాన్నీ నిరూపించుకోవటానికి విమర్శకుడికి రచయితతో ఉన్న పరిచయం దోహదం

కావచ్చు. శ్రీ నీలా జంగయ్యగారి పరిచయాన్ని ఆయన కావ్యాన్ని పరిశీలించే టప్పుడు నే నంతవరకే పరిమితం చేసుకొంటాను. ఈయనే కాదు, ఏ రచయిత అయినా విమర్శకుడుగా నేను రచన చేస్తున్నప్పుడు అల్లంత దూరంలో ఆగి ఉండవలసిందే.

శ్రీ నీలా జంగయ్యగారు (తమ రచనల్లో ఒక్కొక్క దానిని ఒక్కొక్క విమర్శకుడికి పంచిపెట్టారు. వాటిమీద విమర్శ వ్రాయటానికి, అందులో విమర్శకుడి అభిరుచికన్న రచయిత అభిరుచియే ప్రధానంగా కనపడు తున్నది) రామలింగ పద్యాలమీద నన్ను వ్రాయమన్నారు. నా విమర్శనం మీద ఆయనకు ఒక ప్రమాణదృష్టి ఉన్నట్లు కనపడుతున్నది. అందువల్ల ఒప్పు కొన్నాను. తీరా కావ్యం చదివిన తరువాత నే నీ కావ్యానికి న్యాయం చేయ గలనా అనే భయం పట్టుకొన్నది నాకు. దానికి కారణం నా కీ కావ్య ప్రక్రి యను గురించి తెలిసింది చాల తక్కువ. అందువల్ల అల్పజ్ఞానంతో విమర్శకు పూనుకోవటానికి మొదట వెనుకంజ వేశాను. అట్లని మానివేస్తే మాటతప్పినట్లు అవుతుంది; ఏదో వ్రాస్తే కావ్యం చదవకుండానే వ్రాశాడన్న మాట వస్తుంది; చూచి వ్రాస్తే కావ్యం అర్థంకాక వ్రాశాడనే విమర్శ వస్తుంది; కావ్యలక్షణాలను పరామర్శిస్తే ఛాందసుడనే అపప్రథ మిగులుతుంది. ఎలా వ్రాసినా విమర్శకు విమర్శ తప్పదేమో!

'ఒకడు శయ్య మెచ్చు నొకడు రసము మెచ్చు
నొకడు గుణము, రీతి నొకడు మెచ్చు
చూచి మెచ్చు నొకడు; చూడ కొకడు మెచ్చు
రమ్యగుణ శుభాంగ! రామలింగ'

అన్న పద్యం చదివాక నా భయం మరీ ద్విగుణీకృతం అయిపోయింది. మొదటి రెండు చరణాల్లో చెప్పబడిన విమర్శకులు ఆయా కావ్యగుణాలను మెచ్చుకుంటే తప్పా? ఒప్పా? వాటిలో ఏ గుణమున్నా గుణమేగా మరి. మూడో చరణం చదివేసరికి ఏ విమర్శకుడైనా ఉలిక్కి పడతాడు. అన్ని గుణాలనూ చూచి మెచ్చు కుంటే చూచి మెచ్చుకొనే విమర్శకుడు కావచ్చు; చూడక మెచ్చుకొనే దాంట్లో గుణమున్నా చూడలేదన్న దోషంతో దోషంగా పరిణమించవచ్చు. ఇంతకూ

ఈ రచయితకు ఎటువంటి విమర్శనమంటే ఇష్టం? ఇందులో విమర్శ స్వరూపం చెప్పటంకాక, విమర్శలోపం చెప్పటమే పరమార్థం కాబట్టి ఎలా విమర్శ చేసినా ఈ కావ్యానికి ఇది మార్గమని నిర్దేశించటమే కష్టమౌతుంది. అందువల్ల నా పని మరీ కష్టమైపోయింది.

'తోచినట్లు మాట తూచి మాట్లాడితే
మాట నోట లేని మనిషి యంత్రుడు;
వచ్చి రాకవర్లు వానిని బుధుడంత్రుడు'

అని శ్రీ జంగయ్యగారు సెలవిచ్చారు. ఈ పద్యాల్ని ముందుంచుకొని విమర్శ వ్రాయవచ్చులే అనే ధైర్యం వచ్చింది. పై పద్యంలోని బుధునికంటె మనిషే మంచివాడు. అతడు మాట + నోట లేనివాడైనా కావచ్చు; మాటనే + ఓట(మి) లేనివాడైనా కావచ్చు. తోచినట్లు అంటే తన మనసు చెప్పినట్లు తాను నమ్మినట్లు అనే అర్థం గ్రహిస్తే తూచి మాట్లాడేగుణం సార్థకమౌతుంది. నేను తూచినట్లు మాట్లాడ లేకపోవచ్చు. శ్రీ జంగయ్యగారికి పుట్టుకతో వచ్చిన విద్దె-నేను తోచినట్లు మాట్లాడతాను.

తోచినట్లు మాట్లాడిందల్లా మెప్పుకోలు విమర్శగా ఉండవలసిన అవసరంలేదు. నేను ఒక కవి వ్రాసింది మంచికవిత కాదంటాను. కాని మరొకరి దృష్టిలో అది మంచి కవితే కావచ్చు. వెంటనే ఆయన నన్ను ఈ పద్యంతో ఈసడించుకోవచ్చు.

'మంచి కవితలల్లు మనుజుల మెచ్చక
నీచవర్తు లెందు నిందసల్పి
పిచ్చి కొంతవ్రాసి మెచ్చిరి కవితగా'

నిజానికి ఈ రోజుల్లో మెచ్చుకొనే విమర్శనే పిచ్చి విమర్శ అంటున్నారు కొందరు. నిగ్గుతేల్చే విమర్శ నిందలకు పాలైనా నిజంతో బ్రతుక కలుగుతుందని విమర్శకుల అభిప్రాయం. ఆ నమ్మకంతోనే నాలుగు మాటలు వ్రాయటానికి సాహసిస్తాను.

ఆంధ్రకవుల్లో ఆధునికుల దృష్టిని ఆకర్షించిన కవులు ముఖ్యంగా ముగ్గురు కనబడుతున్నారు. వారు తిక్కన, వేమన, గురజాడ. తిక్కన వాడిన భాషవల్ల ఆయన కా గౌరవం ఇస్తున్నారు. వేమన ప్రకటించిన భావాలవలన ఆయనకు ఆదరాన్నందిస్తున్నారు. గురజాడ చూపిన బాటవలన ఆయన్ను మన్నిస్తున్నారు. భాష-భావం-బాట అనే మూడు లక్షణాలతో ఆ కవిత్రయం ఆధునికుల దృష్టి నాకర్షిస్తోంది. ఇందులో వేమన మార్గాన్ని అనుసరించిన రచయిత శ్రీ నీలా జంగయ్య. ఆయన వ్రాసిన బుచ్చిలింగపద్యాలూ, రామలింగ పద్యాలూ వేమన మార్గాన్ని చూచి నడిచినవే. వేమన మార్గం ఒక విలక్షణమైంది. అది మహాకావ్యమార్గంకాదు; రసం ఆయన ధ్యేయంకాదు. తిక్కన ఆ మార్గంలో నడచినవాడు; ఆధునికులను ఆయన మహాకావ్యంకంటె భాష, సజీవపాత్రచిత్రణం బాగా ఆకర్షిస్తున్నాయి. అవి మార్గాన్ని తీర్చిదిద్దడంలో ఉపయోగించిన సామగ్రి. సామగ్రి శక్తినిబట్టి సమగ్రశిల్ప విస్ఫూర్తి భాసిస్తుంది. తిక్కన మహాకావ్య శిల్పం ఉత్తమమైన దనటంలో విప్రతిపత్తిలేదు. అయితే వేమన్నది శతక ప్రక్రియలో సాగించిన ఒక సాధన. శతకానికి మహాకావ్యాని కిచ్చిన గౌరవం ఇవ్వగలుగుతామా? ఇవ్వలేము. అయినా వేమన ప్రక్రియకు తగినంత గౌరవం ఇవ్వవలసిందే. అందరికీ అర్థమయ్యేటట్లు సరళంగా శక్తిమంతంగా వ్రాయటం వేమనకున్న సహజ లక్షణం. అది ఆయన ప్రత్యేకత. వేమన మార్గాన్ని అనుసరించదలచుకుంటే ఆ సహజ లక్షణాన్ని ఆచరణలో పెట్టి చూపించాలి.

'ప్రజకు బోధపడెడు పగిది కవిత గూర్ప
వలె నటంచు పలుకువారె తుదకు
బ్రహ్మకైన బోధపడునట్లు వ్రాతురు'

అని శ్రీ జంగయ్యగారు కొందరిని ఎత్తి పొడిచారు. అందువల్ల ఆ దోషం తన రచనల్లో దొరలకుండా శ్రీ జంగయ్యగారు చాల జాగ్రత్తపడ్డారు.

వేమన్నను గురించి 'వేమన వేదం' (యువభారతి ప్రచురణ) పీఠికలో నే నిలా వ్రాశాను— 'వేమన్న వ్యక్తిత్వం విచిత్రమైనది ఆయనకు పాండిత్యం కంటె పరమార్థం గొప్ప. అందువల్లనే పాండిత్యంకోసం పండితుల పాటా

నదంటలేదు. పరమార్థంకోసం జీవితాన్ని గురువుగా ఎంచుకున్నాడు. జీవితం సత్యానికి మౌన వ్యాఖ్యానం చేస్తుంది గాని పాత ప్రవచనాలను తర్క వ్యాఖ్యానా లతో వితర్కించ చేయదు. జీవితానికి మొగమాటాలు లేవు. మెరమెచ్చులు లేవు. అది వరాన్ని ఎంత ఔదార్యంతో ఇస్తుందో శాపాన్ని అంత నిర్దాక్షిణ్యంగా ఇస్తుంది. ఆటుపోటులతో కూడుకొన్న జీవితాన్ని ఆశ్రయించిన సాధకుడికి అటు రక్తికీ, ఇటు విరక్తికీ అవకాశముంది. రక్తిలోపడి సాధకుడు పరమా ర్థాన్ని మర్చిపోతే జీవితం శపిస్తుంది. శాపగ్రస్తుడైన జీవి విరక్తిమార్గం పడ తాడు. పరమార్థాన్ని అన్వేషిస్తాడు. వేమన జీవితం ఇదే మార్గం పట్టింది. యౌవనంలో అందిన ఐహిక భోగాలను అనుభవిస్తూ పోయాడు. అందులో ఆయనకు అర్థార్థి సంబంధంతప్ప పరార్థంతో కూడిన పరమార్థం కనబడలేదు. కాంచనం, వంచనం రక్తిమార్గంలో ముళ్ళపొదల్లా కనిపించాయి. ఆ మార్గం వదలిపెట్టాడు వేమన. రక్తిని వీడినప్పుడు భక్తిని పట్టే అవకాశం ఉంటుంది సాధకుని జీవితంలో. భక్తికి విశ్వాసం బలం. వేమన్న వివేకాన్ని నమ్మినంతగా విశ్వాసాన్ని నమ్మినవాడు కాడు. అందువల్ల భక్తుడు కాలేకపోయాడు. కానీ భగ వంతుని దగ్గరకు చేర్చే మార్గాల నన్నిటినీ పరామర్శించాడు. భగవంతుడికీ మనిషికీ మధ్య మతం పేరిట మనిషే కల్పించుకొన్న ప్రతిబంధకాలు ఆయన మనస్సును గాయం చేశాయి. బహిర్ముఖమైన జీవితంమీద ఆయనకు కోపం వచ్చింది. అంతర్ముఖుడై ఆయనలోనే భగవంతుణ్ని చూచుకొన్నాడు. జీవితం నేర్పిన గొప్ప గుణపాఠం అది.

వేమన్న జీవితం వెంట తిరిగినప్పుడల్లా జీవితం లోకంలోని తప్పులనే ఎత్తి చూపింది. చివరలో నీలోనే నిజం ఉంది తెలుసుకోమని చెప్పి దూరమైంది. వేమన్న తనకు తాను గురువైనాడు. తనకు తాను శిష్యుడైనాడు. శిష్యుడుగా తాను లోకవర్తనంలో ఉన్న తన పుచ్ఛకాయతనాన్ని ప్రశ్నించుకుంటాడు. గురు వుగా తానే సత్యాన్ని నిరూపించుకుంటాడు. ఆయన అంతర్వ్యక్తిలో జరిగే ఈ సంవాదసారమే ఛందోరూపం తాల్చి బయటపడింది. ఆయన కవిత అందుకే ఆత్మాశ్రయమైంది. అదే దాని అంతర్లీనమైన శక్తి.

వేమన స్వయంకృషితో సత్యాన్ని స్వాయత్తం చేసుకొన్న సాధకుడు. అందువల్ల ఆయన ప్రవృత్తిలో స్వాతంత్ర్యం సానలుదీరి రాణిస్తుంది. జీవి

భావంలోనూ, భాషలోనూ ప్రతిఫలించింది. ఆయన తిట్టినట్లు చెప్పినా, కొట్టినట్లు చెప్పినా, వినేవాడికి ఆయన స్వాతంత్ర్యం మీద సానుభూతి కలిగింప చేస్తుంది. ఉన్నది ఉన్నట్లు చెప్పి విన్నవాడికి ఉడుకెక్కించినా కన్నది కన్నట్లు చెప్పిన నిజాయితీ అతని మాటకు తలంబూపింపచేస్తుంది. బింకానికి పోని ఆయన భాష బిగువుతోకూడిన సూటిదనాన్ని ప్రదర్శిస్తుంది. బూతులు పలికినా నీతులు చెప్పినా నిర్లిప్తతతో నిండిన ఆయన నిర్మొగమాటం మాటకొక నిండు దనాన్ని సంతరిస్తుంది. ఆగ్రహంతో చెప్పినా, నిగ్రహంతో చెప్పినా ఆయన మాటల్లో అంతర్వాహికగా సాగివచ్చే హాస్యధోరణి నొచ్చుకున్నవాణ్ని కూడా నవ్వింప చేస్తుంది. కవ్విస్తూ నవ్వించేశక్తి వేమన్న కవితకే దక్కింది.

వేమన్న దృష్టిలో మనిషే దేవుడు. ఆయన తత్త్వం మానవతావాదం. మనిషి తనకు తాను ద్రోహం చేసుకొన్నా, మరోమనిషికి ద్రోహం చేసినా ఆత్మ వంచన, దైవవంచన అంటాడు వేమన్న. మనుషుల మధ్య తాత్త్వికంగా తరతమ భేదం లేదంటాడు; కులవర్గభేదాలు మానవ కల్పితాలంటాడు. మనిషిలో మానవత్వాన్ని చంపే మతాన్ని గర్హిస్తాడు. ఉన్నత మానవతా గుణాలను ప్రబోధిస్తాడు. వేమన్న దృష్టిలో ప్రబోధమెంత ప్రధానమో, సంస్కరణమంత అవసరం. మూఢవిశ్వాసాలనూ అర్థరహితమైన ఆచారాలనూ, స్వార్థపోషకాలైన వర్గభేదాలనూ సంస్కరణ దృష్టితో ఆయన అవహేళనం చేస్తాడు. ఆయన ఆత్మోద్ధరణతోపాటు సహజ సముద్ధరణాన్ని కాంక్షించిన కర్మయోగి; మానవుడే మాధవుడని చెప్పిన జ్ఞానయోగి. అందుకే నేటికీ వేమన్నవాక్కు వేదంలా వినిపిస్తుంది.

వేమన మార్గాన్ని అనుసరించే ఆధునికుడు కూడా వేమన దృక్పథాన్ని అలవరచుకొన్నప్పుడే అవుతాడు. వేమనలోని మానవతావాదం శ్రీ నీలా జంగయ్యగారికి తారకమంత్రం. కాలాలు వేరైనా గుణాలస్వభావం సజాతీయంగా కనబడుతుంది వేమన్నలో జంగన్నలో. అయితే వేమన సూక్తుల వంటి సూక్తులు పలికిన వారంతా వేమన్నలౌతారా ఇంతవరకు కాలేదు. వేమన్నను మించిన సూక్తులను గాని, ఆటవెలదులను గాని వ్రాసినవారు నేటికీ లేరు. శ్రీ జంగయ్యగారు వేమన్న ననుసరించారని చెప్తే నిజం; వేమన్నను మించారని చెపితే అబద్ధం అవుతుంది.

అనుసరణం అంత గొప్పగుణం కాదంటారు సహజంగా. కాని అది సృష్టికి సహజగుణం. అందర్నీ అనుసరించరు అందరూ. ఒక్క మహాత్ముణ్ణి ఎందరో అనుసరిస్తారు. ఆ మహాత్మునిలో ఒకజాతి జీవించే లక్షణం మౌలికంగా వ్యక్తీకరింపబడి ఉంటుంది. ఆ జాతిలో జాతిరత్నాలు కావాలనుకున్న వారు ఆ మహాత్మున్ని అనుసరిస్తారు. అది దోషం కాదు. కాని మహాత్ముణ్ణి మహాత్ముడంటాం అనుకర్తను యోగ్యుడని అంటాం. అయితే, అనుసరణంలో రెండు విధాలున్నాయి. తన ప్రత్యేకతను పరిరక్షించుకొంటూ అనుసరించటం; తనదంటూ ఏమీ లేకుండా మాతృకకు పుత్రికగా సాగటం. ఈ రెండిట్లో మొదటిది గౌరవింపదగింది. శ్రీ నీలా జంగయ్య వేమన్న ననుసరించినా తన వ్యక్తిత్వాన్ని రక్షించుకొన్నవాడు. ఆయన వ్యక్తిత్వం మూడు అంశాల మీద వ్యాపించి ఉంది 1. ఆయన కాలానికి సంబంధించిన సమకాలీన సమస్యలను సామాజిక స్పృహతో సూక్తుల్లో సమీక్షించటం. 2. తన మకుటంతాను ఉంచుకోవటం. 3. తన ఉక్తిని తాను మంచుకోవటం.

శ్రీ నీలా జంగయ్య సూక్తులలో నేటి సామాజిక సమస్యలు సజీవంగా కనపడతాయి. వాటిమీద రచయిత స్వీయ దృక్పథంతో చేసే వ్యాఖ్యలు వినపడతాయి.

'జనులలోన గొప్పయనిపించు కొననెంచి
ధార్మికతను థాసి ఛైర్మనయ్యె
పరువు భారమయ్యె పరమాత్మ చేదయ్యె
రమ్యగుణ శుభాంగ! రామలింగ!'

ఇటువంటివి కొల్లలు, వేమన సూక్తుల్లో ఛైర్మన్లు, మంత్రులు, ప్రభుత్వాలు' రేడియోలు, తంతులు, మొదలైనవి కానరావు. ఆధునిక వస్తువు ఈ కవితకు ఆయువు. అదే దాని ప్రత్యేకత, వ్యక్తిత్వం.

ఆధునికుడు సమాజాన్ని చూచినప్పుడు అతడికి మనిషి వ్యష్టిగా సమిష్టిగా జీవిస్తున్న విధానం గోచరమౌతుంది. వ్యష్టిగా మనిషిలో అంతర్వ్యక్తి, బహిర్వ్యక్తి అనే శక్తుల మధ్య ఐక్యత కనబడటం లేదు. మనసు వేరు, మాట వేరు, వాక్కు వేరు. వర్తనంవేరు. ఇలా ద్వైధీభూతమైన వ్యక్తిత్వంతో తన

చుట్టూ ఉన్న సమాజాన్ని మోసగిస్తున్నాడు ; అదే అంటాటైపోయి చివరకు తననుకూడా మోసగించుకుంటున్నాడు. అందువల్లనే ఆధునిక సమాజంలోని మానవుడు ఆత్మనెక్కడ పారేసుకొన్నానో అని వెతుక్కుంటున్నాడు స్వార్థమనే చీకట్లో. ఇలాంటి వ్యక్తి సమిష్టిగా వ్యవహరించినప్పుడూ ద్వంద్వ ప్రవృత్తిని ప్రకటిస్తున్నాడు. దానితో సమాజంలో సమత కరువై వ్యత్యాసాలు ఎక్కువై వర్గ, వర్ణ, మత కంహాలు పెచ్చు పెరుగుతున్నాయి. మనిషిలోని ఈ కపట నాటకం సర్వజీవిత వ్యాపారాలలో వ్యాపించి జీవనవిధానాన్నే కలుషితం చేసి వేస్తున్నది. దీన్ని చూస్తున్న ఆధునిక వేమన్నలు ఆ రీతితో అసలు సత్యాన్ని చెప్పటానికి గొంతెత్తుతున్నారు. వీరి సూక్తులు ప్రహసనాల్లాంటివి. పైకి నవ్విస్తుంటాయి ; లోపల వాతలు పెడుతుంటాయి. నవ్వుతూ అందరూ వినాలనీ ఆ నవ్వును కలిగించే ప్రకృతిని గమనించి సమాజం సహజ ప్రకృతిని సదవగాహనం ద్వారా తెలుసుకోవాలని శ్రీ సీలాజంగయ్య లాంటి వేమన్న అనుయాయుల మతం. వీరేశలింగంగారి ప్రహసనాల కంటె వేమన్నలాంటి సూక్తులు సమాజంలో సంస్కరణ చైతన్యాన్ని కలిగిస్తాయని వీరి అభిమతం. ఆ ప్రక్రియకు ప్రహసనంకంటె బలమైన శక్తి ఉంది. ఒక్కొక్క సూక్తి ఒక్కొక్క ప్రహసనానికి వస్తువు. ఒక్కొక్క గాథను, బాధను పాదుగా చేసుకొని మొలచిన కవితా కుసుమం ప్రతిపద్యం.

శ్రీ సీలా జంగయ్యగారి రామలింగ పద్యాల్లో ఇతర విషయాలన్నీ ఒక యెత్తు ; సాహిత్య కవిత్వ భాషాంశాలమీద వారు సాగించిన విమర్శాత్మకసూక్తి ప్రపంచంలో మరోయెత్తు. నిజానికి ఆయన ప్రవృత్తి సాహిత్యంలో ఎక్కువ జీవిస్తుంది ; దానికి ఎన్నో అంశాలు ఉపాంగాలు కావచ్చు. ఆయన అభిప్రాయాలు సాహితీలోకం తెలుసు కోవాలని తహతహ లాడటంలో ఆశ్చర్యం లేదు. మచ్చుకు కొన్ని —

1. కొత్తదనము పేర చెత్త నింపగ నేల
   పాత దైన-మంచి పనికి వచ్చు
   క్రొత్త పాతలందు కొన్ను మెప్పుడును మంచి .

2. సంస్కృతాంగ్ల కావ్య సద్గుణముల్ గ్రహియించి
   తెలుగునందు జొనిపి - వెల్గు కవులు
   జాతిపాలి గుణము సగటున క్షీణించె

3. సృజన రచన లేని యిజము లెల్ల నశించు
భావలతల రచన పరిమళించు
మచ్చరించి ప్రకృతి మర్యాద విడవద్దు

4. పండుగలను బట్టి పార్టీలనుం బట్టి
సభం బట్టి చిత్రజగతి బట్టి
వసతిబట్టి కవిత పసబైట పడుచుండు

5. భావలందు నిల్చు బహుశాస్త్ర నిచయమ్ము
భాషనంటి శాస్త్ర ప్రగతి హెచ్చు
తల్లి పాల పెరుగు పిల్లలు బాగుంద్రు

6. కవిత గూర్పరాని ఘనులు కొందరు నేడు
సుకవి రచనలకును సోది చెప్పి
గ్రంథ రచనపేర గణియించి బ్రతికిరి

7. పంటగింజతోడ పట్టిన తాలట్లు
కావ్యమందు పొల్లు కలిసి యుండు
గాలి తాలు బాపు; ఘనులు కవిత నుతింత్రు

8. తెలుగు వారితోడ పలు కాంగ్లభాషలో
ఆంగ్లమాడ తెలుగునందు పలుకు
వచ్చిరాక భాష పలుక నిర్లిద్యాలె!

9. తెలుగు కవితలోన కలగల్పు చుండిరి
ఆంగ్ల పదవితతుల నచ్చటచట
పానకాన పుడక పడవేయ గొప్పాయె

10. ప్రతిభలేక రచన పద్యగద్యము లైన
గేయమైన కవితగా పేరలదు
కవిత జడజగాల కదలించి యాడించు

వచన కవితా ప్రక్రియను చేపట్టి పొగిడుతున్న శ్రీ జంగయ్యగారు ఆ ప్రక్రియపై చేసిన వ్యాఖ్యలు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి.

1. అపుడు పద్యములకు నర్థాలు గూర్చక
 బోధపడక కవిత బాధ పెట్టె
 ఇపుడు వచన కవిత ఎట్లర్థమై చచ్చు
2. పద్య పాదములుగ వచనమ్మునే గూర్చి
 గ్రంథ మచ్చువేయ రమ్యగతుల
 వచన కవియగాంచి పద్యకావ్యంబనె
3. ఇంటి కిద్దరుంటె నిద్దరు కవులుగా
 వచన కవిత గూర్చి వారె యైరి
 పల్కు నేర్చుకొన్న వాడెల్ల కవి గదా!

కవిగారి అభిప్రాయాలన్నిటితో ఏకీభవించలేక పోవచ్చు మనం; కాని, ఆయన నమ్మిన వాటిని ఆయన చెప్పివేశాడు. కొన్ని చోట్ల సమస్యల సమగ్ర విజ్ఞానం కవికి లేకుండా తన అభిరుచి కనుగుణంగా సమీక్షిస్తే లోకం హర్షించక పోవచ్చు. ఎవడు సర్వజ్ఞుడని ఒక పెద్ద ప్రశ్నవేసుకొని సంతృప్తిపడి ఊరుకో రాదు. ఆధునిక వేమన్న లందరికీ ఈ లోపం కొద్దో గొప్పో ఉంది. వస్తుతః వీరు యోగులుకారు వేమనలాగా. విరాగుల సూక్తులకూ, లోక వర్తనంలో వ్యవహరిస్తూ యోగిలా సూక్తులు చెప్పేవారికీ తప్పకుండా భేదం ఉంటుంది. వారివారి పరిపాకాన్ని బట్టీ, ప్రజ్ఞను బట్టి పరిశీలన భాసిస్తుంది. అందువల్ల వేమన సూక్తుల్లో భాసించే విశ్వజనీనత ఆధునిక వేమనల్లో సర్వత్రా కాన రాక పోవచ్చు. అందువల్లనే వేమన సూక్తుల్లా వీరి సూక్తులు ప్రజా వాహిని నాల్కలమీద నాట్యం చేయడం అంతగా చూడం. ఇది అనుసరణంలో సహజంగా ఉన్న బలహీనతయే దీన్ని అధిగమించాలంటే ప్రక్రియనన్నా మార్చుకోవాలి; వేమన్న కంటె శక్తివంతమైన రచనైనా చేయాలి. ఆ రెండు సాధ్యపడనప్పుడు వేమన మార్గమే శరణ్యం!

వేమన్న మార్గాన నడిచి జన్నులు చెప్పుకోవటానికి కొత్తవస్తువులతో కొత్త పద్యాల నందించిన శ్రీ జంగయ్యగారి కృషి అభినందనీయం.

శ్రీ జంగయ్యగారు ఎన్నుకొన్న మకుటంలో ఒక విశేషముంది. ఎవరైనా ఈ మార్గంలో నడిచేవారు తమ పేరు ఏదోవిధంగా మకుటంలో మాణిక్యం లాగా పొదిగి ఉంచుతారు. శ్రీ జంగయ్యగారికి ఆ స్వార్థం లేదు. అందువల్ల మకుటాన్ని రామలింగస్వామికి అంకితం చేశారు, శివకేశవా భేదం, సౌందర్య సృజన వ్యాపారాల సమన్వయం ధ్వనింపచేసే మకుటమది. 'రమ్యగుణ శుభాంగ'

అన్న సంబోధనంలో నాలుగు కవితా లక్షణాల సంపుటీకరణం వ్యంగ్యంగా స్ఫురిస్తోంది. సౌందర్యము (రమ్య); గుణ గౌరవం, (గుణ) విశ్వకల్యాణా కాంక్ష (శుభ); సుశబ్ద ప్రౌఢాఢ్యం (అంగ) అనే గుణాలు కవితకు వర్తించేవిగా సంభావించవచ్చు. స్వీయవ్యక్తిత్వం కంటె కవితా వ్యక్తిత్వమే ముఖ్యంగా భావించిన శ్రీ జంగయ్యగారి సాహిత్య శీలాన్ని మనం అభినందించాలి.

ఇక శ్రీ జంగయ్యగారి ఉక్తి ఆయన సొంతంగా రూపొందించుకున్నది. అది అంత నగిషీ పనితో నవనవలాడే శిల్పంగా ఉండకపోవచ్చు; కాని, సహజ స్వభావాన్ని వ్యక్తంచేసే స్వభావోక్తిలా ఉంటుంది.

"భావపూర్ణ మిచ్చె వక్రోక్తి కవితలో"

అని ఆయన తన కవితా లక్షణాన్ని చెప్పుకున్నాడు. వ్యవహారవాక్కుల నుండి కావ్యవాక్కులో ఒకభావం అభివ్యక్తం కావటమే కుంతకుడు వక్రోక్తిగా పేర్కొన్నాడు సమకాలీన సమాజంలో ఉన్న వక్రతను చిత్రించటంలో వాక్య వక్రత నాశ్రయించటం ఉక్తిలో భాసించే రచనా వక్రత ఈ పద్యాల్లో ప్రతీ పద్యంలోనూ అలంకారం ఉండితీరాలి అలంకారానికి వక్రత మౌలిక లక్షణం. ఇలా, ఎన్ని విధాల చూచినా వక్రతయే ఈ కృతికి జీవితం. వక్రత వ్యంగ్య మార్గంలో సాగితే ఉత్తమ రచన అవుతుంది. శ్రీ నీలాజంగయ్య మానవతా వాదాన్ని కవితలో అభివ్యక్తీకరించే ప్రయోగాన్ని సాగిస్తున్నారు వేమన్న లాగా మానవుడే మాధవుడని భావించారు. అధునిక మానవుని ఆత్మాన్వేషణమే మానవత్వ దర్శనానికి మహనీయమార్గం. ఆ మార్గంలో రామలింగ పద్యాలు హృద్యమైన మంగళ వాద్యాలుగా నినదించాలని శ్రీ జంగయ్యగారి ఆశయం.

"మనిషి మనిషి కలుపు మనుగడ నింపరా"

అని ఆయన లోకానికిచ్చే సందేశం. విశ్వశ్రేయో రూపమైన ఈ శంఖా రావం ప్రజలకు ప్రణవనాదంగా వినపడాలనీ, ప్రజల నోళ్ళలో ఈ పద్యాలు పల్లవించాలనీ ఆశిస్తున్నాను.

"ప్రజలె గొప్ప కవిత-ప్రకటింపవలెగాని
తానె గొప్ప యనుచు-తగదు చెప్ప
సుకవి కీర్తి సున్న-చూపు మాత్రము మిన్న
రమ్యగుణ శుభాంగ! రామలింగ!"
తథాస్తు! శుభం భూయాత్.

# మహాప్రపంచం

డా॥ ఎస్. వి. రామారావు

"తనను వంతు విశ్వదాతకు ధాత్రిని
కలము బట్టి వ్రాతు కవిత సతము
నిత్యమైన తనువు సత్యంబు పల్కదా
సత్య మాడకున్న చావు మేలు" (పు. 15)

ఇది నీలా జంగయ్య కవితా ప్రపంచనం. మహాప్రపంచం. ఒక చిన్న విజ్ఞాన సర్వస్వం. 'చిన్న' అని ఎందు కంటున్నానంటే—ఇరవై సంవత్సరాలనాడు—చిన్నారి పొన్నారి చిరుత కూకటినాడు రచింపబడిన కావ్యం ఇది. అప్పటికే మహాప్రస్థానం జరిగింది. అగ్నిధార కురిసింది. రుద్రవీణ మ్రోగింది. వీటి ప్రేరణతో కలంపట్టిన కవి ఆ ఛాయల్లో కవితారచనకు పూనుకున్నాడు. అంతకుముందు తాను పఠించిన ప్రాచీన ప్రబంధాల ప్రభావం వుండనే వున్నది.

అయితే ఈ కవి అనుకరణశీలి కాడు. సృజనాత్మక ప్రతిభ వున్నవాడు. నిరంతర జిజ్ఞాసువు. నూత్న మార్గ అన్వేషి కవిత్వాన్ని తపస్సుగా భావించి "మహాకావ్యం ఎదలో వ్రాయాల"న్న (పు. 28) ఆకాంక్ష గలవాడు. అందు చేతనే 'గద్య పద్య గేయముల' రూపంలో అభినవ కావ్యాన్ని ఆనాడే వ్రాయ గలిగినాడు.

మహాప్రపంచం చదువుతుంటే ఒక చైతన్య స్రవంతి మనముందు జాలు వారుతుంది. **Stream of consciousness** పేరుతో ఇటీవల వ్యాప్తిలోకి వచ్చిన ప్రక్రియా స్వరూపం గోచర మవుతుంది. కవి 'క్రాంతదర్శి' అన్న వాక్కు అక్షరాలా నిజమనిపిస్తుంది.

నీలా జంగయ్య భావనా పరంపర ఈ కావ్యంలో అనంతంగా బహుముఖంగా వెల్లివిరిసింది. ఒకచోట జ్ఞానాన్ని గురించి చర్చించే దార్శనికునిలా కనిపిస్తాడు.

"అటులైన మరి జ్ఞాను లెవరుః అనగా క్రూరులయందు, సాధువుల యందు సమానస్థితి యొనర్చి మెల్గువాడే జ్ఞానియని బోధపడుతుంది." (పు. 29)

మరోచోట ప్రకృతి-పరమాత్మలను, చావుపుట్టుకలను విచారించే తాత్త్వికునిలా గోచరిస్తాడు.

"ప్రకృతి జ్ఞానమె పరాత్పరుడంచు దోచు మది
ప్రకృతి పురుషుడు పరాత్పరుడు గాడె జగమున"

"చావుపుట్టుక ముందు చావు పుట్టుక కలసు
దీని నెరిగిన వాడు దేవుడై కవి యగును" (పు. 64)

జగత్ప్రసిద్ధమైన రామాయణగాథకు వినూత్నమైన భాష్యం యిందులో వుంది.

జ్ఞానమే రాముండు గాదే

బుద్ధియే లక్ష్మణుడు గాదే

చిత్తమే సీతమ్మ గాదే

రావణుండు దశేంద్రియములన...

ఆత్మ హనుమంతుండు యనియెద...

కోతుల సంకల్పములెల్ల యిల

కూడి వారధి గట్టినారన (పు. 60)

అయితే—యింతకూ జంగయ్యగారిది సర్వోదయ సిద్ధాంతం.

"అందరకు ఉండాలి కూడు

అందరకు ఉండాలి గూడు

అందరకు ఉండాలి గుడ్డ

అందరకు ఉండాలి విద్దె

నా కవిత్వములోని సారము

ఎంత దీసిన యింతెనోయి—" (పు. 33)

అని తన కవితాసారాన్ని సుస్పష్టంగా చాటినారు. ఎటువంటి క్లిష్టమైన భావాన్నయినా అతి సరళమైన భాషలో చెప్పాలన్న ప్రయత్నం ఆయనలో బాగా కన పడుతుంది. "ఈ బలంలేని శబ్దాలు నన్నెలా మోస్తాయి" అని ఆశంకించినా "అర్థముగాని భాషలో ఆయాసపడదు" అతని కవిత్వం. భాష తెలియని వారికి అర్థమయ్యే కవిత్వం వ్రాయాలని అతని ఆశయం.

జంగయ్య యథార్థ కథన చాతుర్యం వున్న కవి. ప్రబంధ పద్ధతిలో కొన సాగిన 'మహాప్రపంచం' శీర్షికలో ఒకనాటి మంచిరోజులను గుర్తుకుతెచ్చే పల్లెజీవితం తీరుతెన్నులను యథాతథంగా మన కనులముందు నిలబెట్టే మంచి పద్యాలున్నవి. మచ్చుకు రెండు—

ప్రొద్దునె లేచి బాలికలు పూఁవనమ్ముల కేగి మల్లియల్
ముద్దులు గుల్క దెచ్చుకొని మోదముతో జడలల్లి వేళకున్
చద్దుల నారగించి కడు చల్లదనంబున పాఠశాలలన్
విద్దెం నేర్వబోవుదురు విన్నదనంబు మదిం గనుంగొనన్ (పు.39)

విపణి వీథుల నెల్లెడ విరగబడుచు
క్రొత్త వసనట్టి శనగలు గోధుమలును
కొనిరి బెల్లము చింతపండును యుగాది
పండుగను గూర్చి జనులు సంబరము హెచ్చ (పు.46)

ఈ విధంగా చక్కని ధారతో కూడిన పద్యరచనలోనే కాక—గద్య. గేయరచనలో కూడా ఈ కవి అందెవేసిన చేయి.

"చదివేది చదివించేది
చూపేది చూపించేది
పలికేది పలికించేది
కదలేది కదిలించేది
ఆడేది ఆడించేది
కావాలోయి నవకవనానికి" (పు.78)

శ్రీశ్రీ బాణీలో కొనసాగిన ఇటువంటి గేయాలు ఇందులో చాలావరకు కనిపించినా ఆయన అభిప్రాయాలతో ఏకీభవించని పట్లు ఎన్నో కనిపిస్తాయి ఈ కావ్యంలో. ఉదాహరణకు "కుక్కపిల్లా, అగ్గిపుల్లా, సబ్బుబిళ్ళా" అంటూ శ్రీశ్రీ వినిపించిన 'ఋక్కు'లకు ప్రతిగా వ్రాసిన ఈకవి వాక్కులు చూడండి—

అగ్గిసెగలు, పిచ్చికుక్క
గబ్బువస్తువును
హీనంగా చూడు, దేన్నీ
ఆరోగ్యమేనని రచనాత్మకం చేయకు (పు.70)

'మనస్సు గాలిబిడ్డ' మున్నగు వాక్యాలు, భావవేదం, జీవసమత మొ॥ పదాలు జంగయ్య భావనాబలాన్నీ, వినూత్న ప్రయోగాలనూ చాటుతున్నాయి. కాళోజీ, బోయి భీమన్న, కురుగంటి వంటి సాహితీవేత్తల ఆశీస్సులను అందుకున్న ఈ కృతి శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహస్వామి స్వీకృతమై కవిని సుకృతిని గావించింది.

"మహాప్రపంచం" రచన జరిగిన (1959) ఈ ఇరువది వత్సరాలలో నీలా జంగయ్య ఎంతగానో ఎదిగా డనటానికి అనంతరకాలంలో వెలువడిన కావ్యాలే సాక్షి. "సత్వరతన్ తదీయ కవితా దీప్తుల్ దిశల్ బర్వి" సాహితీ రజతోత్సవం జరుపు కొంటున్నాడు ఈనాడు.

"మధుర పదయుత సుధలు నించే
ద్రాక్షరసమో?
కఠిన పద విన్యాస రోచిర్ నిర్మితాయత
నారికేళమొ !
మత్త మధురిమ రాగ రవములో
కవీ! నీ పద్యాల్ ! (పు.72)

# సంస్కార భూషణం

డా॥ ఎం. కులశేఖరరావు

ఆధునిక యుగంలో తెలుగు కవిత విభిన్న మార్గాల్లో పయనిస్తున్నది. ఈనాటి కవికి ఆత్మీయులమీద అనురాగం కలిగితే అతని వాక్కు అందాన్ని ఆనందాన్ని సంతరించుకొంటున్నది. ఆ కవికే సామాజికుల ప్రవర్తనపై అసమ్మతి కలిగితే, అది అతని కవితలో అంగార రేఖలుగా ప్రకాశిస్తున్నది లోకాన్ని ఒకసారి నిద్రమత్తునుంచి మేల్కొల్పుతూ ఉన్నది. ఈనాటి మనుష్యులను సంస్కరించాలని కవికి తోచినప్పుడు, ప్రాచీన సంప్రదాయాలపై తిరుగుబాటు, తిరస్కారభావం; కొండొకచో క్రోధం, కోపతాపాలు వ్యక్తమవుతూ ఉన్నవి. ఈనాటి కవి అక్రమాలను సహించలేడు. అన్యాయాలను చూస్తూ మౌనం వహించలేడు. మానవత్వం పతనం అవుతూ ఉంటే సహించే స్థితిలో లేడు. ఈ సందర్భాలు రావాలేకాని, తన కవితాయుధాన్ని ఝుళిపించి రంగంలో ప్రకాశిస్తున్నాడు. లోకానికి తన అస్తిత్వాన్ని ప్రదర్శిస్తున్నాడు. కవిత్వానికి ప్రయోజనాన్ని చాటిచెపుతూ ఉన్నాడు.

ఇక ఈ కవిత్వంలో చెప్పే పద్ధతులుకూడ అనేక విధాలుగా ఉంటూ ఉన్నవి. ఒకరికి ఛందస్సు పట్టదు. ఒకరికి గానయోగ్యమైన మార్గం కావలె. ఇంకొకరికి మాత్రాఛందస్సుపై మమత. వేరొకరికి సంప్రదాయంమీద సమాదరం. కొంతమంది కవులకు సంప్రదాయం కావాలె. నవ్యతకావాలె. ఈ మార్గాలు ఇన్ని విధాలుగా వున్నాయి కాబట్టి, ఈనాటి కవిత వచనంలో, గేయంలో పద్యంలో, స్వచ్ఛంద ఛందంలో, ఛందోగంధుల్లో మనకు దర్శన మిస్తూ వున్నది. అన్ని విధాల మానవ మనోకుహరంలో ప్రవేశించడానికి ప్రయత్నం చేస్తున్నది.

భావంలోకాని, బాటలోకాని, ఎందుకిన్ని పోకడలు? ఎందుకిన్ని వైవిధ్యాలు? ఎందుకిన్ని వైరుధ్యాలు? అనే ప్రశ్నలు ఎదురవుతూనే ఉన్నవి. కవులకు జవాబు చెప్పే సాధ్యత ఉన్నదో లేదో కాని, ఒక విషయం మాత్రం స్పష్టమే. ఈనాడు మానవుడు జీవిస్తున్న సమాజం యాంత్రికమైనది. నిత్యపరివర్తన స్వభావం కలిగినట్టిది. అందుచేత ఆ సమాజాంగంగా ఉన్న మానవుడు కూడ ఒక సంక్లిష్ట మనస్తత్వాన్ని కలిగి ఉన్నాడు. అటువంటి మానవునికొరకు ఉద్భవించే కవిత అతనిలో ఉన్న వైవిధ్యం కలిగిన చేతనాన్ని ప్రదర్శింపజేయడంలో ఆశ్చర్యంలేదు. అతనిలోని సంక్లిష్ట భావ విన్యాసాలను ప్రదర్శించడంలో విచిత్రంలేదు.

ఇటువంటి సంక్లిష్ట సమాజంలో నివసించి, దానిలోని హావభావాలను పరిశీలించి, వైవిధ్యం కలిగిన మానవ మనస్తత్వాన్ని ఆకళింపుచేసికొని, వారిలోని గుణగణాలను, గుణాలుకాని భావాలను పరిశీలించి కవిత్వం వ్రాసినవారు శ్రీ నీలా జగయ్యగారు. గడచిన పాతిక సంవత్సరాలుగా వీరి కమ్మనికంఠం ఒకసారి, మేలుకొలుపు ఒకసారి గాన ఝరి, మరొకసారి వచన కవిత్వం మరొకసారి ఆంధ్రపాఠక లోకానికి వినిపిస్తూనే ఉన్నవి. వీరు పట్టణాలకు దూరంగా ఉన్నా, పట్టణాలలో నివసించినా, కవితా వ్యవసాయం మాత్రం మానలేదు. ఆంధ్రప్రాంతం గురించి నాకు తెలియదు కానీ, తెలంగాణంలో ఎక్కడ కవి సమ్మేళనం జరిగినా నీలాజంగయ్యగారి కంఠం వినిపించ వలసిందే. వారు చేసే ఏదో చమత్కారానికి సభికులు చప్పట్లు కొట్టవలసిందే. ఈ విధంగా తెలంగాణంలోని కవితా సంచలనంలో జంగయ్యగారు ఇమిడి వున్నారు.

ఇది దీర్ఘ కథాకావ్యాలకు, సుదీర్ఘ వర్ణనాన్విత ప్రబంధాలకు కాలంకాదు క్షణంలో మనస్సును రంజింపజేసే ప్రక్రియ కావాలె. యంత్రంలో ఒక భాగంలాగా వుండే ఈనాటి మనుష్యునికి, ఒక దీర్ఘకావ్యం పఠించి, అందులో ఉండే అందచందాలను అవగాహన చేసుకొనే సమయం ఏది? అందుచేత పత్రికలలో చూసినా, సభలలో విన్నా మనకు ఖండకావ్యాల రూపంలోనే నేటి కవిత దర్శన మిస్తున్నది. అంటే ఇది ఖండకావ్యాల యుగం అన్నమాట. అప్పు

దప్పుడూ సందర్భాన్ని బట్టి కవిలో కలిగిన చైతన్యస్థితిబట్టి వెలువడిన కవితా ఖండాలు కూర్చగా, శ్రీ నీలా జంగయ్యగారి 'సంస్కార భూషణం' అవతరించింది. దాదాపు నలుబది ఖండికల సంపుటి యిది.

'సంస్కార భూషణం' లో మనను మొట్టమొదట ఆకర్షించేది, ఈ కవికి సంప్రదాయం మీద ఉండే ప్రీతి, ఆదరం. పోతనగారి వంటి సహజ పండిత కవులు ప్రారంభించగా, పెద్దనాదులు కొనసాగించిన సంప్రదాయం సాహిత్యంలో ఒకటి ఉన్నది. అదే సరస్వతీ ప్రార్థన కృత్యాదిలో చేయడం. 'సంస్కార భూషణం' ప్రారంభంలో మూడు పద్యాలను జంగయ్యగారు భారతీదేవిని స్తుతి చేస్తూ అంచంగా వ్రాసినారు. ఒక పద్యం ఆ విద్యామూర్తి సంబోధనా భరితంగా ఉంటే, మిగిలిన పద్యాలలో కవి ఆత్మీయత గోచరిస్తుంది: ఈ పద్యం చూడండి.

'ఏది సువర్ణమో, విలువనిచ్చి గ్రహించిన వానిదౌను సొ
మ్మేదా కళావధూటి వరియించి ధరించిన నామెదౌను, ని
త్యోదయ భానుబింబము మహోన్నత విశ్వ గృహాన దీపమై
నాద సుధా ప్రసూనముల నా కవితల్ శ్రుతులై ఫలించెడున్'

ఇందులో సువర్ణమనే మాట మీద శ్లేషించి చమత్కరించడం, ఒక విశేషమైతే, కవికి కలిగిన ఆత్మవిశ్వాసం చదివే వారిని వెంటనే ఆకర్షిస్తుంది.

ఇటీవలి కాలంలో మన సమాజంలో కొందరు తాము నాస్తికులం అని చెప్పుకోవడం ఫ్యాషన్ అయిపోయింది. వీరు తమను మానవతా వాదులు అని పేర్కొనడం కూడ వినిపిస్తుంది. (ఆస్తికులకు మానవత్వం మీద విశ్వాసం లేదన్నట్లు!) ఈ మానవతా వాదులు యథార్థానికి అంతరాంతరాల్లో ఆస్తికులే. అయితే, ఎందుచేత ఆ భావాన్ని మాత్రం పైకి ప్రకటించరు. నీలా జంగయ్యగారు ఈశ్వరుని మీద పరిపూర్ణమైన విశ్వాసం కలిగినవారు. దాన్ని దాచి

పెట్టక స్పష్టంగా చెప్పే సిన్సియారిటి, ధైర్యం వారికి ఉన్నవి. తన ఇష్టదైవం లోనే వారు మానవత్వాన్ని దర్శిస్తారు. తనను తాను చూచుకొంటారు. తన కవిత్వాన్ని ప్రతిబింబింప చేసుకొంటారు. ఈ పద్యం చూడవలసిందే.

'నీకు నాకు మధ్య నెలకొన్న ప్రేమలో
సర్వభేద చయము సమసి పోయె
జన పరస్పరాను సరణ బంధమ్ములో
జగమనంత రాగ జలధియయ్యె'

అనంతరాగ జలధిలో లీనమైన ఈ కవిగారు మానవతావాది అనే ప్రత్యేక బిరుదాన్ని తగిలించుకోకనే, ఆ తత్త్వాన్ని తన సొంతం చేసుకొంటున్నారు.

విద్యాధిదేవతయైన సరస్వతీదేవిని ఆరాధించడం, సాహిత్యకంగా ఒక సంప్రదాయం. ఆ సంప్రదాయానుసరణమే కవికి ఉన్న ఒక సంస్కారం. ఆ విధంగానే, భారతీయులు అనాదిగా విశ్వరూపియైన భగవంతుని మీద పరిపూర్ణ విశ్వాసం ఉన్నవారు. గీతాకారుడు ఆ విశ్వాసాన్ని ఉద్ఘాటించినాడు. ఆ విశ్వాసాన్ని కవి పాటించడం, భారతీయ సంస్కారాన్ని తనకు అన్వయించుకోవడమే. కవిలో ఉండే సంస్కారాలు వారి కవిత్వంలో చక్కగా ద్యోతకమైనాయి. అంతేకాదు ఆంధ్రభాషలో గడచిన వేయి సంవత్సరాలుగా వెలువడిన్న అనేక ఉత్తమ కావ్యాలను ఈ కవిగారు అధ్యయనం చేసి ఉన్నారు కాబోలు ఛందోబద్ధమైన పద్యం పేరు ఎత్తుకొన్నప్పుడు, పూర్వ కవుల రచనా సంప్రదాయ ముద్ర వారిలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈ పద్యం ఒక మచ్చుతునక.

'అందరు వేరువేరు విషయార్థములన్ వినుతాను రక్తులం
దందరు తెల్గుతల్లి చరణాబ్జములన్ పరికించు వారలే
సుందర భావనాన్విత విశుద్ధ విశాల గుణార్థసంపదల్
పొందిన వారలే యొకరి పోడిమి నొక్కరు మించ వేడ్కలన్'

పూర్వకవుల వాసనా రూపమున నున్న కవిలోని సంస్కార విశేషమే యిది.

రచనకు కవిత్వాన్ని సాధనంగా చేసికొన్నవారు, ఇప్పుడు వచనంలోనే వ్రాస్తున్నారు. శ్రీ జంగయ్యగారు కూడ అనేక వచన గీతాలను వ్రాసి ఈ కవితా సంపుటిలో చేర్చి ఉన్నారు. ఈనాడు వచన కవిత్వంలో మనకు కొట్టవచ్చినట్లు కనిపించేది దానిలోని అస్పష్టత. కవులు శిల్ప దృష్టితో ఈ పని చేస్తున్నారో, లేక తాము చెప్పేది స్పష్టంగా సూటిగా ఉంటే కవిత్వం కాదనుకొంటూము అని అట్లా చేస్తున్నారో తెలియదు కాని, వచన కవుల్లో చాలమంది అస్పష్టతను ఆశ్రయిస్తున్నారు. ఇది కవిత్వానికి ఏ విధమైన ప్రశస్తిని కలుగ జేస్తుందో చెప్పలేము. యుగధర్మాన్ని అనుసరించి జంగయ్యగారు వచన గీతాలను వ్రాసిన మాట నిజమేకాని, అస్పష్టత వారిని ఆకర్షించినట్లు కాన్పించదు. చెప్పవలసిన విషయాన్ని పండు వంచి పెట్టినట్లు చెప్పటమే వీరి అభిమతమ్మా. 'అధ్యక్షవచనం' అనే ఖండికలో ఉన్న ఈ పంక్తులు చూడండి.

> "భూమినుంచి ఆహారం పండించు రైతు అన్నదాత
> ఊహా సంస్కరణకు దీపం పట్టిన కవి అమృతప్రదాత
> .....................................
> మంచి రాజ్యంలో మానవతకు రక్షణ ఉన్నట్లే
> మంచి కాలంలో సుకవి జీవితానికి అభినందన లుంటాయి"

స్పష్టత కరువైన రోజుల్లో ఇటువంటి పంక్తులు చదువరికి హాయిని కలిగిస్తాయి.

మన దేశంలోని సాంఘిక వ్యవస్థలో కవికి ఎంతటి విలువ ఉన్నదో చెప్పడం కష్టమే. కొన్ని దేశాల్లో కవిత్వం వ్రాసి విప్లవాలు సాధించినారట కవులు. రాజ్యాలను మార్చి వేశారట కవులు. అక్షరాస్యత అంతంతగా ఉన్న మన దేశంలో కవులు ఇంతటి ధైర్యం వహిస్తారో లేదో? ఒక వేళ అట్లాచేసినా వారి వాక్కు ప్రజలదాకా అందుతుందనే విశ్వాసం ఏది? అయినా కవి తన

కర్తవ్యాన్ని విస్మరించకూడదు. తన మాట ఎవరు వింటారు? అనే చికిత్సలోకి ఈ కవి దిగనేదిగరు. తనకు అన్యాయంగా తోస్తే చాలు దాన్ని ఖండించడానికే పూనుకొంటారు - జంగయ్యగారు.

మనదేశంలో కుల మత వ్యవస్థ ఎప్పుడు ఏర్పడిందో కాని, అది సాంఘిక వాతావరణాన్ని కలుషితం చేసి, మానవ కల్యాణానికి కాక, మానవ వినాశనానికి దారి తీస్తున్నది. ప్రజాస్వామ్యం వచ్చిన తర్వాత ఈ బెడద వదలిపోతుం దను కొంటే, అది మరింత అధికంగా తన దుష్ప్రభావాన్ని చూపుతున్నది. ఈ అన్యాయాన్ని జంగయ్యగారు సహించరు.

"పూలరంగులు వేరైన పూజ ఒకటి
ఆలరంగులు వేరైన పాలు ఒకటి
ఏరు పేర్లవి వేరైన నీరు ఒకటి"

అని ధ్వన్యాత్మకంగా చెప్పి, సర్వమతాలు ఏకం కావాలని ప్రబోధిస్తాడు. ఈ ప్రబోధంతోనే ఆగకుండా, కొరడా దెబ్బకొట్టినట్లుగా ఇట్లా చెపుతాడు.

"సామాన్యుడు అసామాన్యుని కీలుబొమ్మకారాదు
మంచిచాటున వంచన చేయిదూర్చరాదు
బ్రతుకు టద్దంలో మన రూపాలు దిద్దుకోవాలె
మనిషి మనిషి మధ్య ఉన్న కుల మత వర్గ వ్యత్యాయ కుడ్యాలను
దుమ్ముదుమ్ముగా కూల్చాలె!"

కవిలో కలిగిన ఈ ఉద్వేగం ఆ వ్యవస్థలో ఉండే దుష్టత్వం మీద అని వేరుగా చెప్ప పనిలేదను కొంటాను.

'సంస్కార భూషణం' అనే ఈ సంపుటిలో పైన పేర్కొన్న విశే షాలేకాక, కవి విభిన్న రూపాల్లో దర్శనమిస్తారు. ఒకసారి ఆశావాదిగా, ఒకసారి అన్యాయ నిర్మూలకుడుగా, ఇంకొకసారి ఉపదేశకుడుగా, మరొకసారి మానవతా వాదిగా, మానవాభ్యుదయం కోరేవానిగా ఈ కవి మన కళ్ళ ఎదుట ప్రత్యక్ష మవుతాడు. ఏ కవిత చదివినా కవికి కలిగిన నూతనంగా ఆలోచించే శక్తి మనకు ద్యోతక మవుతూనే ఉంటుంది. వారి భావ ప్రకటనలో ఉండే సౌలభ్యం మనను వారికి ఆత్మీయులను చేస్తూనే ఉంటుంది. కవిలో ఉండే ఈ సంస్కారం, భూషణంగా రూపొంది వారి కవితను సార్థకం చేస్తుంది.

# బాలగీతాంజలి

## చెలమచెర్ల గోపాలకృష్ణమాచార్యులు

1958 దుర్ముఖి ఆషాఢంలో ఈ నీతి పద్యాల గ్రంథం బాలగీతాంజలి పేరుతో శ్రీ నీలాజంగయ్యకవి రచించినారు. ప్రతిపద్యం ఒక నీతి చంద్రిక. ఈ గ్రంథంలో నూటముప్పయి పద్యాలున్నాయి. పిల్లలే కాక పెద్దలు కూడా చదువదగిన గ్రంథం. బాల్యావస్థలో అనగా తన పదునైదవ ఏడున రచించిన ఈ పద్యాలలో భాసించిన కవితాకాంతి సుమనోరంజనమై అలరారుతుంది. ఈ కవిలో కవిత్వపు లక్షణాలు సూక్ష్మరూపంలో శాస్త్ర సమ్మతమై ఆంధ్రభాషా ప్రపంచాన్ని ఆవరించినట్లు పేర్కొన వచ్చును. సంస్కృతాంధ్ర భాషలలో ఎన్నో నీతి గ్రంథాలు మహాకవులెందరో రచించినవి మనం చూస్తున్నాము. ఈ కవి తన ప్రతిభా విశేషాలను అడుగడుగునా ప్రస్ఫురింపచేసే విధంగా ఈ గ్రంథాన్ని వ్రాసినట్లు ఊహింప వీలున్నది. దేశభక్తి-మాతృభాషాసక్తి కవితాను రక్తి ఈ పద్యాలలో చోటుగొన్నాయి. తన సాహిత్య రజతోత్సవ సందర్భాన్ని ఎంచుకొని బాలగీతాంజలిపై వ్యాసము వ్రాయమని నాకు లేఖవచ్చేదాక ఈ గ్రంథాన్ని చూడకుండా ఉండటం నా పొరపాటేనని ఒప్పుకోక తప్పదు. మేమిద్దరం Dip. O.L. లో సహాధ్యాయులం. మా తండ్రిగారైన శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులుగారితోను, ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం గారితోను, రామ రాజుగారితోను, కుక్కుటేశ్వర రావుగారితోను మాట్లాడుతూ వారితోనే అధి కంగా ఉండేవారు. జంగయ్యగారికి ఇంగ్లీషు వాసన గిట్టదు. Dip. O.L. లో ఆయన హిందీనే ఎన్నుకొన్నారు. అనంతాచార్య దేవల్జీగారితో హిందీసాహిత్య విశేషాలను అధికంగా చర్చించేవారు. తెనుగునేవరైనా చిన్నచూపు చూస్తే ఆయనకన్ను లెర్రబడతాయి. సహజ కవితా వేశంతో నిరంతర రచనా వ్యాసం గాలితో కాలాన్ని సద్వినియోగం చేసుకొన్న ధన్యజీవి నా మిత్రుడు జంగయ్య. నేను మిత్ర పక్షపాతిని కాదు-గుణపక్షపాతిని. బాల గీతాంజలి లోని కవిత్వపు గుణాలను సంక్షిప్తంగా తెలుపడానికి సాహసిస్తున్న నన్ను బుధవరులు మన్నించ

గోరుతున్నాను. ఈ గ్రంథానికి అభినవ పోతన వానమామలై వరదాచార్యులు గారు తొలిపలుకు వ్రాసినారు. ఎస్. శఠగోపాచార్యులుగారు, శతావధాని ఛోమ్లా వెంకటస్వామిగారు, దాశరథిగారు చక్కటి అభిప్రాయాలు వ్రాసి ఉన్నారు. ఈ గ్రంథం తన తొలిరచన గావడం మూలంగా దైవాన్ని స్తుతించి ఈశ్వరార్పణం చేసినారు. ఆంధ్ర సారస్వత పరిషత్తువారి విశారదలో ఉత్తీర్ణుడు గాకపూర్వమే బాలగీతాంజలి, ఆవేదన సుమమాల విప్లవస్వరాలు మహాప్రస్థానం గ్రంథాలు వ్రాసిఉన్నారు. ఇవన్నీ మా నాన్నగారికి ఇచ్చినారు. మా నాన్నగారు ఐరగయ్య గారిపై ఎంతో అనురాగము జూపేవారు. మా అమ్మగారు కూడా అంతే. ఈయ నకు దైవభక్తి మెండు. దైవస్మృతిలో ఈయన వ్రాసిన పద్యాల భావంతో ఆ దైవాన్ని మనం సంభావించగా ఆ దైవం ఎల్లలోకాలకు చల్లని వెలుగిచ్చువాడు. సర్వకర్మలకు సాక్షిగా నిలుచువాడు. మహితుడు-ఆదిమధ్యాంతరహితుడు. సకల లోక సృష్టికర్త. పాపపుణ్యరహితుడు-పరమాత్ముడు-అఖిలేశుడు-రక్షకుడు-అని అర్థరక్షకొరకు ప్రార్థన చేసినాడు. శబ్దంలోని అర్థం-ఒకటి. ఇది కావ్యప్రపంచ సంగతమయింది. మరో అర్థం లోకజీవన వ్యాపారానికి పనికివచ్చే ధనం కూడా. ఈయన శ్లేషార్థాలు-అక్కడక్కడ చోటుగొని కవితాగుణమై ఉప్పొంగుతుంటాయి. చివరికి గ్రంథాన్ని విశ్వరూపుడైన ఈశ్వరుని కంకితమిచ్చాడు.

మానవులకు సత్యమహిమంబు జయమిచ్చునట.
సత్యమును పలుకలేనివాడే పాపి

సత్యముననె శాంతిసౌఖ్యాలు కలుగునని సత్యాన్ని అనేకచోట్ల అభి వర్ణించినారు.

దురాశ నరునికి పాపనాశమగునని ఆశవలన లోభత్వం, లోభత్వం వలన దోషం, దోషం వలన హీనత్వం కలుగునని అత్యాశను త్యజించమంటారు.

కలిగినంతలో కాస్త బీదలకిచ్చిన త్యాగగుణమున్నవాడే దేవుడట. ఆకలివేళ అంబలే అమృతమగునట చలికి దొరికిన బొంతే శాలువగునట. పాలు త్రాగితే బలం వచ్చినట్లు మంచివారి స్నేహాల సౌఖ్యాన్ని ఇచ్చునని, కల్లుత్రాగితే కలచే మైకంవలె భావించి దుర్మార్గుని స్నేహాన్ని విడువమంటారు.

ఇందలి నీతిపద్యాలు పండితపామరులు సైతం తనివితీర చదవదగినవి. ప్రతివ్యక్తికి బాల్యం ముందువస్తుంది. బాల్యంలోనే విద్యలనేవి నేర్పవలె నంటాడు. విద్య మౌఢ్యతమసు విదళింపగా చిమ్ము-అని విద్యనుగూర్చి చెప్పినాడు.

ఎంత పెద్ద పద్యంలోనో చెప్పిన ఒక నీతిపద్యాన్ని చిన్న పద్యంలో చెప్పడానికి వీలున్నదని ఈ పద్యాన్ని జంగయ్యగారు భావపరివర్తనం గావించినాడు.

> పండితులైనవారు దిగువందల నుండగ నల్పుడొక్కడు
> ద్దండత పీఠమెక్కిన బుధప్రకరంబుల కేమియెగ్గగున్
> కొండొక కోతి చెట్టు కొనగొమ్మల నుండగ క్రింద గండభే
> రుండ మదేభసింహనికురంబులు నుండవె చేరి భాస్కరా!

అనే ఈ భాస్కర నీతిపద్యాన్ని చిన్నపద్యమైన ఆటవెలదిలో, అదికూడా మూడు పాదాలలోనే రచించి మొత్తం భావాన్ని ప్రకటించగలిగారు. ఆ పద్యమిది

> పండితులును క్రింద నుండగ నల్పుండు
> పీఠమెక్కినిలువ పెద్దయగునె
> కోతి కొమ్మనుండ దంతికేమెగ్గురా!

ఇది కవిలోని మార్మికత. పది పేజీలలోని భావాన్ని పది వాక్యాల్లో పొందు పరిచే స్వభావం గుణం గలదిగా ఈతని ఆశయం ఈ పద్యంద్వారా నిరూపించుకొన్నాడు. అనల్పార్థాలను అల్పాక్షరాలలో ఇమడ్చడం.

> 'అరుచిగల్గుకూర యనిన వెచ్చముచేటు'
> 'సత్యముననె నరుడు సర్వజ్ఞుడనిపించు'
> 'పరుల కుపకరింపనిరుపమ పుణ్యంబు'
> 'భక్తులందు దేశభక్తుడు గాంధిరా'
> 'కళలయందు కావ్యకళయె ఘనమ్మురా'
> 'శిష్యులందు మంచి శిష్యుడు సిద్ధప్ప'

'సుతునివెల్లు తల్లి మతివెల్లు విద్యరా'
'ధనముగల్గువాడె ధరణిలో పెద్దాయె'
'వేషభాషలందు విద్య భూషణమురా'
'పోరు నష్టమయ్యె పొందు లాభంబురా'
'ధర్మశీలుడన్న దైవసమానుడు'

అని ఎన్నో నీతులుపదేశించినాడు నా మిత్రుడు జంగయ్య.

ఇది నీతిశాస్త్రంలోని ఒక శ్లోకం.

సత్యం మాతా పితా జ్ఞానం
ధర్మోభ్రాత దయాసఖా
శాంతిః పత్నీ క్షమా పుత్రా
షడైతే మమ బాంధవా.

అది ఆనాటి నీతి. ఆ పద్ధతిలోనే జంగయ్యగారి నీతిని చూడండి

శాంతి తల్లి మనకు-సద్వర్తనము తండ్రి
దయయె గురుడు-సూనృతమ్మె దైవ
మఖిల సద్గుణములె-ఆత్మ బంధువులురా

అని వ్రాసినారు. ఈయన కవితలో గుణం నిగ్గుదేలుతుంది. ఈ కవి గుణవాది-రీతివాది.

'మొద్దువానికేల ముద్దుముచ్చటలిక'
'పైసతోనె సకల బంధుత్వమని యెంచు'
'తిట్టి గంపెడంత పెట్టిన ఫలమేమి'

వంటి గొప్ప నీతిసూక్తులెన్నియో ఈ పద్యాలలో పొందుపరచినారు. ప్రతిపద్యం ఒక నీతిని - ఒక సందేశాన్ని ఇచ్చి మానవతకు మంగళం పలుకుతుంది. సౌందర్యమే - కవిత. దానికి అన్యథా అలంకారములు శోభనిచ్చేటంతవరకే ఉప

యోగించవలె నంటాడు. ఈయన మెత్త మెత్తగా అగుపడతాడు. కాని కలంలో తన హృదయశక్తిని ప్రదర్శిస్తాడు. కవులపై తనకున్న భక్తిని చాటుకోకుండా మానలేదు వేమన్నను పోతన్నను త్యాగయ్యను తిక్కన్నను చాలా మెచ్చు కొంటాడు.

జనని మాతృభాష జన్మభూమియు నిన్ను
గన్నతల్లులంచు కాంక్షతోడ
సేవ జేయునెడల దేవపూజలవేల
వినర తెలుగుబాల! వినుతశీల!

ఈ పద్యాలలో మకుటం నాలుగవపాదం, చెప్పదలచుకొన్న భావం మూడు పాదాలలో ముగించి - మకుటం చివరగా నిల్పడం - రచనలో కష్టమైన పనిగా పేర్కొనవచ్చును. ఏమైనా జంగయ్యగారు జన్మతః కవి. ఆయన ఇటీవలి కృతులలో ఎన్నో గొప్ప సత్యాలను కవితామయం చేసి తెలుగు సాహిత్య లోకానికే ఒకమార్గదర్శకు డవుతున్నాడేమోననే మాట వ్రాయడానికి వీలు కలి గించినాడు.

మేమిద్దరం మా ఇంట్లో మెట్ల రూంలో చదువుకొనేవాళ్ళం. ఈయన బాల్యంనుండే ఎన్నో సాధకబాధకాలను ఎదుర్కొని బ్రతుకును కళామయంచేసి కొన్నారు. ఆయన భావలహరిలో కొట్టుకపోని శ్రోత ఉండడు. దాశరథి, నారా యణరెడ్డి, చెలమచెర్ల రంగాచార్యుల్ను, దివాకర్ల వేంకటావధాని వంటి మహా కవి పండితుల సరసన కవితాగోష్ఠులను కవిసమ్మేళనాలలో పాల్గొని కావ్యగానం చేయడం నేను చూసినాను. కవితావేశం జంగయ్యలో మూర్తిభవించి ఉన్నది. లేనిచో ఇన్ని రచనలు వారి నుంచి వచ్చేవికావు. క్రమంగా కవిరత్న బిరుదాం కితులై వాసవీ సాహిత్యపరిషత్తును స్థాపిస్తూ దాని కధ్యక్షులైనారు. శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణ చార్యులవారి "స్వప్నాల దుప్పటి"కి కృతిభర్తలైనారు. ఈ విధంగా నలుభై సంవత్సరాల చిన్న జీవితంలోనే అత్యున్నత సాహిత్య గౌరవమంచి ఎనలేని ఉత్సాహంతో ముందుకు సాగిపోతూ సాహితీమతల్లి కనేకాలంకారమ్ములు తూర్చుతున్నారు. పొద్యమైన మేరల్లో స్వీయభావాలన్న పాండిత్యపర్శక్తి స్వభావం. గలవాడు, నాటినుంచి నేటివరకు ఈ కవి చేపట్టని ప్రక్రియ లేదు. అన్నిటిలో విజయం సాధించినారు. ఏ వ్యాకరణపు సంకెళ్ళ

లోను, ఏ అలంకార నిబంధనల్లోనూ చిక్కక స్వేచ్ఛగా కవితను నడిపిస్తారు. వీరి కావ్యాలన్నీ జాతిరత్నాలు తన ఆవేదన కృతిలో

'కరడుగట్టిన హిమానీహృది
కరగినీరై స్రవిస్తున్నది-పాటలై
ఆవేదనాభరకవిత నాలో పొంగుతున్నది.
గాలితరగల తేలిపోనీ
మట్టిలోపడి మాసిపోనీ
శుక్తిగర్భంలోన పడినది-మౌక్తికాకృతి దాల్చుకోనీ'

అంటూ కవితలల్లుతున్నారు. తన అనుభవానికి వచ్చిన నగ్నసత్యాల నెన్నిటినో నిర్మొహమాటంగా కావ్యగతం చేసి కృతకృత్యులైనారు.

1. "కవి ఏ ప్రక్రియను చేపట్టినాడన్నది అంత ముఖ్యము కాకపో వచ్చును. ఏమి చెప్పినాడన్నదే గొప్పగా చెప్పుకోవలసి రావచ్చు."

2. ఓ చిన్నకవి వ్రాసిన రచనకు ఒక మహాకవి పేరుపెట్టి ముద్రించి విడుదలచేస్తే దాన్ని చూసిన విమర్శకుడు వాశిగాంచిన కవికృతి కాబట్టి 'మహా'గా ఉన్నదని పలుకుతాడు."

3. "ఎవ్వడైనా తనకున్న దృష్టితోనే ఎదుటి ప్రకృతిని సంభావిస్తాడు. తనలో విశ్లేషించుకొంటాడు. ఆ తరువాతే నిర్ణయం ప్రకటిస్తాడు."

4. ధనం వచ్చేమార్గాలు మనుషులన్వేషిస్తారు. అది లభ్యమైననాడు ప్రయోజనాలు పొంది దానిని నియంత్రణ చేస్తారు."

5. "సాహిత్యసంస్థల గ్రాంట్లు, సారస్వతానికి కేటాయించిన ప్రభుత్వ నిధులు సూటిగా రచయిత సహాయాని కందకుండా ఉన్న ప్రస్తుతాన్ని తీర్చిదిద్ద వలసియున్నది. ఏ ఒక్క వర్గసంబంధమైన జనమో పాటి ప్రయోజనాలను ఉపయోగించుకొనటం భావ్యం కాదు."

6. "పిసికిన పండును గాక పండిన పండును ఆరగిస్తేనే దాని సహజ మైన రుచి అందుతుంది.

జంగయ్య కవిగారు బహుమానాలూ, బిరుదులూ ఆశించి ఎవ్వరినీ ఆశ్రయించరు. "నిష్కపటుల జ్ఞానధనుల మర్యాదలకు నోచుకొంటే నా కవిత కదియే చరితార్థత. అప్పుడే నేను ధన్యుడను అనునట్టి మానధనులు. వీరి రచన లలితపద భూయిష్ఠమై ద్రాక్షాపాకంగా సాగిపోతుంది. జాతీయతాభావము, సామాజిక దృక్పథము వీరి రచనలలో కోకొల్లలు. ఈనాటి కవిలోని యీ పరిణత భావాలకు బీజరూపంగా ఉన్న మూలభావాలు ప్రారంభంలో "బాలగీతాంజలి" యందిట్లున్నవి.

1. గురుభక్తి - దైవభక్తి

"విష్ణుకన్న మరియు విశ్వేశ్వరునికన్న
తల్లిదండ్రె మనకు దైవసములు
పుడమియందు మనకు పూజ్యులు గురువులు"

2. విద్య

"విద్య లేకయున్న సుద్ద మొద్దని యంద్రు
విద్య నరులకెందు వినయమిచ్చు
కొద్దిమాటకాదు బుద్ధిమంతుల కిది"
"సజ్జనునకు చదువు సద్భూషణంబురా
విద్యవలన నరుడు విమలుడగును
ఘనతనిచ్చి విద్య ఘనులతో సరిదూచు"

3. దేవుడు

'కలిగినంతలోనె కాస్త బీదల కింత
పెట్టి పుణ్యమెవడు గట్టుకొనునొ
అతడె దేవుడంచు ననవలె నేవేళ'

4. అమృతము

'ఆకలైనవేళ నంబలే అమృతంబు
చలికి దొరకు బొంతె శాలువగును
అనుభవించి చెప్పినట్టి దీవాక్యంబు'

5. కష్టసుఖాలు

'కష్టసుఖము లిలను కావడికుండలు
కలిమిలేములెవరికైన వచ్చు
కొన్నినాళ్ళు వెలుగు కొన్నాళ్ళు చీకటి'
'మిడిసిపడెడు నరుడు పుడమిలో నొకనాడు
భంగపడును కొద్ది సంగతులనె
పెడుసుకట్టె ఎపుడొ పెళ్ళున విరుగురా'

6. ఆశ

'పట్టుపురుగు తనదు పొట్టనుండియె వచ్చు
దారములనె దగిలి ధ్వంసమొందు
ఆశయటులె నరుని పాశమై బంధించు'

7. బలము

'బలములేక ఎన్నొ బంధాల వడిబడి.
ఇడుములెన్నొ జనులు బడుచునుంద్రు
బలవిహీను డిలను బరువురా జనులకు'
'బలమె జీవనంబు బంధాల హేతువు
బలమె సర్వజనుల బ్రతుకు బాబు
బలము గల్గువాడె యిల మహాధీరుండు'

8. ప్రేమ

'ప్రేమ భక్తిగల్గి భీతివీడియు జనుల్
కార్యరంగమునకు కదలవలయు
ప్రేమ సకలజనుల ప్రీతిధనంబురా'
'ప్రేమతోడ మనకు పెట్టినంతయె చాలు
నదియె గొప్ప ద్రవ్యమరసిచూడ
తిట్టి గంపెడంత బెట్టిన ఫలమేమి ?'
'మానధనుని ప్రేమ మహిసుధార్ణవమురా
కామి ప్రేమ రొచ్చుకాల్వ సుమ్ము
స్వార్థపరుని కొల్వు శవజాగరంబురా !'

9. మతము

'అగ్నియన్న నొకటె అంగారయన నొకటె
రాముడతడె మరి రహీమతండె
అక్షరములె వేరు అర్థంబులొకటెరా !'

10. కవి గౌరవము

'కవులటన్న ప్రేమ గౌరవంబుల జూపి
రాజరాజులపుడు పూజసల్ప
పొట్టకవులటంచు తిట్టి పోయుదురిప్డు'
'గుణవిహీనుచెంత గుణగణాఢ్యుడు మెల్గ
తప్పదతని కీడు తరచిచూడ
అగ్గికణము వద్ద వెన్నముద్దయు బోలు'

11. తెలుగు భాషాభిమానం

'తెలుగుబాలలకును తెలుగె యందమురన్న
పలువురెన్నియన్న పాటియేమి ?
తెలుగుబాల వెలుగు కళల వెన్నెల జిల్కు'
'దేశభాషలందు తెలుగు లెస్సయటంచు
తెనుగుభాష తేనెతీపియనుచు
పలుకుచున్న బుధుల పలుకుల మహిమమ్ము
వినర తెలుగుబాల వినుతశీల !'

ఈ రకంగా చెప్పుకుపోతుంటే ఎంతైనా చెప్పవలసి ఉంటుంది. నా మిత్రుడిని పొగడటం నన్ను నేను పొగడుకోవటమే అవుతుంది. అందువల్ల ఇంతటితో ఈ కావ్యవిషయక ప్రసక్తిని ముగిస్తూ ఆ చిద్విలాసుడు శ్రీనివాసుడు జంగయ్యకవిగారి కాయురారోగ్యైశ్వర్యాదికమునిచ్చి బ్రోచుగాతమని ప్రార్థించు చున్నాను.

# విప్లవ స్వరాలు

## "కన్యల సమస్యలకు అద్దంపట్టిన కన్యావిక్రయం"

—కామర్సు సీతామహాలక్ష్మి

మానవుడు సాధింపకోరేది, కోరినదానిని సాధించడానికే ప్రయత్నం చేస్తూవుంటాడు. సృష్టికి పునఃసృష్టి చేయగలిగినవాడు ఒక్క కవే. అందుకే కవిని ప్రజాపతితో పోల్చారు. కావ్యజగత్తును సృష్టించి నిద్రాణమైన మానవాళిని మేల్కొల్ప గలిగినవాడు కవిపుంగవుడే. జీవితవిధానంలో ఏ విధమైన మార్పు తీసుకురావాలన్నా కవే పూనుకోవాలి. అందుకే మనస్సుకు ఆనందాన్ని కలిగించే కళల్లో కవిత్వానికున్న స్థానం అత్యుత్తమం. కవిత్వం మానవునిలో మార్పు, మనస్సుకు ఆహ్లాదాన్నే కాదు ఆదర్శాన్ని కూడ చూపిస్తుంది. మారుమూలల మానవ మనఃఫలకాలపై చెరగని ముద్ర వేయగల్గేది ఒక్క కావ్యమే అని నొక్కి వక్కాణించవచ్చు. కలకాలం నుండి అన్యాయాలకు లోనై, అక్రమాలను ఎదిరించలేక అచేతనంగా వున్న మానవాళికి దారిచూపి ధైర్యం చెప్పగలిగేది ఒక్క కలమే. అయితే కాలాన్ని ఘట్టాల్నికూడ మార్చగల ఆ కలం వాడిగలదై ఉండాలి. తాను చేసిన సృష్టి సుఖదాయకమా కాదా అని కవి ఎప్పటికప్పుడు పరిశీలించుకుంటూనే వుంటాడు. శ్రీ కందుకూరి వీరేశలింగంగారి రచనలు, గురజాడవారి "కన్యాశుల్కం" వంటి నాటకాలు సాంఘిక దురాగతాలను, దురాచారాలను తీవ్రంగా గర్హించాయి.

> "దేశమంటే మట్టికాదోయ్
> దేశమంటే మనుషులోయ్"

లాంటి గేయాలు ప్రజల్లో ధైర్యోత్సాహాలు, దేశభక్తిని పెంచాయి. అట్లాగే శ్రీ నీలా జంగయ్యగారి "కన్యావిక్రయం" కూడ.

శ్రీ నీలా జంగయ్యగారు సమాజంలో జరుగుతున్న అత్యాచారాలను, కుటిల శాసనాలను చూసి ఉద్రిక్తులై తమ ఈ "కన్యావిక్రయం" అన్న కావ్య ఖండికలో ఒకచోట

"జాతిమతంబు మానవ ని
జాయితి కంతకు చేటు భారతీ
జాతికి దూరులై కుటిల శాసనముల్ గయిసేయ నెంతురా
ఘాతుకులార ధర్మమును. ఘాతుకజేసెదరా? హరేహరీ!!
పాతకులార, దుష్టమృగ భావపరంపర లుల్ల సిల్లగన్"

అని, ఘాటుగానే విమర్శించి, ఇలాంటి శాసనాలు మానవజాతికే చేటు అని పాపాత్ములారా! అని కటువుగానే చెపుతారు.

"యత్రనారీ పూజంతి
తత్రరమంతి దేవతాః"

అని అనాదిసిద్ధంగా మన ఆర్యావర్తనంలో స్త్రీకి అత్యంత గౌరవస్థానం ఉండేది. కాలానుగుణంగా సమాజంతోపాటు స్త్రీల పరిస్థితి కూడ మారుతూ వచ్చింది. కడుపు కక్కుర్తికి కన్నకూతుర్ని కూడ అమ్ముకునే అధోగతికి దిగజారిపో యింది సమాజం. అదిచూసే మనకవి కావ్యానికి ప్రారంభంలోనే

"కన్నబిడ్డల నమ్ముక కడుపునింపు
కవని జీవించునట్టి పాపాత్ములెపుడు
యితర బాగోగులెట్లు సహింత్రువారు
కుత్తుకలదున్మ వెనుదీయకుందురేమొ ?

అని తమ బిడ్డలనే అమ్ముకొనేవారు ఇతరుల ప్రాణాలు తీయడానికి కూడ వెన కాడరేమో అనే సందేహాన్ని వెలిబుచ్చుతూ ప్రశ్నిస్తారు.

ఆ ఆడబడుచును అమ్మి నిశ్చితంగా వెళ్ళిపోతాడు తండ్రి. ఇక ఆమె పాట్లు భగవంతునికే ఎరుక. అత్త కుంటిది అయికూడ ఆరడి పెడుతూనే వుంటుంది. మొగుడా పుట్టంధుడు, దుర్భరమైన బ్రతుకు బ్రతుకుతూ తపించ

మని భగవంతుడు నాకీ జన్మను ఇచ్చాడు. ఎంత దురదృష్టశాలినోకదా అని విలపిస్తూ వుండడం చూసి కవి హృదయం కరిగిపోతుంది.

'పరుల దుర్గతి గని గుండె కరగి వగచి
... ... ... ...
... ... ... ...
ఏడి భగవంతుడని సంశయింతు వేల ?

ఇతరుల దుఃఖాలను చూసి హృదయం ద్రవించినవాడే భగవంతుడు.

'ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే'

అని భగవంతుడు గీతలో చెప్పినట్లు అధర్మాలను అక్రమాలను తొలగించి విశ్వ శ్రేయస్సు, దేశకల్యాణం, సమాజ ఉద్ధరణకొరకే కవి కావ్యసృష్టి చేస్తాడు. అవసరమైతే కఠినంగా శాసిస్తాడు. కనుకనే కవి నిరంకుశుడు. అట్టివారు కనుక కనే జంగయ్యగారు ఈ కావ్యంలో ఎంత కటువుగా విమర్శిస్తున్నారో చూడండి.

'పసిబిడ్డ నమ్మి యాబ్రతుక్కు బ్రతుక్కుటకంటె
పస్తులు బండిన ఫలముగాదె?
... ... ...
'పరమాన్నములు దిని జలిసి బొజ్జిబెంచు
కన్న సంకటి మేలుగాదెతినగ
... ... ...
మెక్కుచున్నాడు కనతండ్రి డొక్కనింద
రోత దిన్నట్లుగాదె? యీ పాతకుండు'

అంటూ దూషిస్తారు. నిజమైన కవి ఎవరి దయాధర్మాలకు ఆశపడడు, అధరాభి మానాలకు లొంగిపోడు. బెదిరింపులకు భయపడడు. ఏ పరిస్థితిలోను ఎవరికీ తలవంచడు. కనకనే తన భావాల్ని స్పష్టంగా నిర్భయంగా ప్రకటించ గల్గుతాడు.

కవి కర్మ కావ్యం, కార్యాలు పండితుడు కవిని ప్రవక్తగా వ్యవహరిం చాడు. జాతి సంస్కృతికి ఉపాధ్యాయుడెంతటి బాధ్యత వహించాలో అంతకంటె మించి కవి మానవ శ్రేయస్సుకు బాధ్యత వహిస్తాడు. ఈనాడు రచనారంగంలో కొన్ని కొన్ని విషమపరిస్థితులు, పరిణామాలు కనిపిస్తున్నాయి. అధికారం, ధనం ఈ రెండు కవితాప్రపంచాన్ని కల్లోలపరుస్తున్నాయి. అయినప్పటికి ఈ రెండిం టికి అతీతంగా ఈ కవి బాధ్యతను గుర్తించి మెలుగుతున్నారు. యదార్థమైన కవి తన సంఘ పరిస్థితులకు కాలానికి చెందిన వాతావరణం నుండి జంకడు. భూతకాలం కూర్చిన విశేషతను స్వాయత్తం చేసికొని ప్రస్తుత పరిస్థితులను సరిదిద్దుతూ భవిష్యత్తులో సంఘాన్ని ఉత్తమ మార్గంలో నడిపించడమే తన లక్ష్యంగా పెట్టుకొని నిరంతర కృషి చేస్తాడు. అట్టాంటివానికి ప్రతినిధి మన జంగయ్యగారు.

సాహిత్యం సమాజానికి ప్రతిబింబం. సమాజంయొక్క ప్రభావంవల్ల సాహిత్యం సృష్టించబడుతుంది. సాహిత్యం యొక్క ప్రేరణ పొంది సమాజం మేల్కొని ఆదర్శవంతం అవడానికి ప్రయత్నిస్తుంది. సమాజంలోని కుళ్ళును తొలగించాలి, దురాగతాల్ని తుడిచి పెట్టేయాలి. అభివృద్ధికి, ఆదర్శాలకు దారి చూపాలి. శాంతి స్వేచ్ఛను సాధించాలి అన్నదే శ్రీ జంగయ్యగారి ఆశయం. వీరి రచన రచనకొరకుగాక జీవితాన్ని సుఖప్రదంగా ఆదర్శవంతంగా తీర్చి దిద్దడానికే సాగుతోంది. సాహిత్యం ద్వారా మానవ సాంఘిక జీవితాన్ని పునర్నిర్మింపచేసికోవాలి. ఈ యుగవిశిష్టతను ప్రజలకు బోధించాలి. సామాజిక సమస్యలకు పరిష్కార మార్గాన్ని స్ఫురింపచేయాలనే ఈ కవి దీనిలో చేసిన నిరంతరకృషి ఇంతటి ఉన్నత ఆదర్శాలు, ప్రతిభావ్యుత్పత్తి వున్నందువల్లనే మనకవిశిరోమణి సారస్వత రంగంలో ప్రవేశించి గేయపద్యాలలో వారి భావా వేశాన్ని ఈ ఖండకావ్యంలో వ్యక్తీకరించగలిగారు. ఆ భావవ్యక్తీకరణకు సాధనభాష, ఆ భాష ప్రజలభాషగా వాడడం ఈ యుగవిశేషం. సరళమైన పదాలతో సులలితంగా పామరులకు అర్థమయ్యేవిధంగా కవితల్లిడం సామాన్య మైన విషయంకాదు.

స్వీయనిర్మాణజగత్తులో కవి సర్వసమర్థులు. దానిలో వారికి దుస్సాధ్య మైన కార్యం ఏదీలేదు. అందుకే జంగయ్యగారు సమాజంలో జరుగుతున్న

అన్యాయాలను తమ కవితలద్వారా దుయ్యబట్టారు. "కన్నబిడ్డ అనే మమకారం లేక ప్రేమపాశాన్ని త్రెంచుకొని ముష్టి మూడునాళ్ళ బ్రతుకుకోసం కన్నబిడ్డనే అమ్ముకొని కఠినుడైన తండ్రిని అమ్మ పేరుపెట్టుకొని అల్లారుముద్దుగా అమ్మా! అని పిలుచుకొనవలసిందిపోయి, బిడ్డ క్షేమం తెలుసుకొనవలసింది వదిలి అర్థం గోరి కసాయివాడికైన బిడ్డనమ్మేవాడు ఖునుడుగాక తండ్రా" అని తీక్షణంగా ప్రశ్నిస్తారు.

"ఆహసే ఉపజాతా హై కవిత" అన్నాడు ఒక సుప్రసిద్ధ హిందీకవి. వాల్మీకి మహర్షి నోటినుండి వెలువడిన శోకమే శ్లోకరూపంలో రామాయణానికి మూలమైంది. "ఏకో కరుణరస ఏవ" అన్నాడు భవభూతి. నవరసాలలో ప్రజల హృదయానికి అతిసన్నిహితమైనది కరుణరసం. "విప్లవస్వరాలు" అని పేరు గల ఈ పుస్తకంలో "కన్యావిక్రయం" కావ్యఖండిక కరుణరస ప్రధానమైంది. ప్రతిభాశాలియైన కవి సృష్టిలో ఏ వస్తువును తిలకించినా అతని హృదయంలో ఒక విధమైన ఉత్సాహం జనించి ఆవేశపూరితుడౌతాడు. ఈ విధంగా భావానికి రసానికి జన్యజనక సంబంధం ఉంది. కవిలోగల భావప్రాధాన్యతను, ఉద్రేక ప్రాధాన్యతను వ్యక్తం చేయడమే భావకవిత్వం అనబడుతుంది.

"ఇంతేనా ఇంతేనా సౌఖ్యం
బీజన్మకు నింకనింతేనా?
సుంతయైన దయలేదా? దేవా!
యెంతకాలం మిటులోపిక బట్టెద?
అకటా! నా జీవనదం బిదియే
మడవుా గుట్టలబడి పాయున్"

అన్న బసవరాజు అప్పారావుగారి భావకవిత్వానికి పోలికగా "అయ్యయ్యో! యింత పాపమీయవని గలదె? లోకేశ్వరా! యిక దలపనెవదను" యందు అన్నది కనబడుతుంది. ఇక

"బుద్ధిలేని మనిషి పుట్టనా గిట్టనా" అన్నచోట వేమన పద్యంలోని "పుట్టలోన చెదలు పుట్టదా గిట్టదా? అన్న సూక్తి కనబడుతుంది.

అజ్ఞానదశలో అంధకారబంధురమైన జాతిని మేల్కొలిపి జ్ఞానోదయాన్ని కలుగజేయడానికి కవిత్వంకంటె మించిన మహత్తర సాధన ఇంకొకటిలేదు. దేశంయొక్క కష్టసుఖాలు మంచిచెడ్డలు, ఒడుదుడుకులు సమకాలీన వాఙ్మయంలో ప్రతిబింబిస్తూ వుంటాయి. కనుకనే ఈ కన్యావిక్రయం'' ఇందులోని భగవంతుడేతప్ప వేరె దిక్కులేని ఆ అసహాయస్థితిలోని స్త్రీలగోడు వర్ణనాతీతం. అట్టి విషమపరిస్థితిని జంగయ్యగారు తమ లేఖినిద్వారా కవితలో వర్ణించి కరుణారసాన్ని మూర్తీభవింపచేశారు. అందుచేతనే ఆ కావ్యం చదువుతున్నప్పుడు మనలో ఒకరకమైన తపన బయలుదేరుతుంది. అన్యాయాలను చూచి, ఆ స్త్రీలు పడే నరకయాతనలను కళ్ళకు కట్టినట్లు వర్ణించారు జంగయ్యగారు. అది చదివిన వారికి హృదయం అనేది వుంటే అది ద్రవించక మానదు. అన్యాయాలకు ఆహుతి అయిపోతున్న స్త్రీల దుర్భరపరిస్థితినిచూసి ఆవేశంతో పరవళ్ళు తొక్కేశారు కవి. అలాంటి ఆవేదనతోకూడిన ఆవేశంలోనుండి వెలువడిందే నీలా జంగయ్యగారి "కన్యావిక్రయం" అనే కావ్యఖండిక. దీంట్లో ప్రజలనుద్దేశించి "దేశదౌర్భాగ్యాన్ని చూశారా? కన్యను అమ్మి ఘోరమైన పాతకాన్ని పడికడుతున్నారని వాపోయారు.

జంగయ్యగారు గొప్ప పండితులు. వీరిది ఛందోబద్ధమైన కవిత్వం. వీరు కవిత్వపు లోతులు తెలిసినవారు. పద్యాలలో ఎన్నిపోకడలైన పోగల సమర్థులు. ఎంత క్లిష్టమైన విషయాన్నైనాసరే అతి సులువుగా అందంగా సమయస్ఫూర్తిగా చెప్పగల నేర్పు తీర్పు తెలిసినవారు. కనుకనే తమ కావ్యంలో అనాథ స్త్రీ "ఈ అవనిపై ఈ అన్యాయాలను రూపుమాపడానికి పూనుకొని ప్రజల్లో మానవత్వం కలుగచేసే కవేలేడా? అని విలపిస్తూ ఉండగా

"కనుడో! అల్లదొ! యెవ్వడో! సుకవితా
ఘంటబు చేబూని
... ... ... ...
కనియా వివాహగతి కా
వ్యాలోలుఁడై వ్రాయురా!

అని సందర్భాన్ని పురస్కరించుకొని కన్యాలోకానికి, సమాజ కల్యాణానికి కవే రక్షకుడు అన్నట్లు వ్రాయడమే వారి సమయస్ఫూర్తికి తార్కాణం. వారు అన్నింట తెలుగువారు. వీరు పద్యాలలో ఒక పలుకు పట్టి చూసినా ఉత్తమ సంస్కారి అని గోచరిస్తుంది. తమ అనుభూతుల్ని పాఠకుల మనస్సునందు అచ్చుగ్రుద్దినట్లు స్ఫురింపచేయగల ప్రతిభావంతులు.

బాధలు అధిగమించినప్పుడు, హృదయం ఆక్రోశించు సమయంలో తన పర, పెద్ద చిన్న అనే తారతమ్యం లేకుండ దుఃఖంతో ఏవేవో అనేయడం సహజమైన విషయం. ఆ సహజత్వానికి జంగయ్యగారు తమ కావ్యంలో కన్య తన్ని అమ్మినందుకు దుఃఖంతో కూడినదై కోపంతో కంపించి తండ్రిని 'వాని కడుపు కాల వాడేలతండ్రౌను కన్నబిడ్డను అమ్మి బ్రతుకు గడుపువాడు' అని ఈసడించుకుంటుంది. "పాపపుభాండం పగలకుండునా" అని శపిస్తుంది.

లోకంపోకడలు నిశితంగా విమర్శించారు జంగయ్యగారు. ఉదాహరణకు 'కన్నె వలపుల బలిగొన్న కసాయిలోకం" "దేశనాయకులంటు పచ్చని కాపు రాలు మంటగల్పనెంచు" "ఒకడు నేనూరికి పెద్దనంచు ఆలుమగల వేరెట్ట దలచు" లోకాన్ని బుక్కెటను బిగించే కుతంత్రులను, భక్తుడనని, గురుడనని అంటు వేషాలు మార్చేవారిని పట్టపగలే కన్నాలు వేసేవారిని విమర్శించారు. ఈ లోకంలో జీవితం ఎట్లా నడచునా? అని ఆలోచనలో పడ్డారు.

వీరి కావ్యంలో ఉపమాలంకారాలు కోకొల్లలు. ఉదాహరణకి ఒకటి రెండు చూద్దాం. అసలే బాధపడుతున్న కన్నె పడుచును చూసి లోకం అనేక కాలుగ ప్రశ్నలతో వేధిస్తుంది. అప్పుడు

"గుండెల్లో సూది గుచ్చుకున్నట్లు"
"నిప్పులెత్తి చల్లినట్లు"
"నాగుబాముపోలె"

"మెత్తని గులాబీపూల గుత్తులక్రింద నిశిత కంటకాలున్నట్లె పరమ యార్ద్ర హృదయాల ప్రక్కనే చేరి పాతుకున్నది ఖలుల సమూహం" ఇక వులను అవమానపరిచే వారిని పట్టుకుని

"కవులనుచు వెఱ్ఱికుంకలు
నవమానముచేసి మొరగనగునే మఱిలా
కవిపున్న వానికర్థము
నవగతమే: దుష్టదూర్తయార్యునకు నిలన్"

అని ధైర్యంగ తిడుతూ కఠినంగా ప్రశ్నిస్తారు. పిల్లల్ని అమ్ముకొనే పిసిని గొట్టులకు బండెడు రాళ్ళుకట్టుకొని బావిలో దిగడమే ఘనత అని ఉపదేశిస్తారు. ఏది ఏమైనా శ్రీ నీలా జంగయ్యగారు ఆశావాది. "ఈ యుగంలో విమల యోగీశ్వర భక్తి సౌజన్యంతో సద్బుద్ధితో తరింతురిక" అని కావ్యానికి భరతవాక్యం పలుకుతారు.

శుభమస్తు

'అన్యాయం అయఃపిండమైతే
ఆటం మహాగ్నియై మండుతుంది'।

మహాప్రపంచం నుంచి

# బుచ్చిలింగ పద్యాలు

—జి. యస్. శ్రీవత్స

కవిత కమనీయ ప్రకృతిమాత ఒడిలో ఉదయిస్తున్న సవిత లాంటిది. మనసు వీణమీద మేథో ఒంగుళులు పలికించిన సుమధుర మనోహర శబ్దానికి మరో ప్రసన్నమయిన పేరే కవిత. ఏకాంతం జీవికి పరమావశ్యకం అయిన వేళ గుండె గొంతుకలోపల కొట్టాడే క్షణాన ఆలోచనా తరంగ మాలల్లోపైన తేలివచ్చే సంగీత ఆవేశానికి, శాబ్దిక ఆవేశానికి రూపకల్పనే కవిత్వం.

అలా ఉద్భూతమైన కవిత్వం ప్రతిమనిషి మనసు తెరలలో ఆచ్ఛాదితమై వుంటుంది. తనలో దాగి తన్ను కలవరపెట్టే దాన్ని వెలికిలాగి తను దర్శనం చేసుకొని లోకానికి దర్శనం చేయించే వాణ్ణి ద్రష్ట అంటాం. ఆ ద్రష్టే స్రష్ట కూడా. ఈ రెండు గుణాలనూ కలిపేసి ముచ్చటగా కవిః అని పిలుస్తాం. కవైనవాడు సుమ పరిమళాలను ఆఘ్రాణించి పరవశించిపోగలడు. ఆకాశం క్షితికమీద ప్రకృతి చిత్రకారిణి వేసే రంగురంగు చిత్రాలకు, చేసే అందాల అలంకరణలకు పులకించిపోగలడు. అంతేగాదు అన్నార్తుని బాధామయస్వరంలో భైరవీరాగాన్ని వినగలడు. వానితోబాటు తానూ గుండెలు కరిగిపోయేట్లు ఏడ్వ గలడు. బిచ్చగాని నికృష్ట జీవనాన్ని చూసి బాధపడగలడు. సాంఘిక జీవనం దుర్భరమైననాడు ఇతర సాంఘికులందరితో కలిసి కష్టాల్ని పంచుకోగలడు. దానికి కారణభూతులయినవారిని శపించగలడు కూడా. ఏమైనా కవి అనేవాడు 'నన్ను తాకవద్దు నా మాలకాకి' అన్నట్లు ఓ మూలకు ఒదిగి కూర్చునే నిరర్థక జీవికాడు. తను అందరికోసం ఆలోచించేవాడు, భావించేవాడు, బాధపడేవాడు, సంతోషించేవాడు. ఇంకోలా చెప్పాలంటే సంఘంలో ప్రకృతిలో కనిపించే భిన్న విభిన్న వస్తువుల సమ్యగ్ సమాహార స్వరూపమే కవి.

నాయీ వాదానికి పుష్టి కలిగించడానికేమో అన్నట్లు తెలుగు కవి అనేక విషయాలను గురించి రాశాడు. రాస్తున్నాడు. బృహత్కావ్యాల కాలంనుంచి వచన కవితా కాలంవరకు ఈ ఝరి అనేక శతాబ్దాలుగా అవిచ్ఛిన్నంగా అలా సాగి వస్తూనేవుంది. కానీ ఆధునిక సాహితీక్షేత్రంలో పాఠకుల కొరతవల్ల, ఉన్న కొద్దిమంది పాఠకుల సౌకర్యార్థం, వారిని ఆకట్టుకునే నిమిత్తం అనేక కొత్త ప్రక్రియలు వాడుకలోకి వచ్చాయి. ఆధునికయుగంలో పుట్టిన అనేక కొత్త ప్రక్రియల్లో పాతది ముక్తకం.

ఈ ప్రక్రియ చేపట్టే వేమన తెలుగుసాహిత్యాంగణంలో చెరగని రంగ వల్లిగా నిలిచిపోయాడు. మళ్ళీ ఆ ప్రక్రియనే శ్రీ నీలా జంగయ్యగారు చేపట్టారు చేపట్టిన ప్రతి ప్రక్రియను రాగరంజితం చేయగల రసహృదయం, ఆలోచించిన ప్రతిమాటను పాఠకుని హృదయానికి హత్తుకునేట్లు చేయగల రససిద్ధత్వం జంగయ్యగారికి జన్మతః వచ్చిన గుణాలు. మేధ "బరువైన కొద్దీ కలం తేలికవుతుంద"న్న బెర్నార్డ్‌షా పలుకులకు రూపకల్పనే ఈ కవిరత్న కృత ముక్తక మౌక్తిక సమాహారహారం 'బుచ్చిలింగ' పద్యాలు.

ఇదో అనంత అనుభవజలధి. దీన్లో నేనేరుకో గలిగిన వాటిని కొన్ని మీముందు బాల్య చాపల్యంలో ప్రదర్శనకు ఉంచుతున్నాను. ఈ నా ఎన్నిక నా అపరిణిత బుద్ధిని మాత్రమే చూపిస్తుంది. పరిణితులకు, పరిపూర్ణులకు, పరిపక్వులకు ఇంకా చాలా గొప్పవే దొరుకుతాయి. ఈ జంగమభావ రత్నాకరోత్పత్తుల్లో నా శక్తికి అందెనవి ఇదిగో ఇవి.

> అయ్య కొంపగాలెనన్న శాంతించుడు
> అమ్మ కడుపు గాలెనన్న శాంతె
> శాంతి జగతి గాంధి స్థాపించి పోయెరా
> లచ్చనంగ బతుకు బుచ్చిలింగ !

గాంధీగారు స్థాపించిన శాంతివాదం ప్రస్తుతం పేలవంగా, దాన్ని గూర్చి తెలుసుకోవాలెనన్న జిజ్ఞాసకూడా లేని వాళ్ళ నోళ్ళలో పడి, శాంతిభావాన్ని అర్థం చేసుకోకుండానే ఉపయోగించే వాళ్ళ చేతుల్లో నలిగి మూలుగుతోంది. అయ్యకడుపు

కాలినా, అమ్మకడుపు కాలినా శాంతి, శాంతి అని వర్ణించే వాళ్ళను చూసి కవి జంగయ్యగారు విసిరిన క్రుద్ధవాక్బాణాలు ఇవి. అలాగే లోకంలో యేనికూడా దాని పేరుకు తగినట్టుగా ఉండనే ఉండవు. పేరొకటి, ప్రవర్తన యింకోటి. రెంటికీ అంతనా ఉండదూ పొంతనా ఉండదు.

కాయకంటి దొచ్చె కమలాక్షియని బిల్వ
కోమలాంగి యనగ గూనిదొచ్చె
నయము దొరికినట్టి నామంబులేంరా
లచ్చనంగ బతుకు బుచ్చిలింగ !

నిజమైన మేధావులు, బుద్ధిమంతులు తమకు రావలసిన కీర్తిని కూడా లక్ష్యించ కుండా, ఎక్కడో, ఏమూలో తమ నిరంతర అన్వేషణలో తాము మునిగిపోయి వుంటారు. కాని మిథ్యామేధావులు తమకేమీ తెలియకపోయినా విజ్ఞానుల్లాగా చెలామణి అవుతూనే ఉంటారు. ఇది లోకం రివాజు.

కలరు భువిని లెస్సఘనులు మేధావులు
వారలొదిగి వున్న వీరె ఘనులు
సారమేయములను సాహిత్యమెరుగునా
లచ్చనంగ బతుకు బుచ్చిలింగ !

యే వ్యక్తికి యేం కావాలో ఎవరూ తెలుసుకోరు. అవసరం తెలిసిన వానికి వస్తువు ఉండదు. వస్తువు వున్నవానికి అవసరం తెలీదు. అందుకే లోకం బాధను తనుగా తనలో ప్రతిబింబించే కవికి ఓ పాత తుండుగుడ్డ, తిండిలేక ఏవో రెండు మూడు వైచిత్రాలు చూపే బుద్ధిలేని గంగిరెద్దులాంటి జీవానికి శాలువలూ సన్మానం చేస్తుంటారు.

ఇచ్చె నేడ్చుకుంటు యేమేమొ యనుకుంటు
మెచ్చి యిచ్చెనొకటి మేటిదంచు
కవికి తుండుగుడ్డ గంగిరెద్దుకు శాల్వ
లచ్చనంగ బతుకు బుచ్చిలింగ !

మనిషికి నిజాన్ని తెలుసుకునే ఓపికగానీ, తీరికగాని లేవు. అందుకే కనిపించే వన్నీ నిజంకాదని తెలుస్తున్నప్పటికీ ఒప్పుకుంటూనే వుంటారు. పాటిస్తూనే వుంటారు.

పత్రికలలో పేర్లు పడువారె కవులంట
దార్ఢ్యమునకు డాల్డతైలమంట
గ్రంథమునకు సీన్మ కన్యలందంబంట
లచ్చనంగ బతుకు బుచ్చిలింగ !

లోక వ్యవహారాన్ని క్షుణ్ణంగా తెలుసుకొని, మానవప్రవృత్తిని కూలంకషంగా అధ్యయనంచేసి, వారి వారి సమస్యలకు పరిష్కారం వెతికేవాడు శాస్త్రవేత్త అవుతే, అలా తను కనుకున్న రహస్యాల్ని రమ్యంగా అందరికీ తెలియజెప్పే వాడు కవి అవుతాడు. ఈ మాటలను చమత్కారంగా జంగయ్యగారు ఎలా చెప్పాడో చూడండి.

తెలియదనెడు మాట తెలిసి పలికెడువాడు
పండితుండు శాస్త్రవరుడు ధరణి
తోచకేడ్చువాడు తుదకు కవిగమారు
లచ్చనంగ బతుకు బుచ్చిలింగ !

ఏవో ధోరణులు ప్రబలుతున్నా, కొత్త కొత్త అధ్యయన మార్గాలద్వారా కొత్త కొత్త విషయాలు తెలుసుకుంటూ మానవజాతి మేధోమార్గాన మరీ యంత్రాలుగా మారుతూ 'అభివృద్ధి'ని సాధిస్తూవున్నా, మానవతను మరచిపోతున్నారు. అందుకే మానవుని ప్రస్థానము మానవత్వం వైపుకు సాగాలని ఈ కవి ఆశ.

సర్వమరయువాడు చచ్చిపోయినవాడు
పెద్దతనము లెరగు పేదవాడు
మాలమెచ్చువాడు మహనీయుడౌనురా !
లచ్చనంగ బతుకు బుచ్చిలింగ !

జీవన కావ్యానికి ఫలశ్రుతి మరణమో, మరణం సంగీతానికి ఆలాపన జీవితమో తెలుసుకోవడం చాలా కష్టమయిన పని. రెండూ ఒకే కార్యం యొక్క పురోగమన, తిరోగమనాల్లో ఏవీ నిర్ధారణగా చెప్పలేం.

చావులోనె జన్మ సార్థకమయ్యెనో
జన్మలోన గలదొ చావుమహిమ
వీని తెలియకుండ వీఙ్ఞులు సాధింత్రు
లచ్చనంగ బతుకు బుచ్చిలింగ !

ఎండనకా, వాననకా కష్టించి, జాతి జీవనానికి ప్రాణాధారమైన ఆహారాన్ని అంద రికీ అందిచ్చే రైతుకూలికి మాత్రం రక్షణలేదు, వానికి విలువలేదు. పులిమీద పుట్ట అన్నట్లు యే తాకిడి అయినా మొదలుగా వానికే తాకేది. ఈ భావం ఈ పద్యంలో ఎంత కరుణంగా పలికిందో చూడండి.

ఎండవానలక కండలు కరగించి
తిండికొరకు రైతు మండిపోవ
పంట పైరుపైన పన్నులు వర్షించె
లచ్చనంగ బతుకు బుచ్చిలింగ !

ఇలా చూపిస్తూ పోతే మొత్తం ఈ శతకాన్నంతా ఉద్ధృతం చేయాల్సిన అవసరం వస్తుంది. అందుకే ఆ రసాస్వాదనకు మీకు కావలసినంత సమయం కల్పించడానికి పుడకలాంటి నేను తప్పుకుంటున్నాను. కానీ ఓ గమనిక దీనిలో ఉన్న పద్యాలన్నీ ఆషామాషీగా ఏదో విలాసంగా రాసినవి మాత్రంకావు. అన్నీ కనులుండే మనసులకు స్పష్టంగా కనిపించే నిజాలు.

శ్రీ జంగయ్యగారు భావం పండిన దార్శనికుడు అలంకారికాన్ని సంత రించుకున్న పండితుడు. అందుకే నాలాంటి వాణ్ణికూడా పెద్ద హృదయంతో సమాదరించిన మనీషి.

వారి కవితాశారద ఇలాగే భావప్రభలను అజస్రంగా, అలంకారకలంకారీ తనంతో ఆగిపోకుండా వెదజల్లాలెనని ఆకాంక్షిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

జయంతితే సుకృతినః రససిద్ధా కవీశ్వర :

ఇతిశ్రీ :

# సుమమాల

- తుంగతుర్తి విశ్వనాథశాస్త్రి

ఈ గ్రంథము 1956 వ సంవత్సరములో శ్రీ జి. శ్రీనివాసరెడ్డి, నీలా జంగయ్యగారు ఇరువురు కవులు 'స్నేహవల్లరి'గా మారి యీ కావ్యం రచించి ఆచార్య గర్రె వీరరాఘవ గుప్తగారికి అంకితం చేశారు. ఇందులో సాంఘిక కళ్యాణమాశించిన కందుకూరి వీరేశలింగం పంతులుగారిని గూర్చి, సంఘ సంస్కర్త' శీర్షికతో, విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూరును గూర్చి 'విశ్వకవి' శీర్షికతో, శరీర ఆరోగ్యాన్ని ఆశించి 'దేహదారుఢ్యము' అన్న శీర్షికతో ఆంధ్ర ప్రజలకు సంబంధించి 'ఆంధ్రజనత' అన్న శీర్షికతో యీ రచన ప్రకటిత మైనది. పుస్తకము చిన్నదైనా యిందలి కృషిని సంభావించినపుడు యిదియొక ఉద్గ్రంథానికంటె గొప్పదని చెప్పడానికి వీలున్నది. ఒకరు ఒక పదము మొదలు పెడితే మరియొకరు ఆచరణము పూర్తిచేసి యతిస్థానము నందుననో, ప్రాస స్థానమునందుననో ఆగుతూ ఈ రచన సాగినది. యిలా కృషి చేసినవారు ఆంధ్ర దేశములో మన కాదర్శంగా చెప్పుకోవటానికి ఉదహరించదగిన సౌందరనందం కావ్యం ఒక్కటేనని చెప్పవచ్చును. పింగళి కాటూరులను కవిమిత్రులు అనుసరించడం అత్యుత్తమైన విషయం. ఆదర్శము సత్పురుషు లను అనుకరించుటయందే అభివ్యక్తమగును. యీ రచనకు యన్. శఠగోపా చార్యులవారు చక్కని పీఠికను గూర్చినారు. ఆచార్యులవారు వైదికసారస్వతాన్ని బాగుగా ఎరిగినవారు. సంఘసంస్కర్తపట్ల, విశ్వకవిపట్ల, దేహదార్ఢ్యముపట్ల, ఆంధ్రజనతపట్ల ఈ కవులకు ఎంతో ప్రేమ ఉన్నది. ఉదా॥ సంఘసంస్కర్తను గూర్చి

"చూపించినాడవు సుస్థిరత్వ పథమ్ము
దిక్కుమొక్కులులేని దీనతతికి

గరపించినాడవు గర్వాంధులకు నీతి
హృదయమాలిన్యముల్ చెదురునట్లు
సిద్ధ సంకల్ప రావు బహద్దరబిద'

అని వీరేశలింగంగారిని తలుచుకొని ప్రస్తుతించారు.

విశ్వకవిని గూర్చి సంభావిస్తూ 'తావకోత్తమ కావ్యసుధాప్రవాహ వీచికా ధ్వని మేల్కొలిపి విశ్వమునకు ప్రగతిపథమును జూపె మీ భవ్యకవిత' అని విశ్వకవిపట్ల తమ అభిమానాన్ని ప్రకటించుకున్నారు.

దేహదారుఢ్యములో ఆంధ్రభోజుడని ప్రసిద్ధి వహించిన శ్రీకృష్ణ దేవ రాయలువారి దేహదారుఢ్యమును గుర్తుకుతెస్తూ వీరవనిత లక్ష్మీబాయమ్మ చరిత లను చూడవలెనని అందుకు వ్యాయామము చేయవలెనని ప్రబోధించారు. 'ధాన్య రాసులు యింట తనరుచున్నవిగాని తినజాలవశనమ్ము తృప్తికలుగ' అని వ్రాసిన యీ సీసపద్యము ఆరోగ్యముపట్ల నిర్లక్ష్యభావము కలవారికి మార్గము ప్రసా దించునదిగా ఉన్నది.

'బలహీను డిలకు బరువురా జనములో'

అని ఆ బలము జనులకు సౌఖ్యాన్ని పనిపాటలకు ఉత్సాహాన్ని యిస్తుందని ముక్తిని పరమాత్మశక్తిని పొందుటకుకూడా బలమే కావలసివస్తుందని బలము గురించి గొప్పగా అభివర్ణించినారు. యీ పద్యములో జంగయ్యగారు మూర్తీభ వించి ఉంటారు. దైన్యానికి చావుకు దారిద్ర్యానికి దుఃఖమునకు దౌర్బల్యము హేతువని దానినుండి విముక్తి కావటానికి వ్యక్తి (అనగా స్త్రీ పురుషుడు) ప్రయత్నించవలె నంటాడు.

'బలముచే కదనోయి పాండవులు రిపులను జయించారని నృపులైనారని ఆంజనేయుడు రామకార్యమును నిర్వర్తించినాడని భారతీయులు ప్రపంచఖ్యాతి గాంచినారని, పరశురాముడు విశ్వసాహిత్యమున నుతికెక్కెనని అట్టి బలాన్ని పొందవలెనని ఆరోగ్యముపట్ల యీ కవులు ప్రదర్శించిన ఆదర్శము ఆంధ్ర సారస్వతములోనే నిరుపమాన మైనదిగా చెప్పనొప్పును.

ఈ గ్రంథములో ఈ ఖండిక మకుటాయమానమై అలరుతున్నదనడంలో అతిశయోక్తిలేదు. ఆంధ్రజనత అన్న శీర్షికలో ఆంధ్రజనత అనే దినపత్రికను, ఆంధ్రజనులను, సంబోధిస్తూ వ్రాసిన కవితగా భాసిస్తున్నది. మహదాంధ్రరాష్ట్ర నిర్మాణంబుకై దీక్షనంది సాధించె మా 'ఆంధ్రజనత' అన్న ఈ పద్యపాదముతో ఆంధ్రజనతయొక్క స్థితిని లక్ష్యాన్ని అభివర్ణించినారు. ఆంధ్రరాష్ట్ర అవతరణ కోసమే బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగారు వి.బి.రాజుగారు ఈ ఆంధ్ర జనతను స్థాపించినట్లు శ్రీ జంగయ్యగారు యీ ఖండికను గురించి నా సందేహమును అడిగినప్పుడు నిజమేనండి మీరూహించినది అని చెప్పారు. నిజంగా ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి చైతన్య స్వరూపులైన ఆంధ్రప్రజలే కాక ఆంధ్ర జనతవంటి పత్రికలు కూడ అవతరించి కృషిచేయడం అట్టి పత్రికలను యీ కవులు ప్రశంసించడం ఒక చారిత్రక సత్యాన్ని చాటిచెప్పుచున్నది.

ఈ గ్రంథకర్తలలో ముఖ్యంగా నాకు తెలిసినవారు శ్రీ నీలా జంగయ్య గారు. వీరి అనేక కావ్యాలతో నాకు పరిచయమున్నది. వీరి సారస్వత జీవనంతో స్నేహం ఉన్నది. వారి సారస్వత రజతోత్సవ సందర్భంలో యీ చిరుపొత్తముపై నన్ను వ్యాసము వ్రాయమని కోరిన సన్మానసంఘాన్ని అభినందిస్తూ నా మిత్రుని కృషిని సమీక్షించే అవకాశం కలిగినందుకు నేను ఎంతో ఆనందిస్తున్నాను.

# వైశ్యకులదీపిక

—పి. వి. రామనరసయ్య
ఆ. ఎడిటర్, చేనేతపత్రిక

శ్రీ నీలా జంగయ్య కవిగారిని నేను రెండు దశాబ్దాలుగా బాగా ఎరుగుదును. నేను ఎడిటర్‌గా పనిచేసిన నేత వారపత్రిక 1956 నుంచే ఎరుగును. ఆయన చిన్నప్పటి రచనలెన్నో నేత వారపత్రిక ప్రకటించింది. నేత ప్రింటింగ్ ప్రెస్‌లో ఆయన విప్లవస్వరాల గ్రంథం ప్రచురితమయింది. శ్రీ నాగుల రాజకనకయ్యగారికి, శ్రీ ఎదిరి చెన్నకేశవులుగారికి జంగయ్యగారు బాగా తెలిసినవారే. పాతిక సంవత్సరాలుగా సారస్వత క్షేత్రంలో నిర్విరామంగా కృషిచేస్తూ అత్యున్నత శిఖరానికి చేరుకొన్న జంగయ్యగారి సారస్వత రజతోత్సవ సందర్భంలో వైశ్యకులదీపిక బుర్రకథ మీద నన్ను వ్యాసం వ్రాయమని సన్మానసంఘ కార్యదర్శి, మిత్రుడు శ్రీ శాయిని వెంకటేశం అడ్వొకేటుగారు కోరినారు. జంగయ్యగారి కవనలక్ష్మికి జరిగే వేడుకలో మిత్రునిగా ఉండి వ్రాయకుండా ఉండలేను కదా. ఆయన ప్రచురించిన ప్రతి రచనను నాకు స్వయంగా ఇస్తారు. జంగయ్యకవి మాకు సారస్వత బంధువు. వారితో మాట్లాడే ప్రతినిముషం సాహిత్యానికి సంబంధించేదిగానే ఉంటుంది. ఇది నా అనుభవంతో చెబుతున్నమాట వారి సారస్వత కృషి నిరంతరం కొనసాగే సాహితీ స్రవంతి వంటిది.

వైశ్యకులదీపిక గ్రంథం చిన్నదే. ఒక గంటసేపు ఈ కథను స్టేజీమీద ప్రదర్శించడానికి వీలైనది. జానపద సాహిత్యంలో బుర్రకథ ప్రక్రియ ఒకటి. ఈ ప్రక్రియ నిరక్షరాస్యులను చాలా ఆకర్షించింది. జాతీయ ఉద్యమాలలో దీని పాత్ర అమోఘమైనదిగా పేర్కొనవచ్చును. వేలాది జనాలను (స్త్రీ, పురుషులను) ఈ ప్రక్రియ ఆశించిన విషయాలను హత్తుకపోయే విధంగా తెలియజేయగలదు.

జనపదాలలో (ఊళ్ళల్లో) ఈ ప్రక్రియపట్ల ఆదరణ మెండు. వీటిని పిచ్చుకుంట్ల కథలు, జంగం కథలు అని పేర్కొంటారు. ఈ ప్రక్రియ నాగరికులనబడే జనాన్నికూడా ఘనంగానే ఆకర్షించింది. కథకుడు మధ్యస్థ తంబురా మీటుతూ ఎడమచేయి బొటనవ్రేలికి తగిలించిన అందెలను తాళంగా దర్వులువేస్తూ గజ్జెలు కట్టుకొన్న కాళ్ళతో చిందులువేస్తూ కుడి ఎడమ బుర్రలు వాయిస్తున్న వారిపల్లె విని అనుకరిస్తూ కథకుడు కథను చెబుతూఉంటే జనం మనోరంజకంగా వింటుంది. బుర్రకథా ప్రక్రియలో భారత భాగవత రామాయణాలు రచించబడినాయి. భగవద్గీత కూడా చెప్పబడింది. సామాన్యజనంలో ఈ ప్రక్రియపట్ల చాలా అభిరుచి, అభిమానం, గౌరవమున్నమాట నిజం. ఉన్నతస్థాయి గల రచయితలు కూడా ఈ ప్రక్రియలో రచనలు చేసినారు. జంగయ్యగారి వైశ్యకులదీపికను ఫిబ్రవరి 28-8-1956 న నల్లగొండలో జరిగిన రాష్ట్రార్యవైశ్య మహాసభల సందర్భంలో స్వయంగా చెప్పినట్లు మహాసభాధ్యక్షులు శ్రీ జూలూరు వీరేశలింగంగారు కవిగారిని అర్థతులం బంగారు పతకం ఇచ్చి సత్కరించినట్లు గ్రంథాదిగా ఉన్న 'నా మనవి'లో తెలియచెప్పుకొన్నారు రచయిత.

ఇందులో వైశ్యకుల ప్రశస్తిని చాటే గుప్తరాజుల చరిత్ర-భారత స్వాతంత్ర్యానికి ఆయువుపట్టయిన మహాత్మాగాంధీ చరిత్ర. అఖండ తెలుగు రాష్ట్రానికి మూలపురుషులనదగిన అమరజ్యోతి పొట్టి శ్రీరాములుగారి చరిత్ర అభివర్ణితమయింది.

వైశ్యుల నిర్మాణ కార్యకలాపాలను, వితరణశీలాన్ని ప్రశంసించే గేయంలో పాఠశాలలు-అన్నసత్రాలు-దేవాలయాలు ఎన్నో కట్టించినట్లు ఓడ వ్యాపారం, ఫ్యాక్టరీనిర్మాణాల వంటివెన్నో చేసినట్లు ప్రకటించినారు. జాతి పునర్నిర్మాణంలో వైశ్యులపాత్ర అమోఘమయిందని స్వతంత్ర భారతిని సంపన్నం చేయవలెనని వైశ్యులకు సందేశం ఇచ్చిన ఈ మహాకవిని సర్వులూ ప్రశంసిస్తారు. గ్రంథాదిని సరస్వతీస్తవం - చెప్పదలచిన ఇతివృత్తం చక్కగా ప్రవేశపెట్టారు.

ఓ భారతీయుడా ! ఓ వైశ్యసోదరా !
వినవయ్య ఈగాథ కనవయ్యా !

అని సంబోధిస్తూ పొట్టి శ్రీరాములు గురించి వ్రాసిన ఈ పాటను చూడండి!

ఆంధ్రరాష్ట్రంబున ఆదర్శమూర్తిగా
వైశ్యకులమున బుట్టి వర్ధిల్లెరా
ముక్కోటి ఆంధ్రులకు మోదంబులందించు
మూర్తిగా వెలుగొంది నిలిచాడయా ! ఓ॥

ఆత్మబలిదానంబుచేసి సమైక్యాంధ్ర
సాధించి అమరుడై వెలిగాడయా ! ఓ॥
గాంధితాతనువలె ఘనముగా తనుకూడ
కార్యసాఫల్యమును పొందాడయా ఓ॥

అనే ఈతని చరిత్రను చక్కని పాటగా మలచినారు మన జంగయ్య కవిగారు చూడండి !

ఓ ఆంధ్రసోదరా ! ఓ వైశ్యవీరుడా ! అనే పల్లవితో

ఆంధ్రరాష్ట్రముకొరకు-ఆయుస్సులర్పించి
యాబదేడుల దినము అన్నపానాల్ లేక
ఏకదీక్షనుపొంది తెచ్చాడోయి
ఆంధ్రరాష్ట్రము గట్టికొచ్చాడోయి ॥

ముక్కోటి ఆంధ్రుల ముక్తకంఠంబులు
మూలమూలల ప్రతిధ్వనులుగా మ్రోగగా
సత్యవాక్యపుదారి చూపాడోయి
చావుకైనను తాను ఓర్చాడోయి ॥

వంటి కమ్మని పాటలతో ఈ బుర్రకథ వైశ్యకులంలో పుట్టిన విశిష్టవ్యక్తుల గుణాలకు దీపంపట్టిందనడం నిర్వివాదాంశంగా చెప్పవచ్చును. జంగయ్యగారు గుణముగల చోట్లను సంభావించి వర్ణించకుండా మానరు. అందుకే కవితా జగత్తులో ఆయనకి పేరు, ప్రఖ్యాతులు లభించడం ముదావహం. శ్రీ జంగయ్య గారు ఈ పుస్తకమును రచించి వైశ్యకులదీపకుడై భాసించారు.

# రసవిపంచి

—విద్వాన్ యల్లాప్రగడ సీతాకుమారి

ఆంధ్రదేశపు కవిరత్నాలగనిలో ఇంద్రనీలమణి శ్రీ నీలా జంగయ్యగారు. వీరు తెలంగాణా తేనెమాగాణంలో జన్మించిన మధురకవి. ఈయన ఆబాల్యంగా కావ్యాలు రచించుతూ ఉండడం ఆశ్చర్యమైన విషయం. చాలామంది మహాకవులు చిన్నతనంనుండి పద్యాలు వ్రాయడం ఆచారం ఉన్నట్లే మన కవిరత్నం శ్రీనాథ మహాకవిలాగ "చిన్నారి పొన్నారి చిరుతకూకటి"నుండి కావ్యాలు రచించడము కేవలము సరస్వతీకటాక్షమే.

అది 1959 సంవత్సరం. బాన్స్‌వాడలో ఆర్యవైశ్య మహాసభలు జరుగుతున్నాయి. అప్పుడు నేను బాన్స్‌వాడ నియోజకవర్గం నుంచి శాసనసభ్యురాలిగా ఎన్నికై ఉన్నాను. అంతేగాక నేను నిజాం రాష్ట్ర మహిళాసంఘానికి అధ్యక్షురాలినిగా ఉండటంవల్ల మొదటినుండి హైదరాబాద్‌లో జరుగుచున్న వైశ్య మహాసభలలో పాల్గొనడమేగాక ఎందరో వైశ్యప్రముఖులతో పరిచయాలు, వారికి నాయందుగల ఆదరాభిమానాలు ఘనంగా ఉండేవి. తద్వత్ నేనుకూడా వారిపట్ల అట్లాగే ఉండేదాన్ని. బాన్స్‌వాడ సభలకు నేను వెళ్ళినప్పుడు ఆ సభలలో సన్నగా చామనచాయతో ప్రముఖంగా కనిపిస్తున్న ఈ కవికుమారుడు కనిపించాడు. అతనికి అప్పటికి ఇంకా ఇరవై సంవత్సరాలైనా రాలేదు. నేనా బాలకవితో అనేక సమస్యల మీద మాట్లాడినాను. అతనికప్పుడే ఆంధ్రసారస్వతములోను ఆంధ్రమహాకవులతోను ఉన్న పరిచయానికి రచనా పిపాసకు నాకెంతో ఆనందం కలిగింది. అప్పటికే ప్రచురింపబడిన నాలుగు కావ్యాలు నాకు బహూకరించినారు. ఆనాటికే ఈ బాలకవి గేయాల్లో దేశాన్ని సంఘాన్ని సమాజాన్ని బాగుచెయ్యాలెననీ, దేశాన్ని నూతనపంథాలో నడిపించాలెననీ పడే ఆవేదన విస్పష్టంగా కనిపించినాయి కూడాను. ఈతని కవితా పోకడలలో అప్పటికే శ్రీశ్రీ, దాశరథి, నారాయణరెడ్డి గార్ల ధోరణులు వినిపించినాయి. ఆనాటి బాలకవి జంగయ్య 'ఇంతింతై వటుడింతయై' అన్నట్లు దాదాపు ముప్పై కావ్యాల వరకు వ్రాసి ఈనాడు ఒక మహారచయితయై కవిరత్నమై శోభించుచున్నాడు.

జంగయ్యగారు కులాలపేరిట జరిగే అన్యాయాలనుగాని ఎవరికివారు తామే అధికులమని భావించేవారినిగాని చూసి సహించలేరు. అందుకనే

మనిషేరా అనే గేయంలో

మనిషేరా భూతలాన మహాత్ముడు
మనిషేరా నెలకొల్పెను కులమతాలను
ప్రతిమనిషికి ప్రపంచాన కులమున్నదిరా
ప్రతి సరునకు జగత్తులో మతమున్నదిరా
మనమంతా సోదరులం
మహికి ప్రేమపుత్రులం
బుద్ధుడు బోధించెనిదే
క్రీస్తు చెప్పినట్టిదిదే
మహమ్మద్ చాటినదిదియే
గాంధీజీ పలికె మరల

కరుణరసానందులగుచు. అని ఇట్లాంటి ఆరోగ్య ప్రదములైన దేశోపయోగకరములైన కవితా గేయములను రచిస్తూ ఉన్నారు. ఈనాడు ఇటు వంటి గేయాలు దేశాని కెంతో అవసరం.

ఈ రసవిపంచి కావ్యంలో మానవజాతికి సందేశమీయగల ప్రబోధాత్మ కములైన కవితలు చాలా ఉన్నాయి. 'గొప్ప' అనే ప్రారంభఖండికలో ఉగాది పండుగకు సంబంధించిన కవిత ఉన్నది. ఆ పండుగయే కవితో ఓ కవీ! నాపేర ధన కాలాలను వ్యర్థంచేయుకు 'మానవతను తీర్చిదిద్దు మనుగడకై కవితను వెచ్చించుడు వస్తా'నని మాయమయినదట ఆ పండుగదేవత. ఆ రోజున జరిగే కవిసమ్మేళనాలలో శాలువాలనెంచి పండితులు విమర్శకులుకూడా కవులై పాల్గొం టారన్న సంగతి బైటబెడుతూ 'పెకముకరడవలెగాపీ పర్వానికి కొదవేమిటి' అని ధనంతో చాలామందిని కవులుగా మార్చేయ చూస్తున్నారని అన్యాపదేశంగా చెప్పి, కవిత యిట్టిదని ప్రశంసకథకుడు చేయబూనడం, మంచిదికాదని చెబుతూ ఆ పండుగ ఇంకిట్లా అంటుంది.

భావిభాగ్య రాగోదయభావం మదివింపుకొనుచు

కవితల సందించి కాలకంఠుని దయగొనుమని సర్వేశ్వరాను గ్రహమునకు పాత్రుడవుగమ్మని ఆ పండగ కవికి సందేశం ఇచ్చి అంతర్ధాన మొందుతుంది.

రెండవశీర్షిక కవిత్వం ఇందులో పండితునికంటే కవి గొప్పవాడు. పండితుడు నందీశ్వరుడైతే-కవి ఈశ్వరుడని-కవిపండితులను పోల్చి చెప్పినారు.

కవిత ప్రాణంవంటిదని - పాండిత్యం శరీరంవంటిదని భావించి ప్రాణ రహితశరీరం నిరుపయోగమని సరియైన పండితుడు కవిని ఆరాధిస్తాడని-నిరం తరం మనస్సులో నింపుకొంటాడని ఇందలి అర్థం. అంతేగాక.

'అన్నానికే అన్నం మంచి కవిత్వం' అని కవితాగుణ ప్రశంస చేస్తారు. దానిని ఈశ్వరస్వరూపంగా భావించిన ఈ కవి చరితార్థుడు.

'చిన్నా నీకేంతెలుసు

'పెన్ను గన్నై లోకాన్ని రక్షిస్తుందని' చెప్పిన అతిసూక్ష్మమైన భావాలు బుధులకందకపోవు. కవిత్వం అలంకారాలకు మహాలంకారమట, దాని పట్ల తనకుగల మహాభావాన్ని స్పష్టంగా ప్రకటించినాడు.

క్షుద్రరాజ్యంలో అన్న శీర్షికలో

పతిత, పతిగతికల సభాతతుల......అన్న పద్యం (పుట 6)లో చెడ్డవారు మంచివాళ్ళల్లో చేరి గొప్పవారై తమ చెడ్డను తరవాత ప్రదర్శించి మంచిని చెడ్డగా చేస్తున్నారని బాధపడడమేగాక

గర్భధారణ మెరుగని-కాంతదీర్చు

ప్రసవవేదనా శాస్త్ర ప్రబంధమొండు- అన్న పద్యంతో-అను భవంలోకిరాని విషయాలపై కవితలు వ్రాసేవారిని గర్హిస్తారు. సుగ్రీవం కావాలి' అనే శీర్షికలో నరుల్ని తెలివిగలవారై ఆలోచించ మంటాడు. 'కలం కత్తి' వంటి పదప్రయోగాల ద్వారా జాతికి వినూత్న సందేశం ఇస్తాడీకవి.

భావాకృతి అన్నఖండికలో

'శాంతి పేరుతో యుద్ధంచేస్తున్నాం
విజ్ఞానంపేరున అజ్ఞానాన్ని దర్శిస్తున్నాం
కవిత్వాల పేరుతో కమ్మగా బ్రతుకుతున్నాం'

వంటి భావాలను నిర్భయంగా ప్రకటిస్తూ కృత్రిమ జీవనానికి అలవాటుపడిన వారిని హెచ్చరిస్తూ అడిగేవాడే లేకున్ననాడు - ఆడింది ఆట - పాడిందిపాటగా చెబుతూ చౌర్య ప్రవృత్తికలవాటుపడిన వ్యక్తుల్ని సూక్ష్మంగా నిందిస్తారు.

ఈనాటిదీరేపటిదీ నేనే
చెబుతానంటే
రేపటివానికి కోపం రాకమానదు.

అని ప్రబోధిస్తూ నీ సమస్తాన్నీ నిన్నూ

'సమాధిగతుణ్ణి చేసేది
నీ ఆకృతికి భావాకృతిని ప్రసాదించేది
మరొకనికి చోటు కల్పించేది సద్భావం.'

అని అదే ఉత్తమ కళయని మర్మరహితంగా 'ఆజాదీ'గా చెప్పినాడీకవి—భావ ప్రవంతిలో,

'మిన్నునూ మన్నునూ ఆవిష్కరించే
సింధువులో సంలీనం కావాలన్న
కోరికతో తనవంటివారిని చిరునవ్వులతో
కలుపుకొంటూ కొనసాగిపోతూ'

ఆద్యంతాలులేని కాలంలో కష్టసుఖాలనుభవిస్తూ బిందువుల్ని గణించి-ఆవిరిగా ఆకాశానికి ఎగసి మబ్బుపట్టి వర్షంగా భూమిమీదపడి నదియై సముద్రగర్భాన్ని ఛేదిస్తూ నింగిలో సింగిణివై మానవుణ్ణి విరాజిల్లమంటాడు.

అబ్బా! ఇవి ఏమిభావాలు! మనుషులను ఈ రకంగా ఉద్వేగ భావ పూర్ణుల్ని చేసివైచి రసప్రపంచాన్ని చిత్రంగీసి చూపిస్తాడు.

ఇట్లాంటి పీఖండికల్లో ఎన్నో ఉన్నాయి.

ఆకాంక్షలో-ఏకత్వంలో అనేకత్వం రూపొందడానికి ఆకాంక్షయే మూల మయిందన్న సత్యాలను చెబుతూనే - కవిలో శివాంశ ప్రకాశించి విశ్వాన్ని మంగళగీతాలతో ఆవిష్కరిస్తుందని రమ్యంగా-రసభరితంగా చెప్పడం ఈ కవికి వెన్నతోబెట్టిన విద్యయైపోయింది.

చావాలా? చావును చంపాలా? అన్న ద్వంద్వంలోని మాటలు విన్న ప్పుడు- ఈ కవి అత్యంత సాహసికునిగా మన ఎదుట సాక్షాత్కరిస్తాడు.

ఆరాధిస్తానన్న కవితలో మానవుణ్ణి దైవంగా సంభావిస్తాడు. ఏం చేయాలి అన్న కవితలో కాలాన్ని వ్యర్థంచేయక ఆకలి కలుగకుండా జీవించడానికి అన్నాన్ని సృష్టించు కొమ్మంటాడు.

శరణ్యామ్‌లో ఉపమానమే అసత్యం నిరుపమానమే సత్యం అన్న రెండు పదాల్లో జంగయ్యకవి కవితా సాక్షాత్కారం పొందినారన్నది తెలియజేస్తున్నారు. ఆవిష్కరిస్తానన్న ఖండికలో 'శక్తిని సత్కార్యోన్ముఖం చేయడమే ఘనత' అంటారు. కళామృతం అన్న శీర్షికలో కళలను నిర్వచిస్తూ అవి రెండురకాలని- ఒకటేమొ జీవితాల్ని అలరించేదిగా మరొకటేమొ శవాల్ని అలరించేదిగా వాకొన్నారు.

లక్ష్యంలో 'నీవున్నంతకాలం నేనూ ఉంటాను
నేను అనే నాకు నీవు అనేది లక్ష్యం'
అని భగవంతునితోనే మాట్లాడుతాడు.

జ్ఞానులు అన్న ఖండికలో జ్ఞానులూ అజ్ఞానులూ అనేవారు రూపాయ కట్టిట్టులున్న గుర్తింపుముద్రలవంటివారని అభేదంగా ఉన్నారని దివ్యవిహంగంలో బ్రతుకును కుళ్ళించే విద్యలు చదవలేనని దివ్య విహంగానై విశ్వ విహారం చేస్తానంటాడు. నేను అన్న ఖండికలో తన రాజ్యవైభవాన్ని - ఆశయాల్ని స్పష్టంచేస్తూ

'నా రాజ్యంలో సైనికుడూ ఉండడు
పనిచేయనివాడసలే ఉండడు
దరిద్రుడంతకంటే ఉండడ'న్న మాటలలో చక్కని ఆదర్శ రాజ్య స్వరూపాన్ని నెలకొల్పినాడు శ్రీ జంగయ్య.

ఇట్లా ఒక్కొక్క ఖండికను విశ్లేషిస్తూ పోతుంటే ఈతని ఒక్కొక్క కవిత్వంమీద వేలకొద్ది మాటలతో వ్యాఖ్యానించాలెనన్న సత్‌బుద్ధి విమర్శకునికి కలుగకుండా ఉండనోపదు.

ఈ రసవించికి తొడిగిన తొడుగు ఆముఖంగా 'జ్ఞానచంద్రిక' పేరుతో ప్రకటించిన దానినీ సరియైన తర్కబుద్ధితో పఠించే పాఠకునికి జంగయ్య కవిగారి ఔన్నత్యం ఎంత విశాలమయిందో అవగతం కాకుండాపోదు.

అతని ఈ రసవిపంచిలో మునగటం ప్రవేశిస్తే కాలాన్ని మరచిపోతాము. వెలుపలికి రావలెనన్న ఆకాంక్షయే పొడమదు. ఇందలి రసవిపంచి శీర్షిక ఈ గ్రంథానికి మకుటమై భాసిస్తున్నది. అందుకే రసవిపంచిపేరుతో ఈ గ్రంథాన్ని వెలువరించినారు శ్రీ జంగయ్యగారు.

ఈ కవి కవితా రజతోత్సవాల సందర్భంలో నన్ను పుస్తకంపై వ్యాసం వ్రాయమని కోరిన సన్మానసంఘంవారికి నా కృతజ్ఞతలు తెలుపుకొంటూ అభ్యుదయ భావాలుగల జంగయ్యకవిగారి రజతోత్సవాలు దిగ్విజయంగా జరగాలని కోరుతున్నాను.

కవిరత్న నీలా జంగయ్యగారు భారతదేశానికి ఆదర్శకవులై దేశానికి సంఘానికి సేవచేయాలెనని వారి రచనలకు స్వర్ణోత్సవంకూడా జరగాలని వారి కవితా ప్రవంతి నిమ్నోన్నతాలను ఏకంచేసే విధంగా ప్రవహించాలెనని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

# బ్రతుకు బాటలో పాటల మూట
# నీలా కవితా జ్వాల

— ఆచార్య తిరుమల

ఆకలినెల్ల దీర్చునది యన్నము, నేలయె అన్నపూర్ణయై
ఆకలి దీర్చుచున్నది జనాళికి బీదతనం బె లేదనన్
లోకములోన జీవులకు లోపము మూర్ఖతచే ఘటిల్లె సా
లోకనచేయ, స్వార్థముల రోయక శాంతి లభించదే గతిన్ !!

ఇంత భావోద్వేగ పూరితమైన పద్యాలు చెప్పటానికి కవికి కేవలం కవితా స్వరూప స్వభావ చిత్రణా విశేషాల్ని తెలిస్తే చాలదు. సంపూర్ణ మనస్తత్వ విశ్లేషణ, మానవతా గుణ ప్రభావాలుకూడా తెలియాలి. అంతేకాదు జీవితయాత్ర యొక్క లక్ష్యమైన శాంతి సాధనకోసం పరతత్త్వ పరమార్థ గౌరవ స్పర్శతో పులకించిన మాట కలిగి వుండాలి. అప్పుడే ఆ మాట సత్పురుష దత్తమవుతుంది. ఈ కీలకం తెలిసినవాడు కాబట్టే శ్రీ నీలా జంగయ్య- "కత్తికన్న పదునుగలది సద్వాక్యమ్ము" అన్నాడు.

తెలుగు సాహిత్య రంగంలో నిరంతర కృషిచేస్తూ, సుమారు 40 గ్రంథాలు ప్రచురించిన కవి ఎవరూ నీలజంగయ్యలా నిరాడంబరంగా ఉండటం నేను చూడలేదు. జంగయ్య కవిరత్నం. "న రత్న మన్విష్యతి" "మృగ్యతేహి తత్". జంగయ్య దేన్నీ వెతుక్కోలేదు. దేనికోసం తాపత్రయ పడలేదు. పేరు మీద మనసులేని పేరుమోసిన కవి జంగయ్య.

జంగయ్యను రసవత్కవిగా అతని చాలా కావ్యాలు పట్టిచూపుతాయి. జంగయ్య రచించిన "బ్రతుకుబాటలో పాటలమూట." కవితా సంపుటి ఆవిష్కరణోత్సవంలో పాల్గొని, ఆ సంపుటిమీద నాలుగు మాటలు మాట్లాడే భాగ్యం నాకు కలిగింది. ఆనాడు అది నాకో అసిధారా వ్రతమే అయ్యింది. ఎందుకంటే జంగయ్య తన కవితా విశ్వరూపాన్ని ప్రదర్శించిన సంపుటి అది. అందులో ఒకచోట -

పద్య కవిత్వమ్ము వచనమ్ముగా సాగి
వచనమే పద్యమై వాసిగాంచె
నేయికి బదులుగానే డాల్డ ప్రబలమై
దినపత్రికలలోన ఘనత గాంచె
త్యాగయ్య మించిన రాగయ్య కీర్తన
ఆర్కెష్ట్రపై ప్రతిష్ఠాకరమయె
పల్లెకేమని పల్కి పట్నమ్ము పరువాల
కొని తినుటలలోన గొప్పదియయి

గణన కెక్కెను కలికాల గతులగూర్చి
శ్రోతలూర్వీర బ్రహ్మమ్ము ముందె పలికె
వైపరీత్యమ్ములవి నేను పల్క వెరచి
వణకి పోతిని చలి ప్రభావమున నిపుడు !!

అంటూ సంప్రదాయ కవితాధోరణితో కనిపిస్తూనే మరోచోట -

కళాజగత్తుపేర అసత్యం-అన్యాయం
ప్రాభవం వైభవం సమకూర్చుకొంటూంటే
వక్రగతుల ద్వారా అక్రమాలు సాగించే
అధికారులు జనరంజకులుగా చాటబడితే
ఆ పత్రికలెందుకు ? ఆ ప్రచార సాధనాలెందుకు
ఆ గ్రంథాలెందుకు ? ఆవిష్కరణ లెందుకు ?

అంటూ వచన కవిత్వాన్ని కదం తొక్కించాడు. జంగయ్య ఏదిరాసినా అందులో ఒక తూగు, ఒకగతి; ఒకస్థితి వుండట మనేది సామాన్యవిషయమే అయినా -

"అవ్యక్తంగా ఉండే తత్వాన్ని అభివ్యక్తం చేసేదే ప్రతిభ" అని బ్రహ్మ జ్ఞానాన్ని ప్రకటించిన జంగయ్య కాలానుగుణంగా వచన కవితల్ని, గేయాల్ని రాసినా - ఆంతరంగిక దృష్టితో చూస్తే-పద్య పక్షపాతి ఇక్కడ -

"పద్యవిద్యకు కవితా ప్రపంచమందు

చాలినంత యశమ్ముల సంతరించె" అని అతనిమాటతోనే అతన్ని మెచ్చుకోక తప్పదు. పద్య నిర్మాణంలో చేయితిరిగిన జంగయ్య "పాటల మూట"లో ఎన్నో రకాలుగా కనిపిస్తాడు. అతని స్వభాషాభిమానం, స్వదేశాభిమానం గొప్పవి.

"మమ్మీయని తెలుగు చిలుక
మాటనేర్చి" పలకటాన్ని నిరసిస్తూనే,
"పంటలందె కాదు పదవులందున మించె

అభ్యుదయముతోడ ఆంధ్రజాతి" అని చాటి చెప్పాడు. జంగయ్యలో అరాచకంమీద, అన్యాయంమీద, అవినీతిమీద అందరి కవుల్లాగే తీవ్రమైన కోపం వుంది.

"దిక్కు మాలిన బతుకుల్ని
ఒక్కడైనా పట్టించుకోకుండా పోతే
సంఘమేమై పోవాలి?"

అంటూ బాధపడతాడు. పూని ఏదైనాను ఒక మేల్ చేసి జనులకు చూపాలన్న కోరికతో, కర్మరంగానికే తన అంగీకారాన్ని తెల్పుతూ—

"ఏ సిద్ధాంతాలు మనిషిని బతికించలేవు
పనిచేయటమే మనిషి సిద్ధాంతం
దరిద్రాన్ని ఎదిరించటమే చదువుకు పరమార్థం"

అని ప్రబోధిస్తాడు.

"నేత్రానికి నోరుంది, చెవికి చూపుంది" అనగల తాత్త్వికకవి జంగయ్య ఛాందసుడు కాదు.

"పనికిరాని పాతనింక పాతేయగ చూడు
ఉపయోగపడే కొత్తకు ఊపిరులూదగ చూడు"

అంటూ నవ్యతకు ఆహ్వానం పలికి—

"నీ రచన ద్వారా మంచిని చూపు; చెడును నిరసించు"

అని హెచ్చరిస్తాడు. అంతేకాదు—

"పరహిత మతివై రాణించు ఏ
మరక సత్యమును పలికించు
దుర్భావము మది నిరసించు స
ద్భావ మెందు నిను రక్షించుః"

అని కూడా హితోపదేశం చేస్తాడు. జంగయ్య హెచ్చరిక ఒక అక్షర ఛురిక. అతని తిట్టులో ఒక గిలిగింత వుంటుంది; ఒక ప్రేమ వుంటుంది. అది శాపం కాదు తాపం మాత్రమే.

అనుభూతి గుణప్రధానిగా, బతుకు పాటకొక వాసన, పాటల మూట నందించిన జంగయ్య.

"దేశ దేశాలు సహకార లక్ష్యంగా
దరిద్రాన్ని దాస్యాన్ని రూపు మాపే బుద్ధితో
మనిషిని మనిషి ప్రేమించే ప్రభుత్వం-సంఘం
విశ్వ దీక్షం కావాలని
శశ్వదానంద సారస్వత కాంతులతో నిండాలని
ఆశించే దెప్పుడో ఈ భూమి
నా జీవితం ధన్యమయ్యే దప్పుడు!!"

అనటంతోని విశ్వ కల్యాణ భావన యీ సంపుటికి రత్న మకుటం! అదే నీలా కవి తా జ్వాల! ఇక్కడ నేను చేసిన ప్రయత్నం ఒక కావ్య సమీక్ష కాదు. చూపుడు వ్రేలుతో ఓ సముద్రాన్నో, ఓ కొండనో చూపటం. ఇది మచ్చు మాత్రమే. అసలు చిచ్చు చాలా వుంది. అది ప్రతి అక్షరంలోనూ రగులుతూ వుంది. అది చల్లగా గుచ్చుకుంటుంది; వెచ్చగా నవ్వుకొంటుంది.

"కన్న తల్లి కడుపు కడలి మోస్తరు ముత్తె
ములును మత్స్యములను కలిగియుండు" అనే సూక్తి గుర్తుకు వచ్చినప్పుడల్లా జంగయ్యను మెచ్చుకుంటూ వుంటాను. ఆ సూక్తి జంగయ్యది. అలా అనగల జంగయ్యకవి నాకు ఆప్త మిత్రుడు. నా మాట మీద అతనికి మక్కువ. అతని అభ్యుదయం మీద నాకుమక్కువ.

# సాహిత్య వైభవం

డా॥ ఎం. కులశేఖరరావు

కవి రత్న నీలా జంగయ్యగారి సాహిత్య జీవితమూ, సామాజిక జీవితమూ రెండింటిలో గల అనుభవాలకు దర్పణం సాహిత్య వైభవం అనే వ్యాస సంపుటి. సాహిత్యకుడు తన ఏబది సంవత్సరాల జీవితంలో కన్నవీ, విన్నవీ, అనుభవించినవీ, అయిన విషయాలను మహాత్ముడు సత్యాన్వేషి మొదలు ముక్తగీతాల వరకు ఉన్న వ్యాసాలలో వ్యక్తం చేసినారు. చెప్పవలసిన విషయాన్ని అస్తవ్యస్తంగా కాక, అనల్పమైన వివేచనతో, స్పష్టంగా చెప్పడం ఈ వ్యాసాల్లో కనిపించే సర్వసాధారణమైన గుణం.

భారతదేశంలో రాజకీయమైన జాగృతికి, సాంస్కృతిక చైతన్యానికి, స్వాతంత్ర్య కాంక్షకు, స్వేచ్ఛావాంఛకు ఈ శతాబ్దంలో కారణమైన శక పురుషుడు ఎవరు అనే ప్రశ్న వేసుకొంటే, వెంటనే స్ఫురించేవాడు గాంధీ మహాత్ముడు. సత్యం, అహింస, స్వాతంత్ర్యం అనే మూడు ఆదర్శాలు ఆధారం కాగా మహాత్ముడు తాను ముందు నడిచి భారతజాతిని నడిపించినాడు. గాంధీగారి వ్యక్తిత్వం వెనుక ఉన్న ఘట్టాలను స్పృశించి, ఆ ఘట్టాలు ఆ మహాత్మునికే కాక, సమస్త భారతావనికి ఏవిధంగా మార్గదర్శకమైనవో వ్యక్తం చేసినారు శ్రీ నీలా జంగయ్యగారు. మహోన్నత వ్యక్తిత్వం గలిగిన గాంధీ మహాత్ముణ్ణి గురించి లోకం ఏమనుకొంటుందో ఈ విధంగా చెప్పినారు వ్యాసకర్త. 'గాంధీజీని అపర కృష్ణావతారమని కొందరు భావించగా, మరికొందరు రాజకీయ దురంధరుడని అన్నారు. త్యాగమూర్తి అని, అమరాగమూర్తి అని, ఏ పరిస్థితులకైనా కలతచెందని స్థితప్రజ్ఞుడని, మహాత్ముడని ప్రపంచ మేధావంతులు ద్ఘోషింపగా, అతడు ఆత్మ స్వాతంత్ర్యాన్నిపొంది భగవద్భీతి కలిగిన చిత్తంతో పీడనలకు ఎరగాని మహాత్ముడు' అని ఇతరులు భావించినారు. విశేషమేమంటే

భగవదవతారాలుగా భావింపబడుతున్న శ్రీకృష్ణుడు, బుద్ధుడుపొందని గౌరవాన్ని ప్రజలనుండి పొందినారు. అందుకే ఎంతటి కఠిన పరిస్థితులు వచ్చినా, ఆయన వెనుక స్వరాజ్యోద్యమానికి ~~బయల్దు~~ దేరినారు అందరు ప్రజలు.

నీలా జంగయ్యగారు పద్యవిద్యలో ఆరితేరిన వారేకాక, పద్యవిద్యలో ఆయనకు అభిమానం కూడ. కేవలం పండితుడైతే సరిపోదు. కేవలం కవియైతే కూడ నిండుదనం రాదు. కవిపండితుడైతే బంగారానికి తావి అబ్బినట్లే. ఈ విషయం గుర్తించిన మన పూర్వులు ముందు పాండిత్యాన్ని సంపాదించి, కవితా రచనకు పూనుకొని అభ్యాసం చేసేవారు. విశేషమేమంటే ఆధుని కాంధ్ర కవుల్లో అగ్రశ్రేణికి చెందిన వారంతా పద్యవిద్యలో ఆరితేరిన వారే. అపారపాండిత్యాన్ని గడించిన వారే. నాలుగు తెలుగు వాక్యాలు వ్రాయడం నేర్చుకొని నేను మహా రచయితను అని విర్రవీగే వారు ఈనాడు లోకంలో తరచుగా కన్పిస్తారు. వారికి కలిగే పేరు ప్రఖ్యాతుల మాట ఎట్లా ఉన్నా వారి స్థితిని చూస్తే దారుణంగా ఉంటుంది. ఒక అనుభవాన్ని ఈవిధంగా చెబుతున్నారు. 'ఒక వ్యక్తి కొన్ని నవలలు వ్రాసి ప్రచురిస్తే అమ్ముడు పోయాయి. నవల కుడుగా పేరు వచ్చింది. కాని, పాపం! ఆయనకు పద్యవిద్యాజ్ఞానం లేదు. అందు వల్ల భాషాజ్ఞానం కూడ అంతంతే! ఆయనకేమో మహాకవి అనే బిరుదు రావాలని ఉన్నది. రానందుకు కోపపడతాడు. సాహితీ మూర్తులను నిందిస్తాడు. సంస్థలను దూషిస్తాడు. పద్యకావ్యాలను అసహ్యించుకొంటాడు. ప్రతికేది పద్యమంటే నొచ్చుకొంటాడు. ఆయనను చూసి నాకు జాలివేసింది. కత్తి త్రిప్ప నేర్వనివాడు యోద్ధ అనే బిరుదు ఎట్లా పొందుతాడు'. ఈమాట ఎవరిని మనసులో పెట్టుకొని ఈ వ్యాసకర్త వ్రాసినారో కాని, పరిజ్ఞానంలేక, పనిలోనికి దిగితే, అతని అను భవం ఇదే రీతిగా ఉంటుదనడంలో సందేహ మేమి?

మన జాతి సంస్కృతిలో సంగీత సాహిత్యాలు ప్రధానాంగాలే అయినా, అవి మాత్రమే మన సంస్కృతి కావు. మనం సామాన్యంగా, అప్రధానంగా వ్యవహరించే ఆటపాటలు కూడ మన సంస్కృతిలో భాగాలే. ఎందుచేతనంటే ఈ ఆటల్లో పిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు ఏకంగా భాగం పంచుకొంటు న్నారు కాబట్టి. మనకు అనేక రకాలైన ఆటలున్నాయి. పులిజూదం, పేకాట, చదరంగం మొదలైనవి మౌనంగా ఆడే ఆటలు. గద్దొచ్చె కోడిపిల్లాట, బండారు

మైసీఆట, దాగిష్ప మూగిష్ప ఆట. ఇవి ఏదో ఒక పలుకు పలుకుతూ ఆడే ఆటలు. ఇంకా పదంతోనో, పాటతోనో, చిందుతోనో ఆడే ఆటలున్నాయి. అడుగుల భజన, జడకొప్పుల కోలాటం, స్త్రీలు ఆడిపాడే బతుకమ్మ ఆట మొదలైన వాటిని చెప్పవచ్చు. ఇవన్నీ ఆయా ప్రాంతాల్లో ఉండే చారిత్రక సంస్కృతి విషయాలను వ్యక్తం చేస్తాయి. ఇవికాక ప్రదర్శనకు యోగ్యంగా ఉండే ఆటలున్నాయి. వాటిలో చాల కాలంగా తెలుగు వారి ప్రఖ్యాతిని లోకంలో చాటి చెప్పేది తోలుబొమ్మలాట. కాని, కాలాన్ని అనుసరించి, మనవారి అభిరుచిని అనుసరించి తోలుబొమ్మ లాటలు మరుగున పడిపోయినాయి. ఈ ఆటల్లో పాడే పాటలు వినడానికి సొంపుగా ఉండేవి. నోటితో ప్రదర్శింపబడే హాస్యం, రవంత మొరటుగా ఉండినప్పటికి కడుపుబ్బ నవ్వించేదిగా ఉండేది. ప్రదర్శించడానికి భవనాలు లేకపోయినా, వెలిగించడానికి విద్యుద్దీపాలు లేకపోయినా, ఈ బొమ్మల ప్రదర్శకులు రాత్రి రాత్రి పూర్తిగా ఆటలాడించి, గ్రామస్థులందరిని అలరించేవారు. ఇపుడు మనకుచూచే ఓపిక పోయింది, వానికి ఆడించే అవకాశం పోయింది.

ఇంక వీధి నాటకాలను గురించి వినండి. వీధిలో ప్రదర్శించే నాటకాం లాంటి ఆటలు కాబట్టి, వీటికి ఈ పేరు వచ్చింది. తెలంగాణంలోని జన వ్యవహారంలో వీటికి భాగోతులు, బాగోతులాట అని మాత్రమే. ఈ దేశీయమైన నాటకాల్లో ఆడని ఆట లేదు. పాడని పాట లేదు. బాల రామాయణం మొదలు బాలనాగమ్మ కథ దాక దీనిలో ఉంటుంది. మహామాంత్రికు డాంబిక సంభాషణ మొదలు, రవితేజము లలరగ వచ్చే రాజు దాక చేసే ఆటలు పాటలు ఉంటాయి. వీటిలో సాహిత్యానికిన్నీ కొదువ లేదు. ద్విపదలు, ఏలలు, దరువులు, కందార్థాలు, కీర్తనలు, ఒకటేమిటి, అనేక ఛందస్సులను ప్రయోగించి రాగాలు కట్టి, భావ పూరితంగా పాడుతుంటే వినవలసిందే కాని దాన్ని వర్ణించడం ఎవరికి సాధ్యం. ఇప్పుడైతే మనకు టీవీలు, సినిమాలు వచ్చినాయి. వాటిని మనం వీడలేక ఉన్నాము కాని, కొద్ది కాలం క్రితం గ్రామ వాతావరణాలు ఎట్లా ఉండేవో జంగయ్య గారు చెబుతున్నారు. 'ఒక వీధిలో పిచ్చుకగుంట్ల వాండ్లు తందాన కథలు. ఒక వీధిలో యక్షగానం, ఒక వీధిలో అడుగుల భజన, మరొక వీధిలో బతుకమ్మ ఆట. ఇంకో వీధిలో ఉప్పు చెర్రాట' ఇంకో చోట నృత్యనాటకాలు. ఈ రకంగా ఈ ఆటపాటలు-శృంగార కరుణ వీర, హాస్య ప్రేమ రసభరితాలుగా, లక్ష్య లక్షణ దృక్పథాలతో-జనపదాలలో వ్యాపించి ఉండడం జరిగింది'.

మనకు స్వాతంత్ర్యం వచ్చింది. ప్రజలు కోరినట్లుగా ఎన్నికలు జరిగినాయి. ప్రజాస్వామ్యం ఏర్పడింది. మనమంతా సర్వమానవ కల్యాణాన్ని కోరుకోవడమే. సాంఘిక సంక్షేమం-నిరక్షరాస్య నిర్మూలన-దారిద్ర్య నిర్మూలన ఈ మాటలు ప్రజల నోళ్ళలో వినబడుతున్నాయి. పత్రికలు ప్రకటిస్తున్నాయి. ప్రజా ప్రతినిధులు నొక్కి వక్కాణిస్తున్నారు. కాని, దేశం ఎటు పోతున్నదో ఎవరికి తెలియదు. ప్రజలు ఏమైపోతున్నారో చెప్పలేని పరిస్థితి ఏర్పడింది. స్వేచ్ఛా వాయువులు పీలుస్తూ ఇన్ని సంవత్సరాలు గడిచినా, పరిస్థితి ఎట్లా ఉన్నదో కన్నులకు కట్టినట్లుగా చెబుతున్నారు నీలా జంగయ్య గారు.

"వేదిక లెక్కి చిలుకపలుకు లెన్ని వల్లించినా, చిన్నారి పొన్నారి చిరుత కూకటుల పోషణలో దేశం వెనుకబడే ఉన్నదన్న మాట విస్మరించారు. చిడిముడి పలుకులు నేరుస్తున్న బాలబాలికలకు గ్రామ గ్రామాన చక్కని పాఠశాలలు నెలకొనలేదు. ఆహారాది విషయాలకు సంబంధించిన స్వచ్ఛంద నిలయాలు రూపొందలేదు. దిక్కు దవాణం లేని నిరుపేద కుటుంబాలవారు-ఒక ఊరు-ఒక పల్లె అన్న చోటు లేనివారై ద్రిమ్మరులై వలస జీవనులవుతున్నారు. దినాలు-వారాలు చేసికొని బ్రదికేవాళ్ళు అదిమి పట్టుటకు సాధ్యంకాని ఆకలి బాధలతో అలమటించేవాళ్ళు అడియాసలపాలై నికృష్టకాండ ననుసరిస్తున్న సంగతి దేశం సర్వత్రా వ్యాపించిపోయి ఉన్న సంగతి కళ్ళారాచూస్తున్నాం... తమ్ముడా, నిరుపేద నారాయణా! నీ యింట్లో టెలిఫోన్ మోగదు, రేడియో పలుకదు, టెలివిజన్ కనిపించదు. వైర్‌లెస్ నీ గడప దొక్కే సమయానికే దానిపేరుతో నిలదొక్కుకొని కొనసాగనంటున్నది. ఏమి అభివృద్ధి ఏమి అభివృద్ధి!" దారిద్ర్యం ఈ విధంగా విలయతాండవం చేస్తుంటే, ఇంకొక ప్రక్క కోట్లాది ధనాన్ని వెచ్చించి మారణాయుధాలు తయారు చేస్తున్నారు. మానవత్వం మంటగలిసిపోయే ఉపాయాలు సాధిస్తున్నారు. ఈ ప్రపంచాన్ని ఒక అగ్ని గుండంలోనికి త్రోసివేయాలనే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

నీలా జంగయ్య గారు వ్రాసిన సాహిత్య వైభవ వ్యాసాల సంపుటిలో ఇటువంటి అభిప్రాయాలు అనేకం వ్యక్తమైనాయి. కొన్ని మాటలు వ్యంగ్యంగా చెప్పేవి. కొన్ని కావ్యాలు యథార్థాలను వ్యక్తం చేసేవి. కొన్ని పదాలు దుర్మార్గాలను ప్రదర్శించేవి. మరికొన్ని మానవత్వానికి కలుగబోయే ప్రమాదాలను సూచించేవి. కవిరత్న నీలా జంగయ్యగారి వ్యక్తిత్వం వలెనే విభిన్న దృక్పథాలు, విభిన్న వాస్తవాలు :

# శారదాంబ పద్యాలు

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి

ఆస్తికులున్న ఊళ్ళో కోవెల ఉండకపోదు. కోవెలలో నెలకొని ఉన్న దైవాన్ని గూర్చి ఒక్క శతకమైనా వెలువడకపోదు.

ఛందోబద్ధంగా భావాలను ప్రకటించే అలవాటున్నవాడు శతకం వ్రాయకుండా ఉండటం అరుదే. పాలకురికి సోమనాథుడు ఏ శుభవేళ శతక ప్రక్రియకు శ్రీకారం చుట్టినాడో మరి. ఇప్పటికీ శతకాలు వస్తూనే ఉన్నవి. ఉత్పలాల్లో, చంపకాల్లో, శార్దూలాల్లో, మత్తేభాల్లో, సీసాల్లో, కందాల్లో ఆట వెలదుల్లో, తేట గీతుల్లో మధ్యాక్కరల్లోనే కాదు మాత్రాగణాల్లోను శతకాలు ఒక పథకం ప్రకారం నడుస్తున్నవేమో అనిపిస్తున్నది. విశ్వనాథ వారి మధ్యాక్కరం శతక సముచ్చయానికి కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి లభించిందంటే ఆ ప్రక్రియకు నేటికీ ఉన్న ప్రాచుర్యం ఎంతటిదో చెప్పవలసిన అగత్యం లేదు.

ఈ శతక ప్రక్రియకు పునాదులు సంస్కృతంలో ఉన్న మాట నిజమే కాని, మకుట నియమాన్ని పాటించి మన తెలుగు కవులు ఆ ప్రక్రియకొక దేశీయతాముద్రను వేసినారు. పద్యం చివర రెండు పాదాలు గాని ఒక పాదం గాని ఒక పదం గానీ ఒక వాక్యం ఒకే విధంగా ఉండటం మకుటం (ముకుటం) అనుపించుకొంటుంది. శతకానికి రెండో లక్షణం రసనియమము. శతకంలోని అన్ని పద్యాలల్లో ఒకే విధమైన రసస్ఫూర్తి ఉంటుంది. శతకంలో పద్య సంఖ్య 108. శతకంలోని పద్యాలన్నీ ఒకే ఛందస్సులో ఉండటం మరొక నియమం. శతకంలో ఏ పద్యానికాపద్యం స్వతంత్రం. అన్ని పద్యాల్లోనూ ఒకే వస్తువు ఉండాలన్న నియమం లేదు సరికదా ఎంత వస్తు వైవిధ్యముంటే అంత సమంజసం.

ఈ ప్రక్రియలో ఉన్న స్వేచ్ఛ మరే ప్రక్రియలోనూ కవికి లేదు. తన పరిదేవనను, ఆత్మానుభూతిని వ్యక్తం చేసుకోవడానికి బాగా ఉపయోగపడే ప్రక్రియ శతకం. తొలుత భక్తి పరంగా ప్రారంభమయింది. ఆ తరువాత శృంగారం, నీతి, శాస్త్రం ఇంకా ఎన్నో ఎన్నో విషయాలు ఈ ప్రక్రియలో వెలువడినవి. శతకంలో చెప్పని అంశం చెప్పరాని అంశం చెప్పకూడని అంశం ఏదీ లేదంటే ఎందుకు లేదని ప్రశ్నించే వాడే ఉండడు. శతకాలలో కవులు తమ కాలంలోని సాంఘిక పరిస్థితులను సూటిగా చాటుగా చెప్పగలిగిరి. కొందరు తమ అమేయ ప్రతిభా పాండిత్యాలను భాషా వైశారధ్యాన్ని ప్రకటించు - కొన్నారు శతకాల్లో. చిత్రమేమిటంటే శతకాలలో నిత్య సత్యాలు వదిగి పోయినవి. అచ్చమైన భక్తికి మానవతానురక్తికి శతకాలు అద్దాలుగా నిలిచి పోయినవి. ఇప్పటికి అచ్చైన శతకాలు ఎనమిది వేలకు మించినవి అచ్చు కాక ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారాల్లో అచ్చు వేసుకోలేని కవుల ఇండ్లల్లో అచ్చు వేద్దామన్న సహృదయుల ఇండ్లల్లో కునుకు తీస్తున్నవి. క్రిములకు ఆహార మవుతున్నవి,

'అఖిల విద్యా ధనుల ప్రయోజకులైరి
పూర్ణ ఖంఠలు సభా పూజ్యులైరి.'

అన్న శేషప్ప కవి 1750 కాలం వాడని అనుకోడానికి వీలుందా? మన సమ కాలికుడెవడో వ్రాసినట్టుంది. శతకాలు చదివితే జ్ఞానం అబ్బుతుంది. భారత దేశంలోని అన్ని భాషల్లో శతకాలు రావడం మానివేసినవి ఒక్క తెలుగులో తప్ప.

దైనందిన జీవితంలో తారసిల్లిన సంఘటనలకు తోచిన భావాలకు కలిగిన బాధలకు బుస్సుమని పొంగిన కోపానికి వెన్నలా కరిగిన మనస్సుకు పద్యరూపం కల్పించాలంటే చాలా మార్గాలున్నవి. పద్యాల్లో కథలల్లవచ్చు కాని కావ్య నిర్వాహణ సమస్యలు ఎదురవుతాయి. ఖండ కావ్యం వ్రాయవచ్చు. ముక్త కాని కున్న వెసులుబాటు అందులో ఉండదు. లోకానికి ఏదో చెప్పాలన్న అభిలాషను శతకమే తీరుస్తుంది. కనుక సంఖ్యానీమం లేకుండా వేమన్న వేనవేలు పద్యాలు చెప్పినాడు. శతకం దైవాన్ని ఉద్దేశించి చెప్పవచ్చు, మనస్సుకు చెప్పకోవచ్చు చివరకు చీపురుకట్టను మకుటంగా పిల్లిని మకుటంగాచేసి శతకాలు చెప్పిన కవులు

లేకపోలేదు. శబ్దాలంకారాలను, అర్థాలంకారాలను సోదాహరణంగా నిర్వచించి శతకం చెప్పినకవులు ఉన్నారు. ఎగతాళిచేసిన కవులున్నారు. తన బాధ తనకే చెప్పుకొన్న కవి శతక కవుల్లో దొరికే అవకాశం ఎక్కువుంది.

శతక ప్రక్రియను గూర్చి ఎంతగానో చెప్పవచ్చు.

శతక లక్షణాలున్న 'కవిరత్న' నీలా జంగయ్య శారదాంబ పద్యాలు 'చారుగుణ కదంబ శారదాంబ' అనే మకుటంతో వెలువడినవి. 500 లకు మించిన పద్యాలున్నవి అంటే అయిదు శతకాల రతనాల పేటిక ఇది.

నీలా జంగయ్య భావుకుడు. ఛందో మరియాదలు తెలిసిన కవి. తక్కువ మాటల్లో ఎక్కువ అర్థాన్ని పొదిగే ప్రయత్నం ఛందస్సు వాకిటిలోకి కవిని లాక్కొని వస్తుంది. పదాలు పరిమితంగా ఉండి విస్తృతమైన అర్థాన్ని ఇవ్వగలిగే శక్తి సంపాదించుకోవాలి. వరదను ప్రవాహమనరు. ఒడ్డులొరుసు కొని పోతున్నప్పుడే అది ప్రవాహమవుతుంది. చాలామంది అనుకుంటున్నట్టు ఛందస్సు బంధంకాదు భావ ప్రకటనకు. భావాన్ని అందంగా హృద్యంగా సంక్షిప్తంగా చెప్పాలనుకొన్నప్పుడు ఛందోబంధంతో అనుబంధం ఏర్పడటం అనివార్యం. సామెతలు సమమాత్రాకంగా ఉండటం యతిప్రాసలతో ఉండటం పరిమిత పదాల్లో ఉండటం మనం ఎరిగినదే. "ఛీ కుక్కా అంటే ఏమక్కా" అన్నదట. ఎంతో ధ్వనిని ఎంతో ఛందో నియమాన్ని ఎంతో పరిమిత పద జాలాన్ని పొదుగుకొన్న ఈ సామెత కవిత్వమనిపించు కొంటున్నది. దాదాపు నలభై కావ్యాలను శతాధికమైన వ్యాసాలను రచించిన నీలా జంగయ్య తన పని తనాన్ని ఈ శారదాంబ పద్యాల్లోను చూపించగలిగినారు. భాషకూ, వ్యాకర ణానికీ, సంఘానికీ, నీతికీ, మతానికీ, సంబంధించిన అనేకాంశాలపట్ల తనకున్న భావాలను ఆటవెలదుల్లో నిక్షిప్తంచేసి పాఠకులకందించినాడు. పద్యాల్లో జంగయ్య చెప్పిన మాటలు గద్యాల్లోను చెప్పవచ్చు. అయితే గద్యంలో అవసరమే తీరు తుందిగాని అలంకారం పూర్తికాదు. అలంకృతంగాని భావం అలరిస్తుందని నమ్మడం లోకంతో సంబంధంలేనివాళ్ళకే సాధ్యం. జంగయ్య చెప్పేది లోకానికి తమకు చాలా తెలుసుననుకొంటున్న పండితులు జంగయ్య పాఠకులు కారు. జంగయ్య చెప్పితే వినవలసిన అవసరం తమకు లేదనుకొనే వారితో జంగయ్య

జగడం పెట్టుకోడు. మంచి కవి కనుక చక్కగా నచ్చచెప్పే ప్రయత్నం చేస్తాడు. ఆ పలుకుల తల్లి శారదాంబను ఉద్దేశించి చెప్పిన పద్యాలే ఇవి. ఆటవెలదిలో ఏ పాదానికాపాదం స్వతంత్రంగా ఉంటేనే అందం. వేమన్న సాధించిన అంశం అది. కాని జంగయ్యకు నాలుగు పాదాలనూ కలిపి కుట్టాలని కోరిక. ఈ కోరికతో ఆయన పద్యంలోని మూడు పాదాలను ఒక భావంతో జత కట్టి మకుటంతో అలంకరించినాడు. ఒక మంచి భావాన్ని వ్యక్తం చేయడానికి ఛందస్సు అడ్డంరావేరాదన్న భావం ఇందులో ఇమిడి ఉన్నది. అన్ని పద్యాల్లోనూ ఈ పద్ధతి కనిపించదు. నాలుగు పాదాలు విడివిడిగా ఉన్న నడవడితో ముడిపడిన పద్యాలనేకంగా ఎత్తి చూపించవచ్చు.

"పాలు పెరుగు లోట పరిపాటి యెవరింటి
పాలుగాని చల్లవలన తోడుకొనుట జరుగు
ప్రకృతి గుణమిట్లు భాసించు" మూడు పాదాలు కలిసి నడిచిన రీతి యిది.

"భక్తిలోన లేక పరమాత్మ డబ్బడు
చేష్టమనసులోని స్థితిని దెల్పు
లోన బైట ఒక్కటైన దేవుడు వాడె"

ఈ పద్యంలో ఏ పాదానికాపాదం స్వతంత్రం. తాను ఆటవెలదుల్లోనే ఈ కవితలెందుకు వ్రాసినాడో ఒకచోట చెప్పుకున్నాడు జంగయ్య.

"చిన్న పద్యమైన చెప్పక భావంబు
తేట తెల్లమగుట తెలివియగును
పెద్ద పద్యమైన పెరుగునా భావంబు" అని

ఉన్నవాళ్ళకు లేనివాళ్ళకు మధ్య ఉన్న బేధాన్ని చాపిన కవులనేకు లున్నారు. లేనివాడు ఇంకా లేనివాడై పోతున్నాడని ఆర్థిక పరిస్థితులు గమనించిన వాళ్ళంటున్నారు. కాని లేనివాడికి ఏమిలేకుండా పోతున్నదో లోకాన్ని చదవ కలిగిన కవికే తెలుస్తుంది. ఇప్పటి పరిస్థితులను వ్యంజిస్తున్న ఈ పద్యం జంగయ్య కలానికి ఎంత శక్తి ఉందో చెప్పగలుగుతున్నది.

"లేనివాని పేరుతోనే కలిగినవారు
బ్రతుక జూచినారు బాగ నేడు
లేనివాడు తెలివిలేనివాడై పోయె
చారుగుణ కదంబ శారదాంబ!"

అజ్ఞానానికంటే దారిద్ర్యం లేదని కవిభావం. చిన్న చిన్న మాటల్లో ఇంత ఉదాత్తమైన భావాన్ని పొదిగి సఫలుడయినాడు జంగయ్య.

కేవలం ఛందోబద్ధంగా పద్యాలు వ్రాస్తే కవిత్వం కాదని నమ్మినవాడు జంగయ్య. అలాంటి కవిత్వం వ్రాస్తే శారదకు బాధ కలుగుతుందని అయన బాధ. మంచి బుద్ధి ఉంటే చాలు కవిత్వం వ్రాయనక్కరలేదంటాడు. తాను కవి అయి ఉండి కూడా ఈ మాట అంటున్నాడంటే ఎంత విలువైన భావాలను అతడు తన కవిత్వం ద్వారా ప్రచారం చేయదలచుకున్నాడో ఊహించండి.

"భావహీన కవిత పాదాశ్రయంబైన
పలుకు చెలిమనంబు బాధపొందు
సిద్ధబుద్ధితో ప్రసిద్ధిగాంచుటమేలు.
చారుగుణ కదంబ శారదాంబ!"

యతికోసమని, ప్రాసకోసమని, గణంకోసమని మారుమూల పదాలను తెచ్చి పద్యం వ్రాసి కవిగా ఊరేగాలన్న ఉబలాటం జంగయ్యకు లేకపోవడంచేత స్పష్టంగా భావాన్ని వ్యక్తపరచడానికి ఆయన చేసిన ప్రయత్నం అన్ని పద్యాల్లోనూ కనిపిస్తున్నది. వ్రాసే అలవాటున్న వాడుకనుక ఏభావాన్నైన కష్టపడకుండా పద్యంగా వ్యక్తం చేయగలడు.

కవితా రచనలో మూడున్నర దశాబ్దాలు జీవితంలో అయిదు దశాబ్దాలు అనుభవం ఉన్న జంగయ్య రచనలను కొంచెం పదిలంగా చదవ వలసి ఉంటుంది. ఎందరో పండితుల సహవాసంలో ఎన్నో విషయాలను నేర్చుకొన్నాడు.

ఎన్నో గ్రంథాలను చదువుకొన్నాడు. ఒక్క సాహిత్యాన్నే కాదు వేదాంతాన్ని, రాజకీయాలను, ఆర్థిక శాస్త్రాన్ని తరచి చూసి మౌలిక పరిజ్ఞానాన్ని సంపాదించు కొన్నారు కనుకనే ఆయన పద్ధతి వ్రాసినా గద్యం వ్రాసినా తాను సంపాదించు కొన్న పరిజ్ఞానాన్ని ఊతగా తీసుకొని వ్రాస్తాడేతప్ప అలవోకగా ఆశామాషీగా ఏదో వ్రాసి పారెయ్యాలనే బాధ్యతా రాహిత్యం అతని కలవడలేదు. బాగా చదువుకొని బాగా ఆలోచించి వ్రాయగల వాడే ఉత్తమ రచయిత. ఊహకుతగిన పదాలను అర్థాలను సమకూర్చుకో గలిగినవాడే ఉత్తమకవి. తాను నమ్మిన భావాలనే ఇతరులకు కూడా చెప్పాలనుకొన్నవాడే మంచిమనిషి. ఏ ఎండకాగొడుగు పట్టక ఏ పార్టీకో ఏ ముఠాకో మెదడును కుదవపెట్టక తాను నమ్మినభావాలనే కవితా బద్ధం చేస్తున్న జంగయ్య ధన్యజీవి. ఆయన శారదాంబ పద్యాలు ఆయన వ్యక్తి త్వాన్ని ప్రతిబింబిస్తున్న కావ్యదర్పణాలు. జంగయ్య 50 వ జన్మదినోత్సవ సందర్భంగా శుభాభినందలను ఆశీస్సులను అందజేస్తున్నాను. ఆయన రచనలకు ఇతోధిక ప్రాచుర్యం లభించాలని ఆకాంక్షిస్తున్నాను.

# కలం కల

## సుకవితాయద్యస్తి...

డా. అక్కిరాజు రమాపతిరావు

ఉత్తమ కవిత అంతరంగాల్ని స్పృశించాలన్నాడు తిలక్. కవితా రస సిద్ధాంతానికది తిలతాయమానమైనమాట. ఇంకా, 'ఏమన్నాడూ' అగ్ని చల్లినా అమృతం కురిసినా అందం, ఆనందం' కవిత్వపు పరమావధి కావాలన్నాడు. అంటే ఏమన్నమాట! అందంగా చెప్పాలి. ఆనందం కలిగించాలి కవిత్వం అని ఆయన భావం. ఉత్తమమైన కవిత్వం ఉదాత్తంగా ఉండాలి, చిత్తాకర్షకంగానూ ఉండాలి. కళాత్మకమైన విలువలూ సామాజిక ప్రయోజనమూ కవిత్వపు నాణేనికి రెండువైపులన్నమాట. ఒకవైపు అరిగిపోయినా అస్పష్టంగా ఉన్నా ఆ నాణెం చెల్లుబాటు కష్టం. చీకట్లో గికురించాల్సిందే. చేలామణి చేయాల్సిందే. మందినీ మార్బలాన్నీ పోగుచేసుకుని చెక్కభజన చేయించుకోవాల్సిందే. నేను కవిని, చవిని, పవిని, రవిని నాకు సన్మానం చేయండయ్యా అని వేంపర్లాడాల్సిందే.

నిజమైన కవితాత్మ ఉన్నవ్యక్తికి ఇవేమీ అక్కర్లేదు. తన తృప్తి తనకు నిజమైన బహుమానం. అట్లా అని 'స్వాంతస్సుఖం' అని కూచోవాల్సిన పని లేదు. పరుగులు తీయాల్సిన పనిలేదని మాత్రమే దీని అర్థం. సుకవిత ఎక్కడ ఉన్నదో ఎవరి పాలబడిందో, మురిపాల బడిందో ఆ వ్యక్తి నిరాక్షేపణీయంగా రాజ్యాధికారాన్ని వదులుకోవచ్చు అని ఒక మహాకవిరాజు అన్నాడు. రాజకవి కూడా ఇలానే అని ఉండేవాడు. ఒట్టి కవి అయినా ఒట్టి రాజైనా ఇలా అని ఉండకపోవచ్చు. సృజనలో ఉండే ఆత్మతృప్తి రాజరికంలో ఎక్కడినుంచి వస్తుంది. 'రాజరికమ్మునన్ గల దురాగతనమ్ము కసాయివృత్తి' అని ఒక కవి రాజు శివరాజుచేత చెప్పించలేదా!

బ్రహ్మ సృష్టికన్నా కవి సృష్టి గొప్పది అని కావ్యప్రకాశం చెప్పడంలో అంతరార్థం ఉంది. బ్రహ్మసృష్టి నియతం. జీవుల కర్మఫలాల ననుసరించి

బ్రహ్మసృష్టి పరిణమితం. కవిసృష్టి అటువంటిది కాదే! "కాదేదీ కవితకనర్హం! ఉండాలోయ్ కవితావేశం". "Poetry turns all things to loveliness" అన్నాడు షెల్లీ. అంటే ఏమిటి? కవివాక్కు పరసువేది. ఆకాశపు చాంది నీలో వెయ్యివోల్టుల విద్యుద్దీపంతా సమాజాన్ని ఆకర్షిస్తుంది. ఒక్కొకసారి ఆకర్షిస్తుంది, ఘర్షిస్తుంది, మర్షిస్తుంది కూడా ఉత్తమకవిత. సమాజ నిద్రాణావస్థను పోగొడుతుంది మంచి కవిత.

డబ్బు సంపాదించే మార్గాలున్నా, అవి తెలిసినా వాటిని వదులుకొని సాహిత్యాధ్వగుడైనాడు మిత్రులు నీలా జంగయ్య. ఆయన పేరులోనే ఒక వైచిత్రి వుంది. నీలానికి భారతీయ సాంస్కృతిక పరమార్థం ఉంది. జంగమం అంటే పురోగతికం అని అర్థం. పద్యాలు వ్రాసినా, తత్త్వాలు చెప్పినా, గేయాలు కూర్చినా, వచనం రచించినా జంగయ్యగారిలో ఒక ఆర్తిమూర్తి మంతమైనప్పుడే సృజనస్పందనం కలుగుతున్నట్లు ఆయన రచనలు చదివితే తెలుస్తుంది. చాలావరకు సమకాలీన సమాజమే ఆయన కావ్య వస్తువు. ఉదాహరణకు 'కలం కల' అనే ఖండికా సంపుటిని పరిశీలించవచ్చు. ఇక్కడ కలానికీ కవికీ అభేద ప్రతిపత్తి. మరి కవి స్వప్నం అనవచ్చు కదా. అనకపోవడంలోనే కవిత్వం ఉంది. కవి స్వాప్నికుడని అనిపించుకోవడం ఆయనకు ఇష్టం లేదు. అది పాత కాలపుమాట. కవి కలలుకనేమాట నిజమే. కాని సంక్షుబ్ధ సమాజ సరిత్తులో అవి అలలుగా తాకాలి మానవుడి ఆలోచనలను. వాస్తవాన్ని, వాస్తవంగా చెప్పడం కంటె కవితాలోచనాలతో చెప్పడమే 'కల'కు ఇక్కడ విశేషార్థం. కలలో తాను సాక్షిభూతుడు. కలం దాన్ని వ్యాఖ్యానిస్తున్నది. ఈ సంపుటిలో 34 ఖండికలున్నాయి.

సంప్రదాయజ్ఞుడైన ఆధునిక భావకుడీ కవి. అమృతత్వాన్ని ఉపాసించే వాడు. తిలక్‌లాగా అమృతం కురియడం ఇష్టపడతాడు. అవసరమైతే అగ్ని చల్లటం ఎలాగూ తప్పదు. ఈయన వ్రాసిన నాంది పద్యాలు చాలా చిత్రంగా ఉన్నాయి. అగ్ని చల్లటం ఉంది. అమృతం కురియడమూ ఉంది. ఆ పద్యాలలో. నెమలివాహనం మీద కుమారస్వామి తండ్రి దగ్గరకు రాగా తమ సహజ వైరివర్గం అయిన నెమలిని చూసి పరమశివుడి మెడలో పాములు బుసలుకొట్టాయి. దాంతో స్వామి అలికంలోని కన్ను అంటుకుంది. దాంతో వెన్నముద్దలాగా

చంద్రరేఖ కరిగింది. అమృతపు బిందువులు స్వామి పున్నుకలశారం మీదికి జారాయి. ఇక కపాలాలు కూడా ప్రాణవంతమై సాంబశివుణ్ణి స్తుతింఛాయి. ఇదేమి వర్ణన. కస్సుబుస్సులు, సెగలు పొగలు, వేడికి కాని నవనీతర కరగక పోవడం - ఇదంతా సమాజంలోని వస్తు నిర్దేశం. కవి సమాజానికి ప్రాణం పోయాలి. ప్రాణంతీయడం కాదు అని ధ్వని. ఇది శివేతరక్షతి. ధర్మ రక్షతి. ఆదికవి అంటే శివుడే అని వేదవిదులంటారు. మొట్టమొదట కవి ఆయన. సమాజం పట్ల కవికి ఉపేక్షకాక అపేక్ష ఉండాలని యీ గొప్ప ఉత్ప్రేక్ష ద్వారా కవి నిరూపిస్తున్నాడు. కవిత్వానికి ఊహ ఉండాలికదా. ఆ ఊహ ఒక్కొక్కసారి ఎంతో ఎత్తుకు పోతుంది. ఒక్కొకసారి లో లోతులను తరచిచూస్తుంది.

ఇవాల్టి సమాజ స్వరూపాన్ని బట్టబయలు చేసి ఎద్దేవా చేస్తున్న కవిత 'ఇప్పుడే మాది' అనే రెండో కవిత. వస్తుస్థితిని బట్టి ఇది వచన కవితగా రూపొందడమే హృదయంగమం. సమాజంలో అనేక వర్గాలున్నాయి. అందులో తెలివికల వర్గం తక్కిన వాళ్ళను ఏ విధంగా దోపిడీకి గురిచేస్తుందో వ్యంగ్యంగా వక్రోక్తి విలసితంగా వర్ణించార్కు జంగయ్యగారు. శక్తి సామర్థ్యాలు లేనివాడికీ చేతకానివాడికీ భవిష్యత్తును గూర్చిన ఆశ, గతాన్ని గూర్చి గౌరవం, సాగేవాడికి సాగించుకొనేవాడికి గతాగతాలక్కరలేదు. వర్తమానం ప్రతిక్షణం విలువైందే. మేం కాలాన్ని కళ్ళెం పట్టుకొని నడిపిస్తాం మంటారు వాళ్ళు. దానికి వాళ్ళ దగ్గర ఎన్నో చిట్కాలున్నాయి ప్రజల అజ్ఞానమే వాళ్ళ పెట్టుబడి-జనం అమాయకత్వమే వాళ్ళ పంటదిగుబడి. అంతాలాభదే. వాళ్ళంటారు: "మా కెదురే లేదీనాడు, గొర్రెజనాన్ని ఒక్కటి కానీయం. అయినా ఎదిరించే నీయడ, తుపాకుల్ని కాపలా ఉంచాం' అనే వాక్యాలలో ప్రజాస్వామ్యం మందీ మార్బలం ఏలుబడి ఎట్లా అయిందో నిరూపితమవుతున్నది. 'కవుల్ని కళాకారుల్ని కొనేశాం' అనే వాళ్ళ దిలాసాకశాఘాతంగా ఉంది సమాజం మీద. రేపు మీద మీకు ఆశలు రేపుతాం, రేపే మీది, పేరే మీది-ఈనాడు మాది, ఈ నేడు మాది - అంటారుట తెలివికల వాళ్ళు. ఈనాటి సమాజంలో కుటుంబవ్య ఉద్ధరుడేది శాసిస్తున్నదో ఆస్తి నా జన్మ హక్కు అనే ఖండికలో సవ్యాఖ్యానంగా తెలిపారు కవిగారు.

యుగయుగాల తరతరాల మానవ సామాజిక పరిణామ మహేతిహాస పౌరాణిక ప్రతీకాత్మక గాథలను అన్వయించారు. వక్రత అనే ఖండికలో కవి, సమాజంలో నిర్వహించవలసిన పాత్రలో నిర్వక్రత ఏమిటో వివరించారు. ఎన్ని 'నీలాప నిందలైనా' భరించి కవి సత్య దర్శనం చెయ్యాలని జంగయ్యగారి ఉద్బోధ. 'దైవం కవియై పుడతాడు' అంటారాయన.

ఈ ఖండకావ్య సంపుటిలోని విశేషం ఏమంటే ఇది ఒక కవితా కదంబం. వేర్వేరు పుష్పాలు శోభగా సూత్రీకరించినట్లు అన్ని బాణీలు సమరసంగా ఇందులో పొందుపరిచారు కవి. పాటలు, పద్యాలు, తత్త్వాలు, గీతాలు, గేయాలు, వచన కవితలూ అన్నీ సమాజ సందేశాత్మకంగా నిర్వహించారు. 'బతుకుటద్దాన్ని చేయి జారనీకుండా మసలుకోవాలి' అన్న భావం గొప్పగా ఉంది. కులాలు, మతాలు, న్యూనతాధిక్యతలు ఈ కలవర మెందుకని ప్రశ్నిస్తారాయన. కలరవం కావాలి కాని కలవరం కాదు అని తాత్త్వికంగా బోధిస్తున్నారు జంగయ్య గారు. ఈ పాట ఏకతార మీద పాడితే చక్కగా ఉంటుంది. కవిగారు నిరాశావాది కారు. నిజమైన కవి ఎవరూ నిరాశావాది కాలేరు అనుకుంటాను. ''అమాయకుల్ని మోసగించే ప్రభుత్వాలు, అమాంతంగా కూలిపోక మానవు'' అనేది నిత్యసత్య వచనం. తరతరాల చరిత్ర ప్రపంచానుభవం. ఉన్నదాన్ని చక్కగా ఆవిష్కరించడమే కవిత్వం. మూలధనాన్ని గురించి ఈ కవి ఊహలు మౌలికంగా ఉన్నాయి. తాత్త్వికంగా ఉన్నాయి. 'కనిపించే లోకం కనిపెంచుతుందనుకొన్నారే కాని, కనిపించని లోకం ఒకటుందని, పెట్టుబడికి మూలం - అదేనని' అంటారు ఈ కవి. పంట చేతికి రాగానే చేను గుర్తుకు రాకపోవడం అనుచిత సంస్కారమని ఇందులోని ధ్వని.

ఈ ఖండ కావ్య సంపుటిగా పేరెక్కిన 'కలం కల' మంచి కవిత. ప్రపంచం మనుగడపట్ల ఆశాభావం, కవికర్తవ్యం గురించిన భరోసా ఈ గీతాన్ని అందగింపచేస్తున్నాయి. ఛందగింపు కూరుస్తున్నాయి. ''పిరికి జనంలో సైతం రక్తం ఉప్పొంగుతుందని, భవిష్యత్తులో పేదతనం విరగడైన, చక్కని బతుకును (జనం) పొందుతుందని, నిమ్నోన్నతాలు చూపని చక్కని సమాజాన్ని

అబద్ధాలు చెప్పని నాయకులతో ఆంధ్రభూమి మహానంద జీవనం కొనసాగిస్తుందని, కలం కలగన్నది'' అంటున్నారు కవిగారు. కోరికలే గుర్రాలైతే స్వారీ చెయ్యని దెవ్వరు అంటారు కాని ఊహ రౌతుకొద్దీ కవిగారి గుర్రం నడుస్తుంది కదా!

రవి గాంచనిచోట కవి గాంచును అనే ఆభాణకాన్ని గుర్తు చేస్తున్నారు కవి 'జ్ఞానభాస్కరుడు' అనే శీర్షికలో. రవి భౌతికశక్తినిస్తే కవి నైతికశక్తి నిస్తాడని ధ్వని. ఆయన వెలుగునిస్తే ఈయన జ్ఞానమనే వెలుగునిస్తాడని బోధ. 'జ్ఞానమొసగరాదా!' అనే త్యాగరాజుగారు కూడా వేడుకున్నారు. జంగయ్యగారు 'Poets one the unacknowledged lesislators of the world' అనే సూక్తాన్ని సమర్థిస్తున్నారు 'సత్కవినే రాజ్యాధినేతగా జూడ దగున్' అనే మాటలలో. ఆ మార్గాన్ని కవి చూపగలిగితే ప్రజలు గ్రహిస్తారు కాని వొట్టి ఆశవల్ల ఆశయం నెరవేరదు కదా. రాజు లెందరిని జగత్తు గుర్తు పెట్టుకొన్నది? కవిరాజులందరినీ గుర్తుపెట్టుకున్నది. కారే రాజులు? అంటారు కాని కవిరాజులనరు కదా? తెలుగు గంగ అనే శీర్షికతో తెలుగునే గంగగా కీర్తించారు జంగయ్యగారు. 'ఆలోచించు', 'పెరుగుతున్నాయి', 'అక్కడిక్కడ' అనే శీర్షికలలో నేటి సమాజ పరిస్థితులను కవితా సమాలోచనలోచనాలతో వీక్షించారు కవి. ఆత్మతత్త్వం ఆవిష్కరించారొక శీర్షికలో. తెలుగుదేశంపై ఎన్నో ఆశలు పెట్టుకున్నట్లు కన్పిస్తుంది ఈ కవి. ఈ కవితావేశంలో తెలుగువారి పరమోజ్జ్వల కీర్తివైభవానికి కారకులైన పొట్టి శ్రీరాముల్ని కీర్తించడం చాలా బావుంది. 'బతుకు', 'బాంబెందుకు?', 'చూడు' అనే శీర్షికలలో వర్తమాన సామాజిక రాజకీయ కశ్మలాల ప్రసక్తి ఉంది. 'కోటానకోట్ల ప్రజాధనం బుగ్గిపాలయ్యే బాంబులవుతున్నాయి' అనే కవిగారి హెచ్చరిక కరుణాకాతరంగా ఉంది. 'మనిషి దురాశాపీడితుడై దుఃఖాల్లో ఈదుతున్నాడు' అనే భావం ఎంతో బావుంది. 'చలిచీమలచేత పాము చస్తుంది చూడు' అనటం 'పొయటిక్ జస్టిస్'. అది లేకపోతే కవి ప్రయత్నం ఉత్తమ కక్ష్య చేరదు. జంగయ్యగారి కవిత్వంలో విలువైన సూక్తులు విరబూసిన మల్లెలు. అవి సువాసిస్తూ ఉంటాయి. 'ప్రాజ్ఞుడౌగాక-పరాధీనుడు; అధికారంలోని వ్యక్తుల మోసాలకు బలిగాకపోడు'-అని మనశ్శాంతి అనే శీర్షికలో ఆయన సూక్తీకరించాడు. సూక్తినిధిత్వం కూడా ఉత్తమ కవితా లక్షణాలలో ఒకటి అన్నారుగదా నన్నయ్యగారు.

మొత్తానికి ఈ కవితాసంకలనంలో దేశభక్తి, జాతీయతానురక్తి, ఆత్మ శక్తి, స్నేహాభిరక్తి, మానవత్వంపై ఆసక్తి కనపడుతున్నాయి. అనేక సందర్భాలలో, సన్నివేశాలలో ఇవి రచితమైనవి కాబట్టి అనుస్యూతి కనపడదు. కాని అక్షరద్యుతి సంతోషప్రదంగా ఉంది.

కవిగారే అన్నారు కదా కవి-రాజరికం సాగాలని లోకంలో.

అందుకే కులాసా పలకరింపులాంటి ఈ సాభిప్రాయ సాధువాదానికి శీర్షిక సుకవితా ప్రశంశగా ఉండటం.

జంగయ్యగారు నాకు మిత్రులు. అందువలన హితులు.

(లోకమునందు మాతాపితులు, మిత్రుడు అను ముగ్గురే హితులు. తక్కినవారందరును ప్రయోజనమునుబట్టి హితులగుచున్నారు — చిన్నయసూరి పంచతంత్రం)

# భద్రాద్రి ముకుట నిర్వచనాలు జంగయ్య మానవతావాదం

—సి. ఆర్. సత్యనారాయణ

ఆటవెలది సాయంతో ఆంధ్రుల కంఠసీమలో అమూల్యమైన నైతికోపదేశం చేసిన మానవతావాది వేమన. ఆరాణి యోగిగా మారటానికి ఆటవెలదియే కారణమంటారు. అందుకే కాబోలును ఆపద సామ్యంతో వెలసిల్లే పద్యాన్నే తన కవితా ప్రస్థానానికి సాధనగా చేసికొన్నాడు వేమన్న. నాటి వేమన్నలాగే నేటి జంగయ్యగారు కూడా తమ నవతా వాదానికీ, మానవతా వాదానికీ ప్రతీకలుగా ఆటవెలదులనే ఎన్నుకోవడం విశేషం.

ఆంధ్ర సాహిత్యంలో కావ్యకళా శిల్పాలుగా ప్రసిద్ధి నొందిన పద్యాలు వృత్తాలూ, జాతులూ అని రెండు విధాలు. అందులో జాతులు కేవలం దేశ జాతికి చెందినవి. జాతులలో ఒక చిన్న పద్యం ఆటవెలది. దీని రచన చాలా సులభం. ఏదో కొద్దిపాటి భాషా పరిజ్ఞానం ఉంటే సరిపోతుంది. ఇతర శాస్త్రాలతో ప్రమేయం అంతగా లేకపోయినా యిబ్బందిలేదు. అయితే దీని రచనలో ఉన్న చిక్కల్లా ఒక్కటే. చిన్న చిన్న పదాలతో ముచ్చటగా కూడే పాదాలతో ఒక మహత్తాన్ని సంఘటింపజేసే శక్తి కవికి ఉండాలి. అది సామాన్యమైన విషయం కాదు. ఎంతో [illegible] కవి మాత్రమే ఆ కసరత్తులో నెగ్గుకు రాగలడు. [illegible] అనల్పార్థ రచన చేయుటయే కవిత్వంగా చేకొన్న పాల్కురికి సోమన్న అభిప్రాయానికి ఈ పద్యాలు [illegible] నిదర్శనా [illegible] తప్పదు. అందుచేత ఆటవెలదుల నలరించే పని అంత తేలికైనదిగాదని అందరూ గ్రహించాలి. ఆ పనిచేసి తన ప్రతిభను విశేషంగా వ్యక్తం చేసిన జంగయ్యగారు అభినందనీయులనడంలో ఏమాత్రం సందేహం లేదు.

"క్రౌంచద్వంద్వ వియోగోత్థ
శ్శోకః శ్లోకత్వమాగతః" అంటే

ఆదికవి వాల్మీకి యొక్క కవిత్వావిర్భావానికి కారణాన్ని ఆనందవర్ధనుడు వివరించాడు. దీన్ని పరిశీలిస్తే ఆవేశమే కవిత్వావిర్భావానికి కారణమనే అమూల్యమైన విషయం బోధపడుతుంది. అదిగో కవికి గావలసిన అలాంటి ఆవేశం జంగయ్యగారిలో పుష్కలంగా దర్శనమిస్తూ ఉంటుంది. అదే అవ్యాహతంగా సాగిపోతూ జంగయ్యగారిని చక్కని కవిగా తీర్చిదిద్దింది. సుమారు 40 కావ్యాలకు వారిని కర్తను గావించింది. చిన్ననాటినుండీ నేటిదాకా నిజ జీవితంలో అనుభవించిన ఆఘాత విఘాతాలు వీరి అనుభవ నిఘంటువును తీర్చి దిద్దాయి. ఆ అనుభవసారాన్ని శ్రుతిగా చేసికొని కవితావీణను మేళగించి సుమారు రెండున్నర దశాబ్దులుగా వీరు భాగ్యనగరంలో తమ కవితాగానాన్ని అందరికీ వినిపిస్తూనే ఉన్నారు. తమ నవతావాదాన్ని మానవతావాదాన్ని అందరికీ పంచిపెడుతూనే ఉన్నారు.

జంగయ్యగారు ఒక విచిత్రమైన మనస్తత్వం గలవారు. ఎప్పుడు ఎందుకు స్పందిస్తారో చెప్పలేం. వీరిలో సామాజిక స్పృహకూడా అధికంగా చోటుచేసికొంది. అందులకే సమకాలీన సంఘంలో జరిగే అన్యాయాలనూ, అనాచారాలనూ, చూస్తూ ఊరుకోలేకపోయారు. తనకున్న కవితా శక్తి సమాజాన్ని అంతోయింతో సంస్కరించాలని ప్రయత్నించారు. ఆ ప్రయత్నంలో ఒక భాగంగానే "భద్రాద్రి మకుట నిర్వచనాలు" అనే శతక రూపమైన కృతి యొకటి వారి కలం నుండి వెలువడింది. అయితే దీనిని 'శతకం' అనటంకన్నా 'ముక్తకం' అంటేనే బాగుంటుందేమో. ఎందుకంటే ఒక్క మకుట నియమం తప్ప తక్కిన శతక నియమాలేవీ యిందులో పాటించినట్లు కనిపించదు. అందుకే కాబోలు దీని ఆముఖంలో తిరుమల రామచంద్ర వీనిని ముక్తకాలుగానే, సూచించారు. 'భద్ర' శబ్దం ఆదిని నెలకొనియున్న ఈ గ్రంథంలోని పద్యాలు సంఘ భద్రతకై అంకిత భావాన్ని ప్రదర్శించాయనడంలో సందేహంలేదు.

భద్రాద్రి మకుట నిర్వచనాలలో ఇది ఉందీ అది లేదూ అని చెప్పటానికి అవకాశలేశమాత్రం కనిపించడం లేదు. సాంఘిక, రాజకీయ, తాత్త్విక విశేషాలు, ఎన్నో, ఎన్నెన్నో యిందులో చోటు చేసికొన్నాయి. సమకాలీనమైన సాంఘిక దురాచారాలను వీరు ఇందులో ఎలుగెత్తి ఖండించారు. ఈ విషయంలో వీరిదొక విలక్షణమైన బాణీ. తనకు నచ్చిన క్రొత్త ఉపమానాలతో, ఉదాహరణలతో విషయాన్ని వ్యంగ్యస్ఫోరకంగా చిత్రించి దాన్ని సూటిగా గుండెకు హత్తుకునేలాగ చెయ్యడం వారిలోని ప్రత్యేకత.

అనవసరమైన ఆడంబరాలు వారికి నచ్చవు అందుకే-

మనసులోన గలుగు మార్పునకే మెప్పు
గాని వేషమందు గలుగదేది
రాజు వేషమేయ రాజ్యంబు వచ్చునా?-

అని ప్రశ్నించారు...

మానవులలోని బలహీనతలు అనేక విధాలు. అందులో కొన్ని చాలా వికృతంగా ఉంటాయి. వెర్రి తలలు వేసే ఆ బలహీనతలకు సమాజం దూరంగా ఉండాలనే తపనతో-

"ఎంగిలైన దాని మంగళంబని మెచ్చె
పరుడు పొందు వనిత భార్య యౌన
పులుసు గరిట పొన్కుమునబెట్టె దుర్బుద్ధి"

అంటూ ఇలాంటి రుగ్మతలకు సమాజం దూరంగా ఉండాలని సూచించారు.

''ఓటు హక్కు నేడు ఓటుక్కుగా మారె
మార్పు పేరు మంచిమాత్ర మాయె''

అంటూ దగా రాజకీయాల్లోని మోసాన్ని తూర్పార బట్టారు.

ఇప్పటికీ ఇంకా పల్లెలలో పలుచోట్ల అవ్యాహతంగా సాగుతున్న వెట్టిని నిరసించి ఈ విధంగా వీరు తమ మానవతను ప్రకటించుకొన్నారు చూడండి.

"మాయ గౌరవాల బాయనిద్దై పేద
జనము నుద్ధరింప గలుగుటాయె
మాయ ఊడిగాన మటుమాయమై సాగె"

ఈ మాటలవల్ల పేద పట్లవారి కెంత సానుభూతి ఉందో విశదమౌతూనే ఉన్నది.

జంగయ్యగారిలో తాత్త్విక జిజ్ఞాస కూడా అధికంగానే కనిపిస్తూ ఉంటుంది. అందుకే అవకాశం చిక్కినప్పుడల్లా భద్రాద్రి మకుట నిర్వచనాలలో తాత్త్విక రహస్యాలను వివరించటానికి వారు బహుధా ప్రయత్నించారు.

"బోధ వలన నరుని బాధలు తెగటారు
బాధపెట్టు గురువు బోధ వినకు"

అంటూ బాధ గురువులకు దూరంగా ఉంటే సమాజానికి మంచిదని హెచ్చ రించారు.

"పోతుపెంటి రెండు జాతులు ప్రకృతిలో
భిన్నమగుచు పుట్టి పెరిగికూడి
తల్లితండ్రులయిరి తనయులు పెక్కురి"

అంటూ జాతులన్నీ మానవ కల్పితాలనీ జాతి విద్వేష మానవత్వానికి తగదని సూచించారు.

ఈ విధంగా విశ్లేషించుకుంటూపోతే ప్రతి పద్యంలోనూ ఏదో ఒక ప్రత్యే కత కనిపించక మానదు. ప్రతి పద్యంలోనూ ఏదో ఒక సందేశం వినిపించక మానదు. అయితే చెప్పే ప్రతీ విషయాన్ని అతి సహజంగా చెప్పాలని భావించడం కూడా కవికంత మంచిది గాదేమో-ఎందుకంటే కొన్ని అశ్లీలాలు ఉంటాయి. వాటిని ప్రస్తావించడం వలన కవిత్వానికి ఉన్న శోభ కూడా ఊడే ప్రమాదం ఉంది. అందుకే కవులు అలాంటి విషయాలకు చాలా దూరంగా ఉంటూ వచ్చారు. మన జంగయ్యగారు మాత్రం ఆ నియమాన్ని అంతగా పాటించిన వారు కాదు. భద్రాది మకుట నిర్వచనాలలో "మూత్ర యోనినంటి ముద్దు పెట్టు" (చూ. 99 పద్యం) ఇత్యాది ప్రయోగాలను చెయ్యకుండా ఉండే బాగుండేది. ఏం చేస్తాం... "నిరంకుశాః కవయః" అన్నారు గదా పెద్దలు. ఆ స్వాతంత్ర్యాన్ని వీరిలా ఉపయోగించుకొన్నారు.

ఇలాంటి ఏవో కొన్ని నెరసులు తప్ప, మొత్తం మీద భద్రాది మకుట నిర్వచనాలు ఒక విలక్షణమైన రీతిలో రచింపబడి వ్యంగ వైభవానికి నెలవై, సంస్కార దృష్టికి ఆలవాలమై, జంగయ్యగారి మానవతా వాదానికి అద్దం పడు తోందనడంలో సందేహం లేదు.

వారి స్వర్ణోత్సవ సంబరాలలో ఆనందవారాసుల అంచులలో విహరిస్తోన్న జంగయ్యగారు శతాయుష్మంతులై శతాధిక గ్రంథకర్తలై వింసిల్లాలని ఈ శుభ సందర్భంలో ఆకాంక్షిస్తున్నాను.

# చిద్విలాసం

**- చెలమచెర్ల జయలక్ష్మి**

మిత్రుడు నీలా జంగయ్య తన "చిద్విలాస" గ్రంథాన్ని పరిశీలించమని చెప్పుటయేగాక ఒక సాహిత్య వ్యాసం - విమర్శాత్మక ధోరణిలో కూర్చి యిమ్మని కోరాడు.

చిద్విలాస గ్రంథం ఆటవెలది ఛందంలో కూర్చబడింది. కవి కూర్చిన ఆటవెలదుల చిద్విలాస గ్రంథంలో సువిదితమగుచున్నందు వలన ఈ గ్రంథం చిద్విలాసనామ పరిపుష్టమైంది.

పద్య, గద్య, గేయ, వచన కవిత్వాలు సునాయాసంగా వ్రాయగల సమర్థుడు మిత్రుడు నీలా జంగయ్య. ఈతని వైశద్యము, పదప్రయోగనైపుణి, వేదాంత ధోరణి - తాత్విక చింతనలే ఈతనికి సాహితీ లోకమున పెద్ద పీట వేసినవి.

పేదల ఆకలి, రాజకీయ నాయకుల అల్పబుద్ధి, స్వార్థపరుల మనస్తత్వం, జంగయ్య కవి నాక్రోశింపజేశాయి. అందుకే "ప్రపంచంలో కవులు శివతాండవం చెయ్యాలి - లోకాలకు చైతన్యం రావాలి" - అంటాడు జంగయ్య.

తిక్కన-కందానికి, శ్రీనాథుడు-సీసానికి, వేమన-ఆటవెలదికి సాహిత్య లోకంలో పేరొచ్చింది. వేమన పద్యాలు ప్రచారమయినంత విరివిగా [illegible] కాలేదు. కాబట్టే వేమన ప్రజాకవి అయినాడు.

అందరికీ అర్థమయ్యేట్టు సరళంగా శక్తిమంతంగా వ్రాయటంలో ఆత్మాశ్రయ కవిత్వం చెప్పటంలోనూ జంగయ్య వేమన ననుకరించాడు. అనుకరణ అంత గొప్పది కాదంటారు. కాని అది సృష్టికి [illegible]. జంగయ్య వేమన

ననుకరించినా తన వ్యక్తిత్వాన్ని విడనాడలేదు. సమకాలిక సమస్యలను సామాజిక స్పృహతో సమీక్షించటం - తన మకుటం తానుంచుకోవటం - తన ఉక్తిని తాను మలచుకోవటం - అన్న గుణాలు జంగయ్య వ్యక్తిత్వానికి, ప్రత్యేకతకూ ఆయువు పట్టు. వేమనలోని మానవతావాదం జంగయ్యకు తారకమంత్రం. కాలాలు వేరైనా గుణాల స్వభావం వేమనలోనూ - జంగయ్యలోనూ సజాతీయం. వేమన సూక్తుల వంటి సూక్తులు పలికిన వారంతా వేమనలౌతారా ? అంటే కాకపోవచ్చు. వేమనను మించిన సూక్తులుగాని - ఆటవెలదులు గాని వ్రాసినవారు నభూతో నభవిష్యతి. కాబట్టి జంగయ్య వేమన ననుకరించాడనేది నూటికి నూరుపాళ్ళు నిజం.

ఆ వేమన గుణాలైన సూటిదనము నిశితపరిశీలన ఉపదేశ బుద్ధి, జంగయ్య నాకట్టుకున్నాయి. అందుకే అతడు కూడా సందేశాన్నిస్తూ అక్కడక్కడా ప్రజలకు - ప్రభుత్వానికీ చురకలువేస్తూ, సమాజంలోని కుళ్ళును నిరసిస్తూ, మూఢాచారాన్ని ప్రశ్నిస్తున్నాడు.

ఈ క్రింది ఉట్టంకిపులు జంగయ్య మానవతావాదానికి ప్రతీకలు

1. కర్మఫలమునకు పోలిక లేదనుటకు -
"తల్లిదండ్రి పోల్కి తనయులుండగవచ్చు
తెలివి తేటలట్లు కలుగవచ్చు
కర్మఫలమొకండె కనమట్లు కాలాన" 166

2. వెంట గొనిపోవునది లేదనుటకు -
"రామకృష్ణులైన రావణాదులునైన
పుట్టి వెంటగొనుచు పోయిరేమి ?" 253

3. పాపం పాలు పెరిగిననునుటకు -
"పాలు నీటమునిగె పాపాలు మెండయ్యె 295

4. పూర్వవాసన పోదనుటకు -
"పులికి పేరు మార్చి పలికిరి మేకగా.
మేక నేమొ సింహమే యనంగ
పులిని చంపె మేక పూర్వవాసన పోక" 296

5. పెద్దతనమునకు-

"కప్పలందు గోంగ్రుకప్ప నాయకుడయ్యె
పందికొక్కు ఎలుకలందు సకల
కులములందు కలిమిగలవాడె పెద్దయ్యె" 202

6. పెత్తనము జ్ఞానమును నశింపజేయుననుటకు-

"ధనమునొకటి కూర్చుకొనగల్గి పరులపై
పెత్తనమ్ము గోరు చిత్తమెప్పుడు
జ్ఞానరతి యొకింత గానకే నశింయ్యించు" 82

7. అశుభములు గలుగుననుటకు-

కొడుకు దుడుకు తనము కొనియాడు తల్లిని
ఇల్లు వల్లకాడు, కల్లుమత్తు
బ్రతుకుత్రిప్పటలు శుభమ్ములి నిచ్చునా" ? 235

8. భూబకాసురులనుటకు-

"ఇల్లు కట్టి పరుల కిచ్చికిరాయకు
బ్రతుక నేర్చినట్టి వాడు భూమి
నాక్రమించె దేవతారామములనైన" 228

లక్షణము (తత్వము) నెరిగించుటకు-

1. మాయ-

"తెలిసితెలియకుండ తెలుపునదే మాయ" 158

2. నిర్దయత్వము

"అన్నిగలిగి నిర్దయాత్ముడైతె
లేనివాని కన్నహీనుడు వాడెరా" 190

3. త్యాగము-

"త్యాగమున చరించవగు నరుండు జగాన
త్యాగమందె ప్రేమ మమలమగును
విశ్వశాంతి గూర్చు విజ్ఞతనందించు" 148

4. పేదవాని పాలన-

"పేద జనము చెమట పీల్చి సిరుల్ గూర్చు
కొన్నవారు బీద నెన్నుటాయె
వాని పాలనమ్ము బలహీనమై కూలు" 299

5. కుకవులు కుపరిశోధకులు గ్రంథచౌర్యము

"అంద్ల దింత లాగి ఇంద్లదింతయు దీసి
అచ్చు గూర్చి కర్తలైన వేళ
ముదము మీర నొక్క పురుగైన చూడదా" 306

జంగయ్య కవి సంఘమున నేటి కవుల కష్టములను గూర్చి వాపోయిన విధము-

1. "కవిని గన్నదెవరు కావ్యాన దాగిన
కవిత రూపుగన్న ఘనుడెవండు?" 158

2. "పలుకుబడియు గల్గి పదిమందిలో నచ్చ
దిరుగునట్టి వాడె వరకవి యగు
కవికి సర్టిఫికటు కనిపెట్టు నెవడయా?" 262

3. "వ్రాయనూరు కవికి - పాడు వారికి వెయ్యి
ఆడువారికేమొ ఆరువేలు
సీన్మలోన కూడ చిన్నపీటె కవికి" 274

4. సల్పునట్టి దివ్య సన్మాన సభలలో
మంత్రికేమొ పెద్దమాల - పొగడి
చదువు కవికి మెచ్చి సన్నదండలకొ! 275

వ్రాస్తే మంచి కవితే వ్రాయాలి. అట్టి మంచి కవనదక్షులైన కవులున్నప్పుడే లోకం భాసిస్తుందనీ కవిత శూన్యమైతే కాలమే చీకటియగుననీ ఘోషించాడు కవిత్వమంటే హర్షించే జంగయ్య కవి.

"జీవగతుల కవిత జీవింప రచియింపు
కవులు గలుగు నాడె యవని వెలుగు
కవిత సున్నమైన కాలమే చీకటౌ" 294

దిక్ప్రదర్శనంగా జంగయ్య కవి వాడిన జాతీయాలు అనుభవైక వేద్యాలు.

1. గణితమెట్టు కొల్వగల్గు నగణితమ్ము 5
2. మనిషి మనిషినేల జలము కొద్ది 150
3. తనకు గానివారు తనదారు గారెప్పుడు 165
4. కర్మననుసరించి నప్పుడు తన తీరు 287
5. వారకాంత కొడుకు వారసుడెవనికొ 280
6. దుష్టపాలనమ్ము కష్టమ్ము మృత్యువౌ 301
7. బీదరికము గాల్చ పెట్టి పుట్టడెవం 312
8. పరులపీడ గూర్చు పాపికి సుఖమేది? 324
9. అహము వలన దుష్టుడె చెడునధికారి 373

"నిప్పు, నీరు, గాలి, నింగి; నేల, రహస్య
మెరుగరింత చెడిన నరులు" 261 అని నరులను గురించియు

"కరువు బాధలుండ వరద బాధలు గూడె
భారతోర్వి బాగుపడున దెప్డు" 110 - అని దేశమాతను గురించియు మిక్కిలి బాధపడ్డాడు జంగయ్య కవి. కడకు భక్తిని ప్రబోధించాడు. కావ్యప్రయోజనమయిన ఉపదేశ విధానాన్ని కూడా పాటించాడు.

"ఆటవెలది దర్శనానంద మిడుగాక!" అన్న ఆశంసతో ప్రారంభించిన కృతిని "ఛిద్విలాస మకుటసేవనమై యాడు
ఆటవెలదులే మహాప్రసాద
మనగ కూర్చినాడ మనసైన నిష్ఠతో!" అను నివేదనతో ముగించిన యీ చిద్విలాస గ్రంథ రచనమున వేమన మార్గాన నడచి జనులు చెప్పే కోవటానికి క్రొత్త వస్తువులతో క్రొత్త పద్యాల నందించిన జంగయ్య కృషి నిజంగా అభినందనీయం.

# ఆణిముత్యాలు

- సి. జి. కృష్ణమాచార్యులు

"కవిరత్న నీలా జంగయ్యగారు భారతదేశానికి ఆదర్శ కవులై దేశానికి సంఘానికీ సేవ చేయాలెనని వారి రచనలకు స్వర్ణోత్సవం కూడా జరగాలని వారి కవితా స్రవంతి నిమ్నోన్నతాలను ఏకం చేసే విధంగా ప్రవహించాలెనని భగవంతుని ప్రార్థిస్తున్నాను"— అని 1978లోనే మిత్రుడు నీలా జంగయ్యను గురించి ఆశంసించి, భగవంతుని ప్రార్థించి, ఆశీర్వదించిన ఆ చల్లని తల్లి "ఎల్లాప్రగడ సీతాకుమారిగారు నేడులేరు. కాని ఆమె ఆశీస్సు ఫలించింది. నేడు మిత్రుడు నీలా జంగయ్య స్వర్ణోత్సవం జరుపుకోబోతున్నాడు. ఆ శుభ సందర్భాన్ని పురస్కరించుకొనియే "సన్మాన సంఘం వారు" "ఆణిముత్యాలు" అనే ఖండ కావ్యాన్ని నాకిచ్చి విమర్శక వ్యాసమొకటి వ్రాసివ్వమని కోరారు.

జంగయ్యకవి నాకు బాల్యమిత్రుడు. ఇతడికి సాంస్కృతిక లాక్షణికులన్నా, ప్రాచీనాంధ్ర సాహిత్యమన్నా ఆదరాభిమానాలు మెండు. ఇతని భావుకత, పరహిత చింతన, ఆర్ద్ర మనస్కత, సూటిగా గట్టిగా విమర్శించే లక్షణం ఇతని రచనల్లో ప్రతిబింబిస్తాయి.

సాహిత్యం సమాజానికి ప్రతిబింబం. సమాజ ప్రభావంవల్ల సాహిత్యం సృష్టించబడుతుంది. సాహిత్య ప్రేరణ పొందిన సమాజం మేల్కొని ఆదర్శవంతమౌతుంది. సమాజంలోని కుళ్ళును తొలగించి, దురాగతాల్ని తుడిచిపెట్టి అభివృద్ధికీ ఆదర్శాలకూ దారి చూపాలి. తద్వారా శాంతిని సాధించాలి. భావ వ్యక్తీకరణకు సాధనం భాష. ఆ భాష ప్రజల భాషగా వాడబడటం యుగ విశేషం. అలతి పదాలతో సులలితంగా పామరులకు సహితం అర్థమయ్యే విధంగా కవితల్లటం సామాన్యంకాదు. అయితే ఇట్టి అసామాన్య ప్రజ్ఞను నా మిత్రుడు జంగయ్య అలవోకగా సాధించాడు. సాహిత్యం ద్వారా మానవ సాంఘిక జీవితాన్ని పునరుజ్జీవితం చెయ్యాలి—యుగవిశిష్టతను ప్రజలకు బోధిం-

చాలి - సామాజిక సమస్యలకు పరిష్కారమార్గాన్ని స్ఫురింపజెయ్యాలి-అన్న ఉన్నతాదర్శాలతో ప్రతిభావంతుడు జంగయ్య సారస్వతరంగ ప్రవేశంచేసి భావావేశంతో ఖండకావ్య సృష్టిచేశాడు. కాబట్టి జంగయ్య రచనలు పతితల జీవితాలను సుఖప్రదంగాను, ఆదర్శవంతంగాను మలచగలవిగా రూపుదిద్దు కొన్నాయి.

ఈ ఖండ కావ్యం పేరు "ఆణిముత్యాలు". కవికూర్చిన ముత్యాలపేరు ఇది. అక్కడక్కడ పులుగడిగిన ముత్యాలున్నాయి. వాటి సాంగత్య ప్రభావం వల్ల సామాన్యముత్యాలు కూడా ఆణిముత్యాలయినాయి. ఈ పేరు (దండ) లో నకిలీ ముత్యాలు అసలులేవు. అన్నీ మేలిమి ముత్యాలే-పులుగడిగిన ముత్యాలే-ఆణిముత్యాలే. ఇందులో మొత్తం 28 ముత్యాలున్నాయి. అందులో మకుటంగా "ఆణిముత్యాలు" అన్న ఖండిక తీసుకోబడింది. నరసింహ!, సందేశం, అన్నం-, ఆకలి, గౌరవం డాల్డాకు, స్కూల్‌దుకాణం, ఇదినిజం, చిలుకా, గ్రంథ మందిరం, విప్లవం, అందుకే!, హితోక్తి, ఆలోచించు, మార్పు, ఛేదించు, సిద్ధార్థి సందేశం, మహాయుధం, ఒక్కనికే!, ఇంకేం కావాలె?, న్యూట్రాన్ బాంబ్, కొంటెతనం, హంసకథ, నక్కకథ, అంటతగినవాడు!, మనిషి-కర్మసాక్షి, అతడు-ఆమె, రామరక్ష— అన్న 27 ఇతర ఖండికలు దేనికదేసాటి. ఒకదాన్ని మించింది మరొకటి. దేనికేదీ తీసిపోనివి. అందుకే అవి ఆణిముత్యాలు.

చదివే వారి కోసమే గ్రంథాలు వ్రాసే అలవాటున్న జంగయ్య చదవ కుంటే ఏమౌతుంది? అనే వారికోసం" ఎవరికేవి కావాలో దానికోసం జనం ఆరాట పడక తప్పదు. "ఆకలినిచంపజాలినది అన్నం" అనుకొనే జనానికి "దాన్ని చంపేచ జ్ఞానం"—అని తెలియదు.—— "ధనబలరూప జ్ఞాన సంపదల్ని స్వార్థం హరిసేవా పరం చేయడో అవివానికి నరకాన్ని ప్రసాదిస్తాయి."——అని చెబుతూ జ్ఞాన స్వరూపాన్ని ఇలా వివరించాడు. వారికి సులభంగా తెలియటానికి— "శాస్త్ర మర్మమెరిగిన ఋషులు, మునులు, పండితులు, కవులు తామరాకు మీది నీటి బిందువులా జీవధర్మాన్ని అనుసరిస్తారు. గుణధర్మాన్ని ఆశ్రయించి జ్ఞానులు తృప్తికేటి వస్తువులనుండి నిశాశ్వైనన వస్తువులేదుకొవ్వట్లు మోక్ష సాధకమైన పరమాత్మ తత్వాన్ని తెలుసుకోటానికి యోగము-తపము-ధ్యానము-భజనము-కీర్తనము అనే మార్గానుసరిస్తారు. అందుకే వారు వాఙ్మయాన్ని

వాగ్భూషణంగా భావిస్తారు. భగవంతుడు "కవి" నామంతో ప్రభవించి లోక జీవులకు అక్షరభిక్ష ప్రసాదించాడు. అక్షరాలు శివస్వరూపాలు లయ రహితమైన శబ్దమే శూన్యము. అర్థరహితమైన పదమే నిరర్థకము. అని యమగతిగల జీవనమే దుర్భరము-దైవచింతనలేని మనస్సు చీకటి. ఆత్మతత్త్వమెరుగని వాడు-మృతప్రాయుడు."— అని వివరించి చెప్పి అరటి పండొలిచిపెట్టినట్టు వేదాంతసారాన్ని అందించాడు.

ఈ ఖండ కావ్యంలోని ఖండికలన్నీ ఇట్టి వేదాంత భావార్థాల కెన్నింటికో ప్రతీకలు.

ఇక ధర్మార్థ కామమోక్షా లనబడే ప్రతి మానవుడికీ విధించబడిన వైదిక ధర్మాలకు స్ఫురించే ఇహలోకపరమైన నిత్యజీవనానికి సంబంధించి—

ధర్మం—జీవధర్మం

(పుట్టుకనుండి చావువఱకు మానవుడు నిర్వహించవలసిన ప్రవృత్తులు).

అర్థం—జన్మకుగల పరమార్థం

(మనమెందుకు జన్మించామని ప్రశ్నించుకొని చేతనైనంతలో ఆ జన్మకు చరితార్థత కలిగే పనులు చేయటం.

కామం—సామాన్యంగా స్ఫురించే సౌందర్యాపేక్ష ఐహిక సుఖాలుకాక కర్మయోగాన్ననుసరించి అనుభవిస్తున్న పుణ్య పాపాల కతీతంగా పోవాలనే కామన కలిగి ఉండటం.

మోక్షం—తెలిసో తెలియకో చేసిన పాపాలవల్ల పొందుతున్న అనుభవం తిరిగి కలుగకుండ చేసుకోవటం – (జన్మరాహిత్యం నీకందుబాటులో లేదు గనుక).

అనే భావాలను ప్రతి మానవుడూ అంటే గ్రంథపఠనం చేయగల ప్రతి మనిషీ ఉత్తమ లోకాల అనుభూతులను సాధించటానికి కనువైన సూక్తులను— హితోక్తులను మిత్రుడు జంగయ్య ఆయా ఖండికల క్రింది ఖాళీలలో ముద్రింపించి పాఠకలోకానికి కవి ప్రసాదించవలసిన వ్యవహార విదత్వము-శివేతర క్షతి,– సద్యఃపర నిర్వృతి మొదలగు ప్రయోజనాలను కలిగిస్తున్నాడు.

ఈ గ్రంథాన్ని గురించి కవి జంగయ్య వెలువరించిన భావాలివి—

1. "ఈ నా ఆణిముత్యాల్లో జ్ఞానాంశాలున్నాయి. అవి గుర్తించిన వారికి అర్థ–కామాంధాలు - గర్వాలు తొలుగుతాయి."

2. "ప్రకృతిలో సాక్షాత్కరించే ఆణిముత్యాలు నిర్మలినాలు–అవి పరాత్పరాంశాలు. దార్శనికులైన పాఠకులకివి ఆనందాల నందిస్తాయి."

3. "ఆణిముత్య కృతి పరమాత్మ పరివేష్టితమై ఉన్న ప్రకృతిలో పుట్టింది. అది అందే కరిగి పరబ్రహ్మ స్వరూపమై జీవానందదాయకం కావాలి."

అందుకే—ఆలోచించు! అన్న ఖండికలో

1. వ్యభిచారం - ద్రోహం - లంచం
మూడుపూవులారుకాయలైతే
మంచిని ఏ మరిచననుంచి పుట్టిస్తావ్?" అని ప్రశ్నించి,

2. అన్ని రంగాలనుంచి – నిజం తొంగిచూడాలె
విద్యారంగం మెరుగు పడాలె
సత్యానికి రక్షణ కావాలె
నిజం నిజంగా బ్రతకాలె
ఏం చేస్తావో ఆలోచించు!" అని పఠితకే వదిలేశాడు.
ఆలోచించటానికి – ఇది మెదడుకి మేతన్నమాట!

"హితోక్తి"—ఖండికలో

"నిజంగా నిస్సహాయుణ్ణి
ఆదుకోవాలన్నదే నీ కుంటే
ఖజానా తెరిచి లేఖనక ఇచ్చేయి
— ఆ పైయంత మేతకు వేసోళ్ళు
పాటించుకోవాలని చరిత్ర వ్రాయించుకోకు
ఘటుడవైతే గంభీరంగా జీవించు
కాలంలో కర్పూరమై భాసించు."— అని హితబోధ చేశాడు.

"మనుషుల మధ్య వీరులు కానివారు
అడవుల్లో భీరువులై దాక్కుంటారు"— అని "విప్లవంలో" వివరించారు. మనుషులు భీరువులు కారాదని భావన.

"కవికి కర్షకునకు కండ–గుండే ఉంటె
సుఫలదీప్తి, దేశశోభ గనద!
మోసకాని బ్రతుకు మురిపాన మున్గగా
గ్రంథకర్త కేలగతులు దప్పె?"— అని ప్రశించి మోసగాళ్ళ విషయాన్ని వివరించి చెప్పి జాగ్రత్త కొరకు హెచ్చరిక చేశాడు.

"చావు కెన్నడేని చావున్నదో తెల్ప
జాలకుండు జతన పరచి"— అని "ఆణిముత్యాలు"లో, చావును చంపటం గురించి అంటే అమరత్వ సిద్ధిని గూర్చి ఆలోచింపచూన్నాడు.

"సందేశం"—లో

"ఉత్తమ విద్యాధ్యయనం చేసి
మణి మానసమున దైవము నిలిపి
గుణమగు త్రోవను పయనమొనర్చి
గుణమతి సాధింపుమా!" —అనియు,

"వనమును పోషించుమా–జీ
వనమును సాధించుమా!" —అనియు

"పరమాత్మను మంత్రముగా దలచి
దయగుణ దీపములను వెలిగించి
కరములు జోడించుమా!" —అనియు హితబోధ చేశాడు.

"శ్రీ నరసింహ!"లో

"స్వార్థపరుల ఎడందలో జడుపు పుట్ట
దేశభక్తి హీనుల మది దిగులు పుట్ట
పంపు సంస్కర్తవై విశ్వజనని గమ్ము"— అని భగవంతుణ్ణి ప్రార్థించాడు.

"ఇది నిజం"—లో

"పుట్టుచోట గిట్టుచోట
మనుషులంతా సమము"

"ఆదరం లేక కవిత
ప్రచారంగాక పేరు
లోకఖ్యాతి గాంచడం డుల్ల!"

"పుట్టుచోట గిట్టుచోట
మనుషులంతా సమము." —అన్న నగ్నసత్యాలను చాటాడు.

"న్యూట్రాన్ బాంబ్"—లో

"అన్నింటినీ శాంతిముఖం పట్టించేజ్ఞానికి
వశంకాని పదార్థం లేదు" —అనీ

"అంటతగినవాడు!"—లో

"అంటుముట్టులలోన–అవని జీవులు పుట్టె
అంటకుండా లోక–మున్నదే లేదుగద!" —అనీ తత్త్వబోధ చేశాడు.

ఈ విధంగా చెప్పడం మొదలు పెడితే చెప్పవలసింది చాలా ఉంది. అన్నం ఉడికిందనటానికి అన్నమంతా పిసికి చూడనక్కరలేనట్టే పుస్తకం బాగుందనటానికి దిక్ప్రదర్శనంగా ఇది చాలు. ఈ గ్రంథంలో ప్రవేశించిన ప్రతి అక్షరం శిల్పంగా మలచబడి అమృతానంద సంధాయకమైందంచే ఎంతో సబబుగా ఉంటుంది.

అప్పుడే "ఆణిముత్యకృతి పరమాత్మ పరివేష్టితమై పరబ్రహ్మ స్వరూపమై జీవానంద దాయకం కావాలి" అన్న కవి జంగయ్య ఆశంస ప్రత్యక్షర సత్యం కాగలదు.

జంగయ్య కవి బ్రహ్మానంద సంధాయకములగు ఇతోధిక రచనలు సాగించుటకు కావలసిన ఆయురారోగ్యైశ్వర్య సామర్థ్యములను ప్రసాదించవలసినదిగా చిద్విలాసుడగు ఆ శ్రీనివాసుని వేడుకొనుచూ ముగించుచున్నాను.

# కవితాచంద్రిక - ఒక పరిశీలన

**డా॥ ఎస్. జీ. రామానుజాచార్యులు** ఎం. ఏ. పి. హెచ్. డి.

"కవిత్వం హృదయజ్వాల
వక్తృత్వం హిమఖండహేల" (అనువాదం - సి. నా. రె.) అని ఘోషించిన అభ్యుదయకవి ఖలీల్‌జీబ్రాన్ పలుకులతూ శ్రీనీలా జంగయ్యగారి భావాలకూ అవినాభావ సంబంధం ఉందనుటలో సందేహంలేదు.

'రసాత్మకమైన చిన్న వాక్యమైనాకావ్యమే' అని శతాబ్దాలక్రితమే ఒక అలంకారిక మూర్ధన్యుడు చెప్పిన మాటకు రసగుళికలవంటి ఈ కవిపల్కులే ఉదాహరణ ప్రాయాలుగా నిలుస్తాయి.

ఈయన హృదిలో జ్వలించిన జ్వాల కవిత. అది ఒకొక్కసారి ఆది శంకరుడిలాగా వివేకానందుడిలాగా బ్రతుకాలని సందేశమిస్తుంది గమనించండి-

"ఆదిశంకరాచార్యుం
డవనిని బ్రతికెన్నివత్స
రాలు వివేకానందుడు
బ్రతుకెన్నాళ్ళో తెలియుము"

మరో చోట మన సంస్కృతిని సభ్యతను, ఆధ్యాత్మికతత్వాన్ని అవగతంచేసికొని మనకు దివ్య సందేశాన్ని అందించిన పోతన్నలాగా త్యాగయ్యలాగా బ్రతకాలని సందేశమిస్తాడు జంగన్న.

కేవలం భక్తి తత్వాన్ని బోధిస్తూపోతే అసలుండవలసిన పౌరుషం ఊడిపోతుందేమోఅని భయపడతాడీ కవి గమనించండి —

"పౌరుషజ్ఞానాగ్ని యశః
ప్రభార్జనము చేయబ్రతుకు"

నేటి మానవుని జీవితం వివిధ ఆకర్షణలకు ఆడంబరాలకు, నిలయమైనది. అతడు కాంతా కనకాల వలలో చిక్కి మాయలోపడి మనుగడ సాగిస్తున్నాడు. దీనికి సంకేతం ఈ కవి భాషలో 'వెన్న'. సత్యజీవితమును సాగించువారి జీవితము నిప్పులాంటిది. అలాంటి మచ్చలేని జీవితాన్ని ఆకర్షణలు, ఆడంబరాలు

కాంతా కనకాలు ఏమీ చేయజాలవు-దీనిని కవిగారు "నిప్పు" అన్నారు. అందరూ రుచి (మాయ) గల వెన్న కావాలంటారు. కాని 'నిప్పు'ను తాకాల్సినరు. దానినే జంగన్న తన కవితలో ఇలా సహజ ధోరణిలో చెప్పుకున్నారు —

"మాయకాని మాట వెన్న
మంచివాని మాట నిప్పు
వెన్న సంటుకోగ బ్రతుకు
వెరచుకదా నిప్పునంట"

మరోచోట మానవజన్మ పారమార్థ్యమును నిష్కల్మషంగా జంగన్న ఇలా చెప్పుకుపోతాడు —

"జ్ఞాననేత్ర వికసనమౌ
వానిది జన్మము జన్మము
జ్ఞానహీనుమెప్పు గన్న
వానికర్మ ఖర్మసుమ్మ"

జంగన్న కవితలో సంప్రదాయచ్ఛాయలతో పాటు ఆధునికతకు దర్పణం పట్టే కవిత్వలక్షణాలుకూడ గోచరిస్తాయి.

అనుపమాన నిరుపమానకవితా సౌందర్యాన్ని ఈయనఇలా వర్ణించారు—

"అనుపమాన కవిత్వమును
నిరుపమాన సుందరతను
ఉపమలతో కొలువలేను
ఉల్లేఖన చేయలేను"

"రసోవై సః, రసంహ్యేవాయం లబ్ధ్వా ఆనందీభవతి" అను ఉపనిషద్వాక్యాల్లో రసము ఆనంద స్వరూపమని - సౌందర్యరూపమని విశదీకరింపబడింది. ఈ భావాన్నే జంగన్న తేటతెనుగు కవితలో గమనించండి—

"అందముతానై నిల్చిన
ఛందముతానై కొల్చిన
సుందరాంగికేల సొమ్ము
చూడనామెతో తనియక"

కవితలో ఆత్మ సౌందర్యం ఉండాలని అలాంటి కవితా సుందరికి సొమ్ములు - బాహ్యాభరణాలు అనవసరమని ఆలంకారికులు చెప్పిన అంశాలను సైతం పై పద్యంలో నెమ్మదిగా స్పృశించాడు జంగన్న. ఈ భావాన్నే మరో కవితలో కూడ చూడండి—

"వాసనలేకున్న పూవు
వలపుజూపలేని తనువు
అందంగాలేని కవిత
కలంకారమేలచాల"

జంగన్న కవిత్వం కేవలం సాంప్రదాయికమని చెప్పజాలము. అవసర మైనప్పుడు అభ్యుదయభావాలు కూడ ఈయన కవితల్లో కోకోల్లలుగా కన్పిస్తాయి. గమనించండి—

"ఏ గ్రంథం ఏ శాస్త్రం
ఏ చట్టం ఏ ధర్మం
బడగువాని కన్నీటిల
బాధల తెగటార్చగలిగె."

పేదవాని కన్నీటి బాధలను పోగొట్టగలదేదైనా అది ఉన్నతమైనదనీ, ఈ శాస్త్రాలూ, చట్టాలూ, ధర్మాలూ ఎన్ని ఉన్నా అవి ఏవీ పేదల బాధలను తరిమివేయలేవనీ జంగన్న పై కవితలో తన అభ్యుదయతత్వాన్ని వివరించాడు.

మరో చోట జంగన్న పేదలను వారి కష్టాలను చూచి దుఃఖవారిధిలో మునిగిపోయి, వారి పేదరికాన్ని ఏదీ తీర్చలేదని నిరాశ పడతాడు - చూడండి.

"ఏదీ పేదరికము బాప
దేదీ దుఃఖమ్ము దీర్చ
దేదీ మనుగడను చక్క
దిద్దరాదు కానరాదు."

సాధారణంగా కవి స్వీయ అభిప్రాయాంకు ఆతని కవిత అద్దం పడు తుంది. కవి చెప్పిన అంశాలు కేవలం స్వార్థపూరితాలై, ఒక వర్గంవారిని సమ ర్థించునవైనప్పుడు అలాంటి కవిత్వం సంకుచితమౌతుంది. కవి స్వార్థంలేక విశ్వకల్యాణ దృక్పథంతో కవిత చెప్పాలనుకున్నప్పుడు దానికి విశ్వజనీన స్థాయి వస్తుంది. విశ్వధర్మాలుగా కీర్తిగన్న సత్యం, ధర్మం, మానవతా దృక్పథం, అహింస, ప్రేమ, దానదయాదిగుణాలు మున్నగువానిని చర్చించి ఎక్కడ స్వార్థం, హింస, అధర్మం, మతం, మూఢాచారాలు, నియంతృత్వం, లోభత్వం-మున్నగువాటి నిరసన ఉంటుందో, ఏ కవిత మానవుని హృదంత రాళాన్ని స్పృశిస్తుందో అది విశ్వజనీన కవిత్వం. పై అంశాలను స్పృశిస్తూ జంగన్న కూడ తన కవితల్లో ఎన్నోచోట్ల విజృంభించాడు— .

మతం, మంత్రమహిమ, యంత్రతంత్రాలు మున్నగువాటిని మానవుల్లోని ఒక స్వార్థవర్గం అనుసరిస్తున్నదని, దానిని బ్రతుకుతెరువుగా వారు మార్చుకొని మోసగిస్తున్నారని జంగన్న ఈ కవితలో వారిని నిరసించాడు—

"మతము, మాయ, మాట మంత్ర
మహిమ యంత్రతంత్ర తతులు
మనిషి బ్రతుకుతెరువు నెంచి
ప్రబలినవి జగాన మిగుల."

మానవుల్లో వర్గాలను సృష్టించే వ్యర్థవిద్యలు కూడ దండగే అనీ, మనుషులంతా ఒకటే అని చెప్పని చదువులూ, శాస్త్రాలూ అర్థరహితాలను జంగన్న ఈ గీతంలో ఎలా ఉద్ఘోషించాడో గమనించండి—

"చదువుల పేరున పుట్టిన
శాస్త్రంబు లసంఖ్యాకము
మనిషి నొకటిగా జూపని
మాయలోకమంత నిండె."

ఆశా వ్యామోహాలకు దాసులై నేటి ప్రజలు మానవతా ధర్మాలనే మరచిపోతున్నారని, ఎవరైతే నిత్యం అసత్యాలాడుతున్నారో వారికే అందలాలూ, అధికారపీఠాలూ లభిస్తున్నాయని జంగన్న మరో గీతంలో ఆక్రందిస్తాడు చూడండి—

"ఆశల గుర్రాల నెక్కి
ఆత్మనె కోల్పోయినారు
అబద్ధాలనాడు వాడె
అందలాల పొంది బతికే"

ఇలా చెబుతూపోతుంటే కవిరత్న కవితాచంద్రికలో ఎన్నెన్నో మానవులకు స్ఫూర్తినందించే అంశాలు, ధర్మాలు, కవితాగుణాలు కనిపిస్తాయి. ఒకటేమిటి ఇది ఉన్నది అది లేదని కాక చైతన్యస్ఫోరకాలైన ప్రతి అంశాన్ని తన కవితావస్తువుగా తీసుకొని జీవనమార్గంలో విసిగినా కవితా మార్గంలో విసుగు చెందని విక్రమార్కుడిలాగా నిరంతర ప్రేరణతో ప్రయాణిస్తున్న ధన్యజీవి శ్రీ సీతా జంగయ్య. మిత్రుడికి యాభై వసంతాలు నిండిన సందర్భంలో జరిగే కార్యక్రమములో ఈ విధంగా పాల్గొనే అవకాశం కలిగినందుకు ఆనందిస్తూ ముగిస్తున్నాను.

# "తెలుగులో తత్త్వకవులు"

—డా॥ రావి ప్రేమలత

కవిరత్న, శ్రీ నీలా జంగయ్యగారి నలభై కృతుల్లో "తెలుగులో తత్త్వకవులు" సామాన్యజనుల సాహిత్య వివేచనా గ్రంథం. సామాన్యులకొరకు, సామాన్యుల వ్యవహారిక భాషలో రచింపబడిన తత్త్వాల గూర్చి, తత్త్వకర్తల జీవిత విశేషాల గూర్చి గ్రంథకర్త సల్పిన కృషి ఆద్యంతం కనిపిస్తుంది. జంగయ్యగారు వేమన పద్యాలనూ, తత్త్వకర్తల తత్త్వాలను సేకరించి, పరిశీలించి, పరిశోధించి వ్యాఖ్యానించారు. క్షేత్రపర్యటనవల్ల పొందిన అనుభవాలతో తత్త్వగేయకర్తల కవితా హృదయాలనూ, ఆధ్యాత్మికభావాలనూ, భాషాశైలిని సరళరీతిలో ఆవిష్కరించకలిగినారు. సేకరణ, పరిశోధన, క్షేత్ర పర్యటన గేయకర్తల చిత్రాలతో కూడిన ఈ పుస్తకం విశ్వవిద్యాలయాల డాక్టరేట్ డిగ్రీకి అర్హమైన పరిశోధనా గ్రంథం.

ఈ పుస్తకంలో తెలుగువారి వేమన, వీరబ్రహ్మం, సిద్దప్ప, ఆహమదొద్దీన్, గుజ్జల రామదాసు, పీర్ మొహినొద్దీన్ సాహెబ్, బోర అప్పలస్వామి, యడ్ల రామదాసు మొదలైన తత్త్వకవులు నీతి, భక్తి, జ్ఞాన, వైరాగ్య తత్త్వాలను బోధనా వివరణలున్నాయి. వీటికి పూర్వం జంగయ్యగారు ప్రవేశికలో ప్రశ్నతోనే మనిషిలోని ఆలోచనా విధానం, ప్రజ్ఞావికాసం పెంపొందిందనీ, ఆధ్యాత్మిక భావాలకు అంకురార్పణ జరిగిందనీ వివరించారు.

జానపద సాహిత్యంలోని తత్త్వగేయ ప్రాతిపదికను జంగయ్యగారు ప్రవేశికలో విశదీకరించారు. అతి ప్రాచీనకాలంనుండి సమాజంలోని ప్రజల జీవిత విధానాల్లో రెండు విభిన్న వర్గాలు ఏర్పడ్డాయి. ఒకటి పాలకవర్గం, మరొకటి పాలితవర్గం. జన జీవితంతో పాటు సాహిత్యం కూడ రెండు మార్గాలుగా

చీలిపోయింది. జనపదాలలోని సాహిత్యం జానపదమైంది. రాజాశ్రయాన్ని పొందిన పండిత సాహిత్యం లాక్షణికమైంది.

జానపద కవులకు ప్రభుత్వాదరణ లభించకపోయిననూ, అనంతమైన ప్రజాభిమానం వీరికి లభ్యమైంది. తమ వృత్తుల ద్వార జీవితాలను గడుపుతూ, సాటివారి శ్రేయస్సుకొరకే తత్త్వాలను రచించారు. న్యాయమూర్తుల శాసనానికి గల శక్తి జానపద తత్త్వాలకుంది. అందుకే ప్రజలు వీటిని భయభక్తులతో వింటున్నారు, పాడుతున్నారు. ప్రవేశికలోనే తత్త్వ సాహిత్య లక్షణాలను విశదీకరించారు. పని పాటకుగల సంబంధాన్ని సమన్వయించారు. తత్త్వాల్లోని ప్రకృతిని మూలాధారం చేసుకొని ఆవిర్భవించిన భౌతిక వాదాన్ని గూర్చి శూన్యవాదాన్ని గూర్చి సముచితోపమానాలతో సంక్షిప్తంగా పరిచయం చేశారు, భక్తితత్త్వం, ముక్తితత్త్వం, దైవతత్త్వం ఈ మూడింటిని వివరించడమే తత్త్వగేయాల పరమార్థం, ప్రయోజనం అని జంగయ్యగారు తెలిపినారు.

తత్త్వ గేయకర్తలకు ముందుతరం వాడైన ప్రజాకవి వేమనను రాగి–విరాగి అనే శీర్షిక ద్వార జంగయ్యగారు పరిచయం చేసినారు. "కామిగాక మోక్షగామి కాడు" అనే వేమన సూక్తి ననుసరించి అతడి జీవితంలోని, సాహిత్యంలోని రాగాన్ని, విరాగాన్ని శీర్షిక ద్వార చమత్కారంగా సూచించారు. మనదేశంలో కవులకూ, భక్తులకూ అతీతశక్తులున్నట్లు కథల నల్లినట్లే వేమన జీవితాన్ని గూర్చి కూడ అనేక కాల్పనిక కథలు ప్రచారంలో ఉన్నాయి. జంగయ్యగారు ఈ కథలను ఆధారంగా చేసుకొని వేమన జీవితంలోని లోటుపాటులను ఎక్కువగా తరచకుండా, స్వగ్రామం, కులం గూర్చి ఎక్కువగా చర్చించకుండా సాహిత్య విశేషాలనే విశదీకరించారు.

వేమన పద్యాల ద్వార ఆనాటి ప్రజాజీవనం, రాచరికశక్తుల ప్రమేయం, సమాజంలోని మూఢాచారాలు వ్యక్తమైనాయి. వేమన విగ్రహారాధననూ, నామధారులనూ, లింగధారులనూ, దొంగభక్తులనూ, కపటసన్యాసులనూ, బ్రాహ్మణులను, బౌద్ధులను నిర్మొగమాటంగా నిరసించారు. వేమన వివిధ పద్యాలను, వివిధ దృక్కోణాలతో పరిశీలించి వేమన తత్త్వాన్ని, నాటి సామాజిక జీవిత తత్త్వాన్ని నీలా జంగయ్యగారు విదితం చేసినారు.

"కనక మృగము భువినికద్దులేదనలేక
తరుణి విడిచి పోయె దాశరథియు
తెలివిలేని వాడు దేవుడెట్లాయెరా" —అని లోకారాధ్యుడైన
రామున్ని విమర్శించినాడు వేమన.

"కులము నీరు జేసి గురువును జంపించె
పొసగ నేనుగంత బొంకుబొంకె
పేరు ధర్మరాజు పెనువేపవిత్తయా" —ధర్మరాజు నయవంచక
గుణాన్ని వేమన ప్రశ్నించినాడు.

వేమన పద్యాల్లో స్త్రీ నిరసన ఎక్కువగా కన్పిస్తుంది. ఈ నిరసనకు కారణం వేమన అవలంబించిన వైరాగ్యం అని జంగయ్యగారు సూచించిన సూచన సమంజసంగా తోస్తుంది. స్త్రీని చులకన చేసిననూ, ఆమెను రక్షించని నరుడు చావడం మేలంటాడు వేమన. వేమన పేరుతో ప్రచారంలో ఉన్న పద్యాల్లో స్త్రీల దూషణం, భూషణం రెండూ కన్పిస్తాయి. ఈ పద్యాల్లో వేమన స్వంతం ఎన్ని? కానివి ఎన్ని? నాటి సామాజిక పరిస్థితులు గూర్చి ఆలోచించాలి అని జంగయ్యగారు సూచించిన విషయం పరిశోధకులకు చక్కటి అంశం.

కవిగానే గాక యోగిగా ధర్శనమివ్వడం వేమన ప్రత్యేకత. మాయను గెల్చినవాడు మర్మమెరిగిన యోగి అవుతాడని వేమన శూన్యవాదాన్ని వివరించారు. జంగయ్యగారు వేమన పద్యాల్లోని యోగాసనాలనూ, పంచముద్రలనూ, శూన్యవాదాన్ని, అచల తత్త్వ సిద్ధాంతాలనూ అతి సరళంగా, సమగ్రంగా వివరించారు.

వేమన కవిత్వంలోని ఆటవెంది నర్తనాలు జంగయ్యగారిని ఆకట్టుకున్నాయి. "ఆటవెలది విచలితరూపయెసను, నిశ్చలమైన అచలంలో స్థిరపడింది, సువర్ణసుందర యోగం అభ్యసించింది, రసపటుత్వం కలదిగా అలరెంది" అని జంగయ్యగారు మనోహరంగా వర్ణించిన ఆటవెల్లది గమన రీతుల్లో వేమన సాహిత్య రీతులు ప్రతిబింబిస్తున్నాయి. తిక్కన కందాన్ని, శ్రీనాథుని సీస పద్యాన్ని, వేమన ఆటవెలదిని అనుకరించడం అసాధ్యం. "ఏదో ఒక మకుటం

పెట్టి ఆటవెలది వ్రాసినవాడల్లా వేమనలు కాలేరు, కొన్ని వేల ఆటవెలది పద్యాలు రాసినసూ నేను నీలా జంగయ్యగానే మిగిలినాను"- అని అనడంలో జంగయ్య గారి నిజాయితీ అతనికి వేమనపై గల అభిమానము వ్యక్తమౌతుంది. నల్లగొండ ప్రాంతంలో ప్రచురమైన పదాలను వేమన ఆటవెలదుల్లో ప్రయోగించాడని తెలిపిన నీలా జంగయ్యగారు వివరిస్తే బాగుండేది.

సుమతీశతక ప్రభావం, పోతన భాగవత రచనా ప్రభావం, నృసింహ శతక ప్రభావం, బసవపురాణ ప్రభావాలు వేమన పద్యాలపై ప్రసరించాయని నీలా జంగయ్యగారు సోదాహరణ పూర్వకంగా వివరించడంలో, అతని పరి శీలనాశక్తి విదితమౌతుంది.

వేమన కవిత్వ ప్రభావం అతడి తదనంతర తత్త్వకవులపైన ప్రస రించింది. అయితే తత్త్వకవులు కుటుంబధర్మంగా జీవించారు. వేమన విరాగిగా జీవితాన్ని కొనసాగించాడు. ఈ జీవిత విధానాల ప్రభావం సాహిత్యాల్లో ప్రతి బింబిస్తున్నది. కాని వీరిరువురి తత్త్వాల్లో శూన్యవాదం, అద్వైతవాదం, సమా జంలోని దురాచార ఖండనలు సమానంగా కన్పిస్తాయి. నీలా జంగయ్యగారు తత్త్వకవుల్లోనూ, వేమన పద్యాల్లోనూ అచలతత్త్వ ప్రభావం ఉందని స్పష్టం చేశారు.

తత్త్వకవుల్లో ప్రథముడూ, ప్రముఖుడూ వీరబ్రహ్మం. ఇతనితోపాటు మిగతా తత్త్వకవులందరూ వేమనవలె విగ్రహారాధననూ, మూఢాచారాలనూ నిరసించారు. కాని వీరు వేమనకు విరుద్ధంగా సంసార జీవితంలోనే మోక్షాన్ని పొందమని బోధించారు. కులమత భేదాలను పాటించకూడదని, జ్ఞానసంపాదనకు సద్గురువును ఆశ్రయించాలనీ, తీర్థయాత్రలు వ్యర్థమనీ, జ్ఞానార్జనకు చదువు అనవసరమనీ, సత్ప్రవర్తనయే మోక్షానికి మార్గమని తత్త్వకర్తలు ఉద్బో ధించారు. వీరు తత్త్వాలను సరళమైన వ్యవహారిక భాషలో రచించడం వల్ల అవి సామాన్య జనంలోకి చొచ్చుకొని పోయాయి.

తత్త్వగేయాల లక్షణాలను, లక్ష్యాలను, భాషాశైలిని వివరిస్తూ నీలా జంగయ్యగారు, తాము సేకరించిన అనేక తత్త్వాల్లోనుండి కొన్ని ఆణిముత్యాలను పుస్తకంలో ఉదాహరించారు.

"ఏ కులమనిన్నను వివరమడిగితే యేమని చెప్పుదు లోకులకూ.
పలుగాకులకూ దుర్మార్గులకూ ఈ దుష్టులకూ" — అని తత్త్వకవులు కులం కాదు గుణం ప్రధానమన్నారు.

"బిల్లల రాళ్ళకు మ్రొక్కుచునుంటే భ్రాంతము చెడిపోవుదు యెరుక యెరే
చిత్తమునందున చిన్మయజ్యోతిని చూచుచునుండుట సత్యమురా" ప్రతి తత్త్వకవి రచనల్లోనూ ఈ విగ్రహారాధన నిరసన ప్రదర్శితమౌతుంది.

"భార్యల్ని వదలి భక్తి యోగులమనేవారు.
తమ జన్మమెట్లేర్పడునో తెలియరు" — అని తత్త్వకవులు సన్యాసుల జీవితాలను పరిహసిస్తారు. "ఆలుపిల్లలను విడచితే మన వీర్యమెవ్వరి పాల్పరా" అని తత్త్వకర్తలు ప్రశ్నిస్తారు. ప్రశ్నలోనే కర్తవ్యాన్ని బోధిస్తారు.

'మాయను విడగొట్టువాడు మనుజుడు
కాయంలోనే జ్యోతిని కనుగొన్నవాడు భక్తుడు'

అద్వైత, శూన్య వాదాలను తత్త్వాలు అతి సులభ శైలిలో ప్రబోధిస్తాయి. "తొమ్మిది త్రోవల తోలుబొమ్మ ఇది, నమ్మబోకు మోసమ్ము ఇది" — అని శరీరం పైన మోహాన్ని పెట్టుకోకూడదనీ, జీవితం అశాశ్వతమనీ తత్త్వాలు వివరిస్తాయి. జంగయ్యగారు ఉదాహరించిన తత్త్వకర్తలందరూ "తల్లిదండ్రులను తొలి దైవాలని కొలుచుము" అని ఉపదేశిస్తారు.

జంగయ్యగారు తెలుగు తత్త్వకర్తలనే గాక మహమ్మదీయ తత్త్వగేయకారుల తత్త్వాలనూ, వారి జీవిత విశేషాలను వెలుగులోనికి తీసుకొని వచ్చారు.

జంగయ్యగారు సేకరించిన క్రింది తత్త్వంలో,

'నేను తురకనైతే నాయాత్మ తురకౌనా
నా యాత్మ తురకైతే పరమాత్మ తురకౌనా
గోవుకు రంగులున్నాయి గాని పాలకు రంగులున్నాయా
గోవువంటివాడు భక్తుండైతే పాలవంటివాడు నాస్వామి'

సామాన్యులకు సుపరిచితమైన ఉపమానాలతో మతభేదాలు పనికిరావనే పరమార్థం ప్రబోధింపబడింది.

ఇలా జంగయ్య గారు తత్త్వాలను వివరించడమే గాక సాంఖ్య శాస్త్రాన్ని, యోగశాస్త్రాన్ని, వేదాంత విషయాలను సందర్భోచితంగా వివరించడం వల్ల ఆయా శాస్త్రాల్లో వారికిగల పరిజ్ఞానం ప్రస్ఫుటమౌతుంది. తత్త్వాల్లోని మాండలిక పదాలను, ప్రత్యేక మార్మిక పదాలను, భాషా శైలిని విశదీకరించి, వాటిలో మరింత పరిశోధన అవసరం. భావి పరిశోధకులకు సూచనలను అందచేశారు.

జంగయ్యగారు తత్త్వ గేయకర్తల్లో హిందూ, మహమ్మదీయులనే గాక స్త్రీ తత్త్వవేత్తలను కూడ పరిచయం చేశారు. తత్త్వ కవులను స్వయంగా కలుసుకొని, వారితో చర్చించి, వారి తత్త్వాల అంతరార్థాన్ని గ్రహించారు కాబట్టి తత్త్వ వివరణలకు సమగ్రత సిద్ధించింది. జంగయ్యగారు తమ కీర్తి కొరకు గాక, తత్త్వకవుల ప్రతిభను, జీవిత చరిత్రలను, సందేశాలను ఆంధ్ర జాతికి అందించాలనే తపనతో "తెలుగు తత్త్వ కవులు" పుస్తకాన్ని రచించారని ప్రతి పేజి సాక్ష్యమిస్తుంది. విషయపుష్టి, వివరణా నైపుణ్యం, వివిధ శాస్త్రాంశాల లోతులను తరిచే శాస్త్ర జ్ఞానం, పరిశ్రమ శీలం, ఈ పుస్తకంలో అడుగడుగున గోచరిస్తాయి.

జానపదుల తత్త్వాలా? అని చులకన చేసెడి పండితులు ఈ పుస్తకాన్ని చదివితే అలతి, అలతి పదాల్లోనీ, తత్త్వాల్లోని అనంతరార్థాన్ని గమనిస్తే ఆశ్చర్య చకితులౌతారు. ఒక్కొక్క తత్త్వ కవిపై ఒక్కొక్క పుస్తకం రాయగల సమాచారం, సమర్థత వీరి దగ్గరుంది. మత, ఆర్థిక, చారిత్రక నేపథ్యంలో జంగయ్యగారు తత్త్వ గేయాలను గూర్చి మరిన్ని పుస్తకాలను రచించి తెలుగువారికి అందిస్తారని ఆశిస్తున్నాను.

# స్వర్ణ కమలమే 'కవన కమలం'

—డా॥ కసిరెడ్డి

"ప్రకృతి యను వేణువును చేతబట్టికొన్నియు
మాధవుం డూదె ప్రణయ ధర్మములు విరియ
జగము లూగె, మహానంద సదృశమైన
మాధవుని మోము చదివెనా రాధ హృదయ"

(స్వర్ణకమలం, పుట : 97)

ప్రణయ ధర్మాలు విరిసి జగాలూగే విధంగా మాధవుడూదాడు; ప్రకృతి అనే వేణువును ఊదాడు; మహానందసదృశమైన ఆ మాధవుని మోమును రాధ హృదయం చదివింది.

ఈ రాధ జీవాత్మ; ఆ మాధవుడు విశ్వాత్మ. విశ్వాత్మను జీవాత్మ అధ్యయనం చేస్తున్నది; అనుభవిస్తున్నది; అనుభవాల నాలాపిస్తున్నది.

జీవాత్మ అయిన ఈ రాధ కవిరత్న శ్రీ నీలా జంగయ్య; విశ్వాత్మ అయిన ఆ మాధవుడు కనిపించీ-కనిపించని ఈ సమస్త ప్రపంచం.

కంటికి కనిపించినవి కొన్ని, హృదయాన్ని స్పృశించినవి కొన్ని, మనస్సును కేళించినవి కొన్ని, బుద్ధిని వాదించినవి కొన్ని, ఆత్మను ఆలరించినవి కొన్ని...

ఒక్కటా రెండా బోలెడన్ని! ఎప్పుడో ఒకప్పుడు అంతరాళం నుండి అన్నీ దూకుతాయి; అందులో అక్షరాకృతిని కొన్నే ధరిస్తాయి. కవిరత్న శ్రీ నీలా జంగయ్య కృతుల్లో ఆ కృతి ధరించి, ఆధునిక తెలుగు సాహిత్య ప్రపంచంలోకి అడుగుపెట్టింది స్వర్ణకమలం. ఆ స్వర్ణకమలం లోనిదే ఈ వ్యాసాగ్రాన నిల్చిన మొదటి రేకు.

మరి అలా ప్రపంచాన్ని దర్శించి, స్పృశించి, అనుభవించిన ఆ కవి 1959 లోనే మహాప్రస్థానం నిర్మాణం చేశారు. అందులో ఆయన అంటారు.

"కుల మత భేదం
కలుషితవాదం
కుటిల ప్రయత్నం
నటన కుతంత్రం
పోవాలోయ్, పోవాలోయ్
సమతాదర్శం
సుమహితవాదం
జీవనసారం
భావనవేదం
రావాలోయ్, రావాలోయ్" (పుట : 15)

మూడున్నర దశాబ్దాలుగా వారు "అది" పోవాలంటున్నారు; "ఇది" రావాలంటున్నారు. పోవాలన్నది పోవడం లేదు; రావాలన్నది రావడం లేదు.

పద ప్రయోగంలో కనిపించే భేదాల్ని వదిలేస్తే, నాటినుండి నేటివరకు అందరూ ఇదే అంటున్నారు. అందరిలో తామొకరం అనుకున్నవారంతా ముందు ముందు ఇదే అంటారు.

అయితే మంచి గ్రహించడానికి, మంచి పలకడానికి, మంచి ఆచరించడానికి సంస్కారం కావాలి. ఆ సంస్కారం లేనివారు మరి చైతన్యహీనులే అవుతారు; ఆ మాటే అంటారు కవిగారు.

"అవసరమ్ము నెంచి సత్యమ్ము నాడకున్న
మంచిమాట నొకింత గ్రహించకున్న
నోళ్లు చెవులును కనులున్నవారికన్న
హీనులుగదన్న చైతన్యహీనులెందు." (పుట : 88)

ఈ "స్వర్ణకమలం" నిండా ఇలాంటి పదదళాలతో పూచిన పద్య పద్మాలెన్నో ఉన్నాయి. నిన్నమొన్ననే అచ్చయిన ఈ గ్రంథంలో వారెన్నో అంశాల్ని స్పృశించారు.

సుకవుల్ని పరామర్శించారు; ప్రస్తుతించారు. ఆదికవుల జాడల ననుసరించారు.

"అమర వాఙ్మయలోక విఖ్యాతిగన్న
సుకవిచంద్రులు, విజ్ఞానసూక్తి నిధులు
దండి, భవభూతి, కవికాళిదాస, భార
వులు కళారమ్య భారతీయుల నుతింతు" (పుట : 31)

తెలుగు సాహిత్య విమర్శనాలోకంలో ఇప్పుడో "తమాషా" జరుగుతున్నది. భారతీయతను అసహ్యించుకోడం, భారతీయుల్ని తిట్టిపోయడం; భారతీయ సంప్రదాయాల్ని అనుసరించిన కవుల్ని అభ్యుదయ నిరోధకులని జెండాకెక్కించడం...ఎండిస్తా, మండిస్తా, దండిస్తా అని "గప్పాలు" కొట్టడం; ఇదే తమాషా! ఈ తమాషాను చూసి పెద్దలు "కాబట్టన"ట్టంటున్నారు; మొద్దులేమో వినోదిస్తున్నారు; అప్పుడప్పుడు వీరంగాలు పలుకుతున్నారు. ఈ నేల తల్లి కన్నబిడ్డలు సృష్టించిన సాహిత్యం మీద "థూ" అని ఉమిసే ఈ "కొడుకు" లెవరు! ఏ విదేశీ ఇజాల కౌగిళ్ళలో ఇరుక్కున్నవారు!

భారతీయ కవివరేణ్యుల్ని పొగడిన ఈ కవి నీలా జంగయ్య, ఈ రకం విమర్శల్నీ, ఈ రకం ఇజాల్ని బాగానే గమనించారు; అందుకే ఇలా అన్నారు.

"నిజము నిసుమంత జూపని ఇజము లిపుడు
సరస సారస్వతావని సందడించె
చేను రవ్వంత కల్పు కాంక్షించినంత
పెరిగె కల్పునె చేనుగా పరిగణింప" (పుట : 31)

చేనులో "కలుపు" ఉన్నది నిజమే. ఆ కలుపునే చేననుకొని తిడితే ఎట్టా పాములూ! అంటున్నారు జంగయ్యగారు...దీని కిక్కడో ఉదాహరణం చెప్పాలి.

అదో కళాఖండం; లెక్కలేనంతమంది దాన్ని దర్శిస్తున్నారు; ఆహా! ఓహో! అంటున్నారు. ఆ కళాఖండం పక్కనుండి పారే యేరు తనగతి మార్చు కొని కళాఖండం మీది మీదికి వచ్చింది. దాన్ని రక్షించాలనుకున్న కళా పోషకులూ-కార్యకర్తలు దానిచుట్టూ పెద్ద కోటగోడ కట్టారు. మేము రక్షించాం లే అనుకున్నారు. ప్రకృతి ధాటిని కోటగోడ అడ్డగలిగిందిగాని, మనిషిలో తిష్ఠవేసు కున్న విధ్వంసక వాదాన్ని గోడలూ-మేడలూ ఏంచేస్తాయి! అందుకే ఆ కళా ఖండం రూపురేఖలు కనిపించకుండా పోయాయి.

ఆ తర్వాత కొన్నాళ్ళకు అంటే తరాలు దాటిపోయిం తర్వాత, మిగిలిన ఆ మొండి గోడల్నే కళా ఖండాలుగా జనం చెప్పుకోసాగింది; జగం నమ్మ సాగింది.

"తత్త్వం"పోయింది; ఆ తత్వాన్ని కాపాడ్డానికి ఆపద్ధర్మంగా వచ్చిన "తంతు" మిగిలింది. తత్వాన్ని వెలిదీసే ప్రయత్నం కన్నా, తంతును తన్న డమే విమర్శనా సాహిత్యంగా, తెలుగునాట "చలామణి" అవుతోంది.

అయితే, తత్వాన్ని వెలికిదీసే ప్రయత్నమూ జరుగుతోంది...ఆ ప్రయ త్నంలో భాగంగానే ప్రతితరంలో పదిమంది తమవంతు బాధ్యత నెరవేరుస్తూనే ఉన్నారు; అందులో జంగయ్యగారూ ఉన్నారు.

"నీవు నేనై బీజమై ఉంటినో తండ్రి!
నేను నీవై విశ్వమై ఉంటివో తండ్రి!
నేను నీవున్నవని తెల్పుటకె పుట్టాను
నీవు నన్నే కాచుటకు దాపువైనావు." (పుట : 47)

"ఇండివిజ్యువల్ మ్యాన్, సోషల్‌మ్యాన్, కాస్మిక్‌మ్యాన్" అనే పదాలు వాడి ఈ భావాన్ని సమన్వయించాలని ఉంది. ఎందుకంటే ఉపనిషద్విజ్ఞానంలోని

పరిమళాన్ని ఉన్నదున్నట్టుగా అందిస్తే, అందుకొనే ఘ్రాణశక్తి మన ముక్కులేనాడో కోల్పోయినై; కాబట్టే ఈ ప్రయత్నం.

నేను ఇండివుజ్వల్‌మ్యాన్‌ను కాను! ఓ తండ్రీ కాస్మిక్‌మ్యాన్! నీవే నేనుగా బీజమై ఉన్నావయ్యా! నీవు కాస్మిక్‌మ్యాన్‌వే నిజమే! కాని నేను నీవై కనిపిస్తున్నావయ్యా! కాస్మిక్‌మ్యాన్ నుండి సోషల్‌మ్యాన్‌గా ఇండివుజ్వల్ మ్యాన్‌గా నేనెందుకు వేరై కనిపిస్తున్నానో తెలుసా! నీవున్నావని తెల్పడానికే సుమా! ఎంతైనా నీవు కాస్మిక్‌మ్యాన్‌వి కదా! ఈ ఇండివుజ్వల్‌మ్యాన్ను కాపాడ్డానికి దాపున్నే ఉన్నావు లేవయ్యా!

వ్యష్టి - సమష్టి - సృష్టి త్రిధా విభక్తమై కనిపిస్తుంది; ఇదే జీవాత్మ, చైతన్యాత్మ, విశ్వాత్మగా భాసిస్తుంది. దర్శనంలో లోచూపు కావాలి; ఆ లోచూపు ఉన్న కవిరత్న నీలాజంగయ్య.

జంగయ్యగారు తల్లిదండ్రుల ఋణాన్ని, గురు ఋణాన్ని తీర్చుకొనేదెలా అని ప్రశ్నిస్తున్నారు. "మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ" అన్న ఆర్యోక్తులనే తమ బాణీలో చెబుతున్నారు. ఇది ఆత్మబోధ, ప్రజాబోధ.

> "గర్భభారమోపి కన్నావు బిడ్డల
> ఆడమగల భేద మరయకింత
> ప్రేమ చేసి మిగుల పెద్దచేసిన ఋణ
> మేమి చేయ దీరదెట్లు తల్లి!
>
> ధర్మపత్నియందు తన రూపమని కన్న
> బిడ్డలందు మమత పెద్ద చేసి
> ముద్దుపెట్టి పెంచుమోదమ్ముతో తండ్రి
> ఋణము దీర్ప తరమె యేరికైన!
>
> సంఘమందు మేలు సంఘటించే మంచి
> విద్యనేర్పి పౌర విధులు దెలిపి
> జ్ఞాన వృద్ధి సలిపి ఘనత గూర్చిన గుర్వు
> బాకి దీర్పవశమె ప్రజలకెల్ల." (పుట : 44)

ఈ సంస్కారాలు ప్రజల్లో నాటుకోవాలని ఆశించే కవిరత్నగారు, ఇంకా కులోన్మాదం కనిపిస్తుందే అని బాధపడుతున్నారు; కులమెక్కడ నిర్మూలింప బడింది; ఇంకా వేళ్ళూనుకొని పోతున్నది అంటున్నారు.

"...కులము పేరున నూరూరబలిసి పోయె
వసతిగృహములు హోటళ్ళు ప్రభవమొంది
అడుగడుగడె పెద్ద యిది యేమిటని ప్రభుత్వ
మట్టి కనుచుండె కులమెక్కడంతరించె." (పుట : 52)

అంతేకాదు; ఈ నలుబదేండ్ల స్వాతంత్ర్యం 'వాపే-బలుపే' అంటూ "...ఎవరు దలచిరి స్వాతంత్ర్య మిట్లగునని, వాపు బలుపని చెప్పనెప్ప గిది దలతు..." ఈ దారిద్ర్యం ఎప్పుడు తొలగుతుందని అంటారు కవి.

కట్నాల కడగళ్ళను వివరిస్తూ కూర్మి పెంచమంటారు కవి; ప్రేమ పంచమంటారు కవి.

"వరకట్న దురాచారము
వరులేల పరిత్యజించి నవనాగరతన్
వరగుణ దీప్తిం గూర్చరు
సరస సదాశయము లెసగ సాగి సదాత్మన్.
...దంపతుల కీడుజోడె యత్యవసరమ్ము
కలిసి మనునట్టి ప్రేమనే కాంచ వలయు..." (పుట : 38)

సామాజిక సమస్యల విషయంలో వారి స్పందన చాలా పద్యాల్లో కనిపిస్తుంది. ఆ స్పందనే వారిని గత మూడున్నర దశాబ్దాలుగా కలం పట్టి నడిపిస్తుంది. ఈ స్వర్ణకమలంలో వారింకా అనేక అంశాల్ని పద్యగేయ వచన కవితల ద్వారా అందించారు. మొత్తం 83 ఖండికల్లో "సమయం, కత (థ)" రెండూ సామెతల కూర్పులే. వారి కూర్పులోని నేర్పువల్ల కూడా కొన్ని సామెతలుగా భావిస్తున్నాయి.

సప్తగిరి లాంటి పత్రికలు చాలా కాలంనుండే భక్తి భావ ప్రదర్శకాలైన వచన కవితల్ని అందిస్తున్నాయి. శ్రీ జంగయ్యగారి స్వర్ణకమలం అలాంటి కవితల్ని కూడా [illegible] సమాజ [illegible] మయాన్ని వెచ్చించి తను, మన, ధనాల్ని అర్పించి పనిచేసిన వారినెందరినో శ్రీ జంగయ్య ఈ గ్రంథంలో కీర్తించారు. అలాంటివారిలో శ్రీమతి ఈటుకూరి లక్ష్మీకాంతమ్మ, శ్రీ జూలూరి వీరేశలింగంగుప్త తదితరులున్నారు. ఆధునిక కవుల్లో శ్రీ ఆవంత్స సోమసుందర్, డా॥ దాశరథి వారూ...వీరూ ఉన్నారు. ఈ గ్రంథాన్ని వారు శ్రీపురం విశ్వనాథం గుప్తగారికంకిత మిచ్చారు.

స్వర్ణకమలం గ్రంథంలో "చిరకమ రిసాక్షి" (పుట : 31) లాంటి ఒకటి రెండు దోషాలున్నా ఎప్పుడూ గుర్తుంచుకోదగ్గ అంశాలు కొల్లలన్ని ఉన్నాయి.

"...దబ్బుకోసం శుద్ధత కోల్పోయిన లోకం
అనాథం ఆర్తనాదాలు వినదు..." (పుట : 82)

"...అధికారాల చుట్టూ ఆశల నక్కలు
చక్రభ్రమణం చేస్తూ నిజాన్ని చిత్రవధ చేస్తున్నాయి..."
(పుట : 84)

"...నీమోవిని వెదురుముక్క నిలిచి పాడదా
మా గుండియ గోపికయై మరగి యాడదా..." (పుట : 81)

జీవులేవైనా తల్లికడుపునుంచే వచ్చాయి
తేనె నెక్కడైనా ఈగలు పువ్వులనుంచే తెచ్చాయి..."
(పుట : 49)

"...దానవుల కెంపు ధర్మమధర్మమగును..." (పుట : 82)

కవిరత్నగారి స్వర్ణోత్సవం సందర్భంగా ఈ స్వర్ణకమలం వెల్వడడం సముచితం. కమలం హృదయానికి 'వికాసానికి' ఆత్మకూ గుర్తు. జంగయ్యగారి వికాసంలో ఈ స్వర్ణకమలం ఓ మలుపురాయి; ఈ మలుపు వారికీ, వారి కవి మిత్రులకూ, ఆధునికాంధ్ర కవిత్వానికి గుర్తుగా మిగలాలని భావిద్దాం; కవిరత్న గారి "కవన కమలం" నిరంతర పరిమళాల్ని వెదజల్లాలని ఆశిద్దాం.

# "అగ్నిదీప్త – కవితాదీప్త"

డా॥ కర్నాటి లింగయ్య

విజయవాడలో ఆం.ప్ర. ఆర్య వైశ్య మహాసభలు జనవరి 1977 లో జరిగాయి. శ్రీ నీలా జంగయ్యగారితో కలసి ఆ సభలకు వెళ్ళటం జరిగింది. అంతకు ముందే అంటే 1972 లోనే మహాకవి ఉత్పల సత్యనారాయణాచార్యుల గారి ద్వారా వారి పరిచయం తెలుగు అకాడమీలో జరిగింది. ఏ సుముహూర్తాన మా పరిచయం పరస్పరం జరిగిందో కాని, మా పరిచయస్తులలో లింగయ్యను చూచి జంగయ్య అనడం, జంగయ్యను చూచి లింగయ్య అనడం పరిపాటి అయింది. నిజంగా మేము అట్లానే ఉన్నాం. సుమారు ఇప్పటికి 16 సంవత్సరాలు స్నేహంగా ఉంటూ ఒక్క చిన్న పొరపచ్చము కూడా మా మధ్య జరుగలేదని చెప్పుకుంటే మీకు ఆశ్చర్యం కల్గవచ్చు. అంతటి సౌజన్యశాలి శ్రీ జంగయ్యగారు.

శ్రీ జంగయ్యగారి గ్రంథావిష్కరణ సభలు, ఆయన సాహిత్య రజతోత్సవ సభలు, ఆయనతో కలిసి చేసిన సభలు సుమారు అర్ధశతం వరకు ఉంటాయి. ఆయనకు సభలు చేయడం, ఏ సభకు ఎవరిని వక్తలుగా ఉంచడం, ఎట్లా నిర్వహించడం వంటి తీరులు నన్ను బాగా ఆకర్షిస్తూ వచ్చాయి. ఆయనతో స్నేహంవల్ల నేను నిద్రాహారాదుల లెక్కించక ఎం.ఫిల్., బి.ఇడి., పి.హెచ్.డి., డిగ్రీలను పొందాను. అంటే నిరంతరం చదివే, రాసే గుణాన్ని పెంపొందించుకోగలగాను. మంచి స్నేహమని చెప్పడానికి ఈ ఒక్క నిదర్శనం చాలు. ఆయనవల్ల నగరంలోనే గాక ఇతర ప్రాంతాలలోని వైశ్య కవి-పండితుల, నాయకుల స్నేహాలు, పరిచయాలు అసంఖ్యాకంగా పొందాను.

వాసవీ క్లబ్ రజతోత్సవ సంచికకు సంపాదకునిగా ఉండే అవకాశం, నల్లకుంట వైశ్య సంఘం అధ్యక్షునిగా ఉండే అవకాశం నాకు కలిగాయి.

'వాసవీ సాహిత్య పరిషత్తు' మరియు 'నందనవనం' సాహిత్య సంస్థలకు వారు అధ్యక్షులుగా ఉంటూ నన్నే ప్రధాన కార్యదర్శిగా ఎంపిక చేసుకొని అన్నిట ''నిన్ను వీడి నేను ఉండనన్నట్లు'' ముందుకు మునుముందుకు సాగుతూ ఎదిగిపోతున్న మా 'కవిరత్న' జంగయ్యగారి స్వర్ణోత్సవాల సంఘానికి ప్రధాన కార్యదర్శిగా ఉండే మహద్ భాగ్యం కలిగింది.

నేను 'అగ్నిదీప్త'ను గురించి చెప్పబోతూ వారిలోని 'కవితా దీప్తిని, స్నేహదీప్తిని' విశ్లేషించడం ఎందుకు జరిగిందో మీరూహిస్తారు. ఆయన పుస్తకంలోని సొగసులను చెప్పబోతు,ఆయన గురించి ఈ ముందుమాటలు చెప్పకుండా ఉండలేకపోయాను.

వైశ్యులకు కన్యకాపరమేశ్వరి ఆదర్శమైన దేవత. ఆమె త్యాగం, ఆమె ఆదర్శాలు అసమానమైనవి. శ్రీ జంగయ్యగారు రచించిన కన్యకాపరమేశ్వరి వెయ్యి పద్యాల మహాకావ్యం. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు విని అష్టాదశ, పురాణాల తరువాత అంతటి పురాణం ఇదేనని వారి రజతోత్సవ సంచికలో చెప్పిన మాట నన్ను ఎప్పుడూ తొలుచుస్తూ ఉంటుంది. ఆతని మొత్తం రచనలు ఒక ఎత్తూ ఈ కావ్యం ఒక ఎత్తు. ఈ కావ్యం నా నేతృత్వంలో ఆంధ్రులకు అందించాలన్న నా కోరిక త్వరలో నెరవేరాలన్న దానితో ముడిపడి ఈ "అగ్నిదీప్త"ను పరిచయం చేస్తున్నాను.

శ్రీ సాంంకాయన ముని సంస్కృతంలో వ్రాసిన లేదా చెప్పిన కన్యకా చరిత్రను 'అగ్నిదీప్త' పేరుతో తెలుగులోకి వచనంగా అనువదించి సామాన్యులకు కూడా తెలిసేటట్లు చేసారు. దీనిపైన విశ్వహిందూ పరిషత్తు అధ్యక్షులుగా ఉన్న శ్రీ జి. నారాయణ శెట్టి, ఐ.ఎ.యస్., గారు అఖిలభారత వాసవీ కన్యకా పరమేశ్వరి దేవాలయాల సమాఖ్య అధ్యక్షులు అయిన శ్రీ దుర్వాసులు గుప్తగారు ఇచ్చిన అభిప్రాయాలు ఎన్నదగినవి. 'అగ్నిలో పుట్టి' 'అగ్నిలా పెరిగి' 'అగ్నిలో ప్రవేశించి' బంగారు విగ్రహమైన 'కన్యకా పరమేశ్వరి' సమస్త నారీ లోకానికి కొంగు బంగారమైన తల్లి. ఆ తల్లి చరిత్రను ఒక స్త్రీకే కానుకగా నిచ్చి ఆమెలో తన తల్లిని చూసుకొన్న కవిరత్నగారి మనస్సు ఎలాంటిదో విచ్చి చెప్పనవసరంలేదు. ఇందులో సరజాప వారి కన్యకా, పెండ్లి గోత్రాలు,

వరసలు, ఆంధ్ర వైశ్యులు-ఆచారాలు, పూర్వజన్మలు అనే శీర్షికలు అనుబంధంగా ఉన్నవి. ఇవి స్త్రీ, పురుషులెవరికైనా కథలవలే చదువుకునే రీతిగల చక్కని వచనంలో వాసవీ కన్యకా చరిత్రను వ్రాశారు. ప్రవేశికలో "వస్త్వర్థమైన తేజో రూపమే వాసవీ" అని ఒక్క మాటతో నిర్వచించడం ఆయన రచనా శక్తికి మచ్చుతునక అనవచ్చు. 10, 11 శతాబ్దాల మధ్య నిజంగా జరిగినది ఈ కథ. 1983 వ సంవత్సరంలో జూలై 13 నుంచి 24 వరకు హైదరాబాదులో జరిగిన "వాసవీ విశ్వశాంతి మహా యజ్ఞం సందర్భాన్ని పురస్కరించుకొని ఈ గ్రంథం వైశ్యులందరికి అందించడమైంది. వాల్మీకి రామాయణానికి వలెనే, జరుగకముందే కన్యకా పరమేశ్వరి కథ సాలంకాయన మునిచే చెప్పబడినవి.

ఈ కథ వచనంలోకి అనువదించిన శ్రీ జంగయ్యగారి నేర్పు కూర్పు సుమనోహరంగా ఉంది. "పురుషోత్తముడైన కృష్ణ పరమాత్ముడు అర్జునునకు విశ్వరూపం చూపించినట్లే-మహాదేవి అయిన వాసవీ కన్యకా వైశ్యులకు విశ్వ రూపం చూపించింది". పార్వత్యంశలో ఉన్న వాసవినని కన్యకా పరమేశ్వరీ చెప్పుకొన్నది. భారతీయమైన విజ్ఞానమంతయు దేవతా పూజ్యంగా సంభావిత మైంది అని చెప్పడం వంటి మాటలు ఈ పుస్తకం నిండా చోటుచేసుకొని నాస్తికులను కూడా ఆస్తికులనుచేసే విధంగా సదుక్తులతో శోభిల్లడం నాకేకాదు పఠితలకందరికి ఆనందకరము కదా!

పెనుగొండ క్షేత్రాన్ని వర్ణిస్తూ చెప్పిన ఈ క్రింది మాటలు చూడండి.

కొబ్బరి తోటలతో, పనస వృక్షాలతో నయన పర్వమై శోభించే ప్రాంతములు తూర్పున గోదావరి, దక్షిణాన లవణ సముద్రము, పడమర గోస్తనీనది, ఉత్తరాన వాసిష్ఠ గోదావరి శాఖయు తనరారుచున్నవట.

పార్వతికి జన్మ కారణమయిన హిమాలయమువలె వైశ్యులకీ పెనుగొండ పట్టణము జన్మస్థానమయినదట. ఈ పట్టణము రోహణ పర్వతమువలె మణి గణాలతో ఒప్పుచున్నదట. సకలార్థాలను అడిగిన వారికిచ్చే దాతలతో కల్ప వృక్షమువలె ప్రకాశిస్తుందట. అంటే ఆ పట్టణము జలసమృద్ధము, ఫల సమృద్ధము, దృశ్యమానము అయినా కొండలతో, వనముతో తోటతో పోల్చి చెప్పడం విశేషంగా ఉన్నది.

శ్రీ జంగయ్యగారు తన కవిత్వాన్ని గ్రంథాలుగా తీర్చి ఇష్ట దేవతలకు, సంఘ సేవకులకు, సాధుమూర్తులకు, రాజకీయ నాయకులకు, అంకితాలిచ్చారు. ఆ క్రమంలో నన్ను కూడా చేర్చారు. నేను అధ్యాపకుడను. నేను మీకు ఏమి చేయగలను అన్నా వినక "నీవు చదువుకున్నవాడవు, అధ్యాపకుడవు అన్నిటి కంటే విద్య అంటే చెవులు కోసుకునే మనస్తత్వమున్నవాడవు, పక్కన ఉన్న వాడవు నిన్ను వదిలిపెడితే ఎట్లా?" అని ఒప్పించి "కవితా చంద్రిక" మరియు "భద్రాది మకుట నిర్వచనాలు" అను పేర్ల గ్రంథాలు అంకితమిచ్చి గౌరవించిన సౌహార్ద్రతను మరువలేని గుర్తులుగా మిగిలించుకొన్నాను.

శ్రీ జంగయ్యగారి స్వర్ణోత్సవం దిగ్విజయంగా జరిగి నూరేండ్లు ఆరోగ్యంగా ఐశ్వర్యవంతుడుగా వర్ధిల్లాలని భద్రాచల రాముణ్ణి, శ్రీశైల మల్లేశ్వరుణ్ణి, యాదగిరి లక్ష్మీనరసింహస్వామిని మరియు తిరుపతి వెంకన్నను ప్రార్థిస్తున్నాను.

# రామశతకం - రమణీయ దృక్పథం

—డా॥ ఎల్లూరి శివారెడ్డి

నీలా జంగయ్యగారి సాహితీ కన్యక కేశపాశంలోని ఉజ్జ్వల నీలమణి 'రామశతకం'. జంగయ్యగారు నిలువెల్లా కవి. ఆయన మాటల్లో మధురిమ, రచనల్లో స్వారస్యగరిమ పొంగులు వారుతుంది. ఐదు పదులు వసంతాలు చూసిన జంగయ్యగారు నలభైకి పైగా రచనలు చేయడం ఆయన వట్టిపోని కవితా శక్తికి తార్కాణం. నిత్యజీవితం ఏ సంఘటన ఆయన్ను కదిలించినా అది రమణీయంగా రచనావతారాన్ని సంతరించుకుంటుంది. కావ్యం రాసినా, శతకం చెప్పినా, వచనం రచించినా, వ్యాసం తీర్చిదిద్దినా అందులో సౌజన్యం, ఔచిత్యం సాక్షాత్కరిస్తాయి. ఆయనకు శబ్దపుష్టి, భావ దృష్టి రెండూ ఉన్నాయి. శరీరం అలసినా మనసు అలసిపోని మనస్వి జంగయ్యగారు.

రామశతకం రాశికి రాగల రచన. శతకమంటే కవివేసిన కేకలకు అక్షర రూపం. ఆత్మీయతాగుణం శతకంలో మరీ ఎక్కువ. అది ఉంటేనే శతకం శక్తి మంతంగా ఉంటుంది. 'నొప్పింత లేక కవితలు' పుట్టవని కవిగారి వాక్కు. నిజమే మనసు మండితే మంచి కవిత వస్తుంది. రామశతకం కందపద్యాలమాల. కవి గుండెలో పూచి రాముని గళంలో చేరిన అష్టోత్తరశత పద్యపుష్పమాల. 'కందం రాసినవాడే కవి; పందిని వేసినవాడే బంటు' అన్న సామెత ఎంతగానో వాస్తవం. ఒక తిక్కన, ఒక సుమతి శతకకారుడు, ఒక పోతన కందపద్యాన్ని గంతులు వేయించారు. నియమ బహుళమైన కందం ఫలభరితమైన మాకందంగా మారింది జంగయ్యగారి హస్తవాసితో. ఈనాడు పద్యం పనికిరాదన్న వాదన వినిపిస్తుంది. పద్యాన్ని నిరసిస్తేనే కవులకు నాగరికత ఉన్నట్టు!! ఈ భావంలో యథార్థం ఏ కొద్దిగానో ఉన్న చేతగానితనం ఘనంగా కనిపిస్తుంది. సౌందర్యం ఏ ఒక్క రూపంలోనో ఉండదు. అది పద్యంలో తళుక్కుమంటుంది. వచన కవితలోను కిలకిం మంటుంది. ఎవరికిష్టమైన మార్గాన్ని వారు ఎన్నుకుంటారు.

మనం చూడవలసింది ఎన్నుకున్న మార్గంలో ఎంతగా రాణించావా అన్నది మాత్రమే. జంగయ్యగారికి పద్యం వెన్నంటి వస్తుంది. పఠితకు నోటిలో వెన్న లాగా ఉంటుంది. ఆ వెన్నను ఆస్వాదించే గోపాలకుడు కావాలి పాఠకుడు. "మానవ జాతిని నీతివంతంగా గుణయుతంగా విలక్షణంగా తెలివిగా మర్యాదగా తీర్చిదిద్దటానికే సూక్ష్మంలో మోక్షం" లభించే పద్ధతిగా శతకాలు తీర్చబడి నాయి. అన్నది ఈ కవి ఉద్దేశం. 'మేలేదో కీడేదో విడమరిచే ప్రయత్నంలో శతకాలు వచ్చాయంటే కాదని ఎవరంటారు. అన్న వీరి అభిప్రాయం సమీచీ నంగా ఉంది. కొందరికి కవిత్వం వరదలాగా వస్తుంది. కాని అందులో బురద ఎక్కువ. జంగయ్యగారు పరమశివునిలా రసగంగను శిరసున నిలుపుతున్నారు. ఆయన మాట ఎంత నిర్మలమో, మనసంత ప్రసన్నం. తెలుగు పద్యం ఎలా ఉంటే వుంటుందో జంగయ్యగారు 'రసభాసురముగ పద్యము, పసగలిగిన తెలుగునందు పటుతరగతి పెం, పెసలార చెప్పగల కవి. అసమాన కళా విదగ్ధుడగు గదరామా' అనే పద్యంలో భావించారు. రచిస్తున్నది పద్యమైనా, ఉప యోగిస్తున్నది. గ్రాంథిక రచనేఐనా జంగయ్యగారు భాషలో ఎన్నో సడలింపులు చేశారు ఈ శతకంలో. అది వారు స్వేచ్ఛకోరి చేసిన ప్రయత్నం. 'తెలుగు పద్యం జానపద బాణీలనుంచే పుట్టి ఆ తరువాత లక్షణాల సమన్వయంగా వర్ధి ల్లింది' అని వారు ముందు మాటలో చెప్పడాన్ని బట్టి, భాషలో కొంత సడలింపు అవసరమని ఆయన అభిప్రాయం. పద్యాల్లో గ్రాంధిక భాష లాగా వాడుకభాష ఇమడక పోయినా మరికొన్ని ప్రయోగాలు చేస్తేగాని ఆ విషయం తేలదు.

కవిది సున్నితమైన మనసు. ఆనందం వస్తే పొంగిపోతుంది. వేదనలో కుంగిపోతుంది. ఈ ఎగుడు దిగుళ్ళకు హృదయం తట్టుకోలేదని కవికి తెలుసు. హృదయం మెద్దుబారితేగాని సమాజంలో జీవించలేని దుఃస్థితి ఏర్పడింది. అందుకే కాబోలు 'కవికేల హృదయ మిత్తువు-అవనీపతికేల యిడవు' అని జంగయ్యగారు బాధ పడతారు. ఇందులో చెప్పినట్లు ఈనాడు 'అవనీపతులు' లేక పోవచ్చుగాని వారిని తలదన్నే పరిపాలకులు ఉన్నారు. ఈ శతకంలో పద్యంలో శబ్దచమత్కా రాలు చేసిన సందర్భాలూ ఉన్నాయి. పదాలు విరిచి పాదాదిలో శబ్ద చమత్కృతి సాధించిన ఈ పద్యం గమనార్హం.

"బడి బ్రాహ్మణులకు, సాగం
బడి రెడ్లకు నార్యవైశ్య వర్యులకున్ రా
బడి ముఖ్యమైన దన దిగు
బడి మెచ్చెద వీవు రైతువై ధర రామా !" (17.ప.)

ఈ పద్యంలోని భావం ఎలా ఉన్నా అది సమసామయికం కాకపోయినా జంగయ్యగారి శబ్ద చాతురికి ఇది నిదర్శనం. ఇలాంటి పదాల విరుపుల్లోనే భావాల మెరుపు లుంటాయి.

ఒకోసారి సుమతిశతక పద్య రచనకు దీటుగా పద్య రచన ఉంటుంది. అలాంటి సందర్భాలు అరుదైనా పద్యాలు బిరుదులు గలవే. కందంలో నాలుగు పాదాల్లో ఒకే మాదిరిగా భావధారసాగుతుంది. విధినిషేధాలు రెండు రెండు పాదాల్లో సాధారణంగా కనిపించవు. కనిపిస్తే దోషం లేదు. జంగయ్య గారి ఈ పద్యాన్ని గమనిస్తే ఈ విషయాలు బోధపడుతాయి.

"ముక్కెర ముక్కున కందము
చక్కని ముగుదాడు కోడెజాతికి ముద్దౌ
ముక్కిడి కతుకవు సొమ్ములు
తిక్కకు మరియాద తీరు తెలియదు రామా." (42. ప.)

వ్యస్తమైన పదాలతో, రుచిర పదబంధాలతో ఈ కవి రచిస్తాడు.

జంగయ్యగారు రాముణ్ణి రాముడుగానే చూడరు. రాముడు దైవస్వరూపు డైనా ఆ దైవం సామాన్య మానవునిలోను ఉన్నాడన్నది ఆయన నమ్మకం. "రామయ్య రైతు పొలమున, రామమ్మలె సీతలగుచు' (ప. 77) అన్న వాక్యం ఈవిషయాన్నే విప్పి చెబుతుంది. కొన్నిసార్లు ఆయన వాడిన యమకాలు యమ రుచిగా ఉంటాయి.

"మాయే నిండిన జగమున
మాయేమాటలను నిండె మనుగడ మాయై

మాయం దాటగ నీవే
మా యందున నిల్వకున్న మాయే రామా." (44.ప.)

పై పద్యం నాలుగో పాదంలో తళుక్కుమనే యమకం మాయలాగా తోస్తుంది గాని మహిమ కలిగిందే.

ఈ శతకంలో కొన్ని మాండలికాలు రుచికరంగా ఉన్నాయి. "కొస్సెటి కొమ్ములు" (ప. 44), 'వుల్లిబుడ్డు' (ప. 37) లాంటివి మనకు దర్శనమిస్తాయి. కొన్ని శతకాల్లో అధిక్షేపం ఉంటుంది. ఆ అధిక్షేపం ఒక్కోసారి తీవ్రంగా ఉంటుంది. జంగయ్యగారి అధిక్షేపం పరిహాసం తెప్పించేదిగా ఉంటుందే గాని మనసు నొప్పించేదిగా ఉండదు.

వేదన పాలయిన మానవుడు తన ఆర్తి నివేదించుకోవటానికి సరియైన అవలంబం పరమాత్మ. సాటి మానవులతో నివేదించుకొంటే సానుభూతి ఎదురు కావచ్చు లేదా సానుభూతి ముసుగులో పరిహాసం పల్లవించవచ్చు. జంగయ్యగారు వేసిన పల్లవులన్నీ హృదయార్తిని బావుకోవటానికి. అయితే తనకేదో కావాలని కాని, పదవులకోసమని కాని ఆయన దేబిరించటం లేదు. సంఘంలోని అసమానతలు, వ్యక్తుల తౌల్యాలు, అధికారుల అహంకారం, పాలకుల పాశవ బుద్ధి, ఆయనను కదిలిస్తే ఆ కదలికకు చలించిపోయి ఈ రచన చేశారు. 'నా చేతనైన మాటల తోచే భావముల' నిన్ను స్తుతిస్తున్నానని ఆయన రామునితో మొరపెట్టుకున్నారు. లోకంలో కవికి కూడ ఎన్నో చిక్కులున్నాయి. కవి కొందరి దృష్టిలో సామాన్యుడైతే మరి కొందరి దృష్టిలో మహానుభావుడు. కవికి అధికారం లేనిది పేరు, ధనం రాదని జంగయ్య గారి అభిప్రాయం. ఇది నిజమే. అది జనం దృష్టి. కవి సృష్టి ఎలాంటిదైనా జనదృష్టి ఆ అంతస్తును అందుకోగలిగి ఉండాలి.

"కేవల కవిపండితులకు
రావలసిన పేరు ధనము రాదెట్లైనన్
కావలెనధికారమ్మది
ఆవంతైనన్ లభించనౌ కవి రామా!

కవి మనసున్నవాడు కావాలి. అధికారముద్ర లంతరిస్తాయి కాని రచనలు చెరిగి పోవు. జంగయ్యగారు కూడా పై విషయాన్ని లోకదృష్టితో చెప్పారు.

ఐదు పదులు నిండిన వయస్సులో వెనక్కి తిరిగి చూసుకుంటే ఆయన కెంతో సంతృప్తికలిగించే రచనా సంపద ఉంది. రచయిత తన అభిప్రాయాలు రచనల్లో నిక్షిప్తం చేస్తాడు. ఆ నిధి స్వాధీనం చేసుకున్నవాడు వెలిగిపోతాడు. జంగయ్యగారి రచనల్లో నిలిచేవి ఉన్నాయి. పాఠకుణ్ణి పిలిచేవి ఉన్నాయి. ఆయన వ్యక్తిత్వానికి సౌజన్య పరిమళం ఉంది. ఆ పరిమళాలు నలుదిక్కులా వ్యాపించాలని, ఆయన శతక జీవి కావాలని ఆశిద్దాం.

# 'కాంతి చక్రం'

—డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

కవిరత్న బిరుదాంచితులైన శ్రీ సీలా జంగయ్య గారు సహృదయ మిత్ర రత్నం కూడా. అచ్ఛమైన స్నేహంతో ఆర్ద్రమైన చిత్తంతో ఏ తెరలూ పొరలూ లేకుండ సూటిగా సుస్మితంగా మనస్సుతో మాట్లాడగలిగిన సౌజన్య మూర్తులు వారు. కవిత్వం విశ్వ కళ్యాణ సంధాయకం అనే గాఢ విశ్వాసంతో రచనా వ్యవసాయం ప్రారంభించి అటంకా లెన్ని ఎదురైనా అక్షర తపస్సు మానకుండ సారస్వత క్షేత్రంలో రసమయ కావ్య సస్యాలను పండిస్తున్న సాత్త్విక కృషీవలురు వారు. అహర్నిశలు కావ్య సృష్టిగావిస్తున్నా అణుమాత్రం కూడా అహంకారం లేని వినయ ధనులు. కొన్నేళ్ళుగా, వారు రచించిన అనేక కావ్యాలను పరిశీలిస్తూ వస్తున్నాను. ప్రస్తుతం ఈ వ్యాసంలో వారి 'కాంతిచక్రం' కావ్యంలోని కిరణాలను సమీక్షించడం నా కర్తవ్యం.

సమాజంలో పేరుకుపోయిన భావదాస్యాన్ని, ముసురుకు పోయిన అజ్ఞాన తిమిరాన్ని, పెక్కు ఇక్కట్లకు గురిచేసే దారిద్ర్య పిశాచినీ ధ్వంసం చేయడానికి తన వంతు బాధ్యతగా కవి పేరుడయిన జంగయ్య నిర్భయంగా జంగసాచి ముందుకు నడుస్తూ ఈ కవితాకాంతి చక్రాన్ని సృష్టించి ప్రయోగించినాడు. ధర్మ నిర్వహణలో దౌష్ట్య నిర్మూలనలో యథాశక్తి తనవద్ద ఉన్న అక్షర కిరణ పుంజాన్ని ప్రసరింపజేసి కర్తవ్యం నిర్వహించినాడు. ఆతని ఈ ప్రయత్నాన్ని సహృదయులు హర్షించగలరనే నా విశ్వాసం.

'కాంతిచక్రం' కావ్యంలోని ఖండికలు మొత్తం ముప్పై. శ్రీ జంగయ్య గారు బాహిరమైన రూపానికి ప్రాధాన్యం ఇచ్చేవారు కాదు. అందుకే ఆయనకు పద్యమైనా గేయమైనా వచన కవిత్వమైనా ఒక్కటే. కవిత్వం గుబాళిస్తే చాలు. అందుకే ఆతని అనేక కావ్యాలలోవలెనే ఈ 'కాంతిచక్రం'లో కూడా పద్యాలూ గేయాలూ వచన కవితలూ మహితభావ మయూఖాలై నిగనిగలను నిఖిల దిశల

వెదజల్లినవి. ఈ కావ్యంలో చంపూ సరణిలో సాగిన కథాత్మక ఖండిక లుండడం ప్రత్యేకంగా చెప్పుకోవలసిన అంశం. మరో విశేషమేమంటే-ప్రతి ఖండిక చివర ఉపదేశ గర్భితమైన ఒక గద్య సూక్తిని వెలిగించటం. పద్యంతో ప్రారంభమైన ఈ కావ్యం గేయంతో పరిసమాప్త మయింది.

"ప్రతివాని భాషా ప్రభావమ్ము లోకమైన
పలుకు తీరున భేదములు ప్రబలును"

అని 'నివేదన'లో శ్రీ జంగయ్యగారు అన్నట్లు కవుల గమ్యం ఒకటే అయినా గమనంలో వైవిధ్యం భాగించడం సహజం. ఇక ఈ కాంతిచక్ర గమనవైఖరిని దర్శిద్దాం.

శ్రీ జంగయ్య ఆధునికతను ఆహ్వానిస్తూనే సంప్రదాయ సౌరభాలను తన హృదయ పేటికలో భద్ర పరచుకునే అభ్యుదయ కవి; సమన్వయ శీలి. ఈ కావ్యంలోని మొదటి ఖండిక 'నివేదన'లో త్రిమూర్తి స్తుతి భాసించడం ఇందుకు నిదర్శనం. అంతేకాదు. కావ్యం 'శ్రీ'తో ప్రారంభం కావడం అనేది కూడా భారతీయాలంకారికులు నిర్దేశించిన లక్షణమే; మంగళ సంసూచకమే.

ఈ కావ్యంలోని ఎన్నో ఖండికల్లో శ్రీ జంగయ్యగారి వ్యక్తిత్వం బహుధా ప్రకాశిస్తుంది. అంచలా మంచిని గ్రహించటం, అందుకు సహకరించటం ఈ కవి స్వభావం. అందుకే - "విశ్వమానవ వృక్ష ఫల బీజము" మొలకెత్తి శాఖోపశాఖలుగా వర్ధిల్లి, సువర్ణసుమ ఫలశోభలనూ, మహానంద మధుకోశ తతులనూ, భృంగసంఘాన్ని ఆకర్షించే సుగంధాలనూ, రాగభోగాలనూ సమాజానికి అందించే 'నరతరువు'నే ఈ కవి సంస్తుతిస్తాడు. 'నరతరువు' చక్కని పద బంధం.ఈ పదబంధం మానవుడు తరువులా త్యాగమూర్తియై జీవించాలన్న ధ్వనిని గర్భీకరించుకున్నది. పదబంధ ప్రయోగంలోనే కవి వ్యక్తిత్వ ముద్ర విశ్వజనీనంగా భాసిస్తున్నది.

జంగయ్యకవి పేదల సుఖాన్ని కోరుతాడు. పేదవారిని సుఖపెట్టే మార్గం కనుక్కొని, వారికి భాగ్యాలు పంచి కీర్తిని పొందండని మల్లికా చంపకాది సుమాలను ప్రార్థించినాడు ఈ కవి రౌద్రిముఖతః 'రౌద్రిరాక' అనే కవితలో-చూడండి,

"మల్లియలార! మీ మనసు మంచిది; సంపెంగలార యట్లెమీ
యుల్లము చక్కనై వరలె నోజల జాతములార! పేదవా
రెల్ల సుఖించు మార్గములనెంచి సరాసరి పంచి భాగ్యముల్"

"అంధకారంలో దిక్కుతోచని జీవులకు ఆహారంగా" ఊహానక్షత్రాలను కోసి "మబ్బు పళ్ళేలలో నింపి" అందిస్తానంటాడు. పేదల నుద్ధరించడం విశ్వ కవి లక్షణమని వక్కాణించినాడు. అంతేకాదు పిరికివాళ్ళకు ఈ కవి అభయ ముద్ర నందించినాడు. ఇటువంటి స్వభావమున్న కవికి క్షతి చ్యుతి లేదన్నాడు. విలయంలో కూడా విశ్వరంగంలో గాలిపాటగా వ్యాపిస్తానన్నాడు. ఈ కవి గరుత్మంతునిలా 'కన్నవారి ఋణం' తీర్చి "కాలనాగు విషదంష్ట్రల్ని కలం కత్తితో" ముక్కలు చేస్తాడట; భూమిని ముద్దుపెట్టుకుంటాడట. అంతటి దేశ భక్తి ఈ కవిది.

"పాలను నీళ్లని చెప్పే— నీళ్ళను పాలని పలికే" నికృష్ట విద్యలు ఈ కవికి నచ్చవు. అట్టి విద్యల్ని తెగటారుస్తూ "అమృతాక్షరాలతో బ్రతుకు కథను సత్యంగా చిత్రిస్తాన్" అన్నాడు. ఈ సత్యంతోనే సమసమాజ నిర్మాణ లక్ష్యం వైపు ప్రయాణం సాగిస్తానంటాడు ఈ కవి.

జంగయ్య కవి గుణప్రభుత్వాలను ప్రశంసిస్తాడు. జగత్కల్యాణ కారకంగా కవులు ఘోషించే ఆదర్శసూత్రాలతో ప్రభుత్వాలు నడవాలని ఈ కవి ఆకాంక్ష. ఈ ఆకాంక్షను 'రౌద్రిరాక' అనే కవితలో వ్యక్తంచేసినాడు.

శాంతినీ అహింసనూ పెంపొందించాలని ఆరాటపడే మనస్తత్వం ఈ కవిది. ఈ కావ్యంలోని 'మహాకవిని' అనే ఖండిక ఇందుకు చక్కని ఉదాహరణం.

కళ్ళముందు కనిపించే సమాజాన్ని శ్రీ జంగయ్య మరచిపోలేదు. సంఘాన్ని పీడించే దుర్లక్షణాలను ఎన్నో ఖండికల్లో ఎత్తిచూపినాడు. వర్తమాన సంఘంలో కవులపట్ల ఆదరణ సన్నగిల్లుతున్నదని బాధపడ్డాడు. ఈనాడు ఆలయాల్లో జరుగుతున్న దొంగతనాలను చూసిన ఈ కవి గుడికట్టకుండ 'నుడిగుడి' కడతానంటాడు. పతకాన్నికి బదులు ఈ కవి దేవునికి పాటను ఇస్తానంటాడు.

అనుదినం పెరుగుతున్న వస్తువుల ధరలను చూసి ఈ కవి ఆందోళనను వ్యక్తం చేసినాడు. పప్పుతో సమానంగా ఉప్పు ధర పెరగడం సమానత్వ సంకేతమని వ్యంగ్యంగా అధిక్షేపించినాడు. ఉన్న చెట్లను నరికి, వనమహోత్సవం పేరుతో కొత్త మొక్కల్ని నాటడం చూసి ఈ కవి ఆవేదనను వ్యక్త పరచినాడు. మనదేశంలో స్వార్థం పెరిగిపోతున్నదని గణపతి నోట శివునికి చెప్పించినాడు ఈ కవి 'గణపతి నివేదన'లో దేశంలోని బ్లాకు మార్కెటింగ్ దురాచారాన్ని స్వయంగా గణపతి చూసి శివునికి నివేదిస్తాడు. వివిధ రంగాలలో ప్రగతితోపాటు, బాధల్లోనూ నిరుపేదల్లోనూ రోగాల్లోనూ రోగుల్లోనూ భిక్షుకుల్లోనూ అభివృద్ధి కనిపిస్తున్నదట !

భావ సౌందర్యం లేకపోతే ఏ కావ్యమూ రాణించదు. ఈ 'కాంతి చక్రం'లో సుందరతా బంధుర భావరేఖలెన్నో మెరుస్తూ కనిపిస్తాయి. తార్కాణానికి కొన్నింటిని ఇట పేర్కొంటాను. జీవులు - "కూలే గోడలకున్ తగిలించిన మేలిమి చిత్రాల" వంటి వారట. "ఏ చిత్రరజాంకుర మీధాత్రిని - కాచితరింపగజేయునొ తెలియము" అంటూ మహితాత్ములను మన ఊహకే వదలివేసినాడు. తంగెడు పూలు పేదలకు హారసులట. ఎంత సహజంగా ఉంది !

1980 లో సంభవించిన సూర్యగ్రహణాన్ని ఈ కవి "సూర్య చంద్రమ"ల పాణిగ్రహణంగా భావించి వర్ణించినాడు.

"సూరయ్య చంద్రమను కూడెనా యనగ
చూడ చంద్రమయౌచు తోచె సూరయ్య".

దర్శనం వర్ణనం రెండూ సమంగా సాగితేనే కవిశక్తి ప్రస్ఫుటమవుతుంది. ఈ రెండు శక్తులు శ్రీ జంగయ్యగారిలో చక్కగా కుదురుకున్నాయి. ఉదాహరణకు ఈ కావ్యంలోని 'చుక్కలు' అనే కవితను గ్రహించవచ్చు.

"దినకరాగ్నుల క్రాగు దివియను పెనము నందునవేగు" పేలాలో;
"అవనీరుహాగ్ర శాఖానంద సుమము"లో;
"ప్రకృతిభామా కేశపాశాన కూర్చిన శోభాప్రసూనమంజులత"లో;
"విశ్వహర్మ్యన బర్వెన రత్నతతి"యో;
"ధరణిబాసి దివిరహించు జనప్రాణదీపము"లో;

"నా (కవి)లోపల వరలి విరియు నవరస భావము"లో;
"కవితానంద యశోలత కాచిన ఫలచయమో"

"సర్వలోక జీవుల యుచ్ఛ్వాసము"లో; - అన్నట్లు ఆకాశంలో అందంగా చుక్కలు ప్రకాశిస్తున్నాయట. చుక్కలను పెక్కు రకాలుగా దర్శించిన ఈ కవి భావనాశక్తి ప్రశంసనీయం.

పద్యాన్ని ఎంత చక్కగా వ్రాయగలడో గేయాన్ని కూడా అంత పటుత్వంగా ధారామహితంగా నడిపించగలడు జంగయ్య. ఉదాహరణకు ఈ కావ్యంలోని 'కాంతిచక్రం' కవితను చూడవచ్చు. మచ్చుకు కొన్ని పంక్తులు.

"కాంతిచక్ర గమనమ్మును - కన్నదెవరు ప్రకృతిలో
కదలీ కదలని దైతిరు - గాడు గమ్యమదిగో"
"జీవసరాగానంద - శ్రీకరమై వెలిగే
చిన్మయరేఖామయూఖ - జీవనమైసాగే" ॥కాంతిచక్ర॥

"ఖగోళాల పరిభ్రమణ - కారణ చేతనమై
ధగద్ధగిత దీప్త భాను - తాపశిఖోన్నతమై" ॥కాంతిచక్ర॥

"చలజ్జలద చకచ్చకిత - చంచలాత పత్రమై
కాంచమాన రూపమహో - క్రాంతిహీర హారమై" ॥కాంతిచక్ర॥

వచనకవితా గమనం పద్యగేయాల్లా సాగడానికి ఆస్కారం ఉండదు. దాని తీరేవేరు. ఈ కావ్యంలోని వచన కవితలు సరళంగా సుగమంగా సాగినాయి.

శ్రీ జంగయ్య ఆశావాది. మంచి మనస్సుతో పయనించే మానవుని ఆకాంక్షలు నెరవేరుతాయని ఈతని ప్రగాఢ ప్రత్యయం. ఈ క్రింది పంక్తులిందుకు నిదర్శనం.

"ననుగన్న దైవ మొకడు వెన్నంటి చూడలేడా
కాలమ్ము మారకున్నె నా కాంక్ష తీరకున్నె
మంచెన్ను తీరులోనె పయనించు మనిషికేలా
కష్టాలు బాయకుండు - ఇష్టాలు దీరకుండు"

ఈ కావ్యకాంతి చక్రగమన వేగంలో అగ్నికణికల్లాంటి సూక్తులు తాత్త్వి కతా మహితంగా చెదరిపడి మిరుమిట్లు గొలుపుతున్నాయి. చూడండి కొన్నింటిని.

"చెల్లే లేకున్న బతుకు - చిచ్చున బూడిదగాదా"
"శ్రుతిహీనంబైనవీణ - సుందరముగ నున్ననేమి?
రాగలయల విరియమీటి రాజిల్లునె వైణికుడు?
"కవిత్వాల మహిమనెంచగల జనాలు లేనప్పుడు
ప్రజల మధ్య సుకవి వెర్రిబాగులవాడై పోడా"
"అది పంచదార చిలకేయైతే
ఎటు కొరికి తిన్నా తీపే కలుగుతుంది"
"చేరిన చోటే గమ్యం - ఆగనిచోటే అంతం"

'రౌద్రిరాక' అనే ఖండికలో ఈ కవి ముక్తపదగ్రస్తాన్ని ప్రయోగించి నాడు. అక్కడక్కడ అఖండయతిని కూడా ప్రయోగించినాడు. భావావేశంలో రసోద్వేగంలో పద్యవాహిని తరగెత్తినప్పుడు వ్యావహారిక శబ్దాలు కూడా అందులో కలిసి పరుగెత్తినవి. శబ్దాలలోనే కాదు కొన్ని సంధుల్లో ప్రాసయతుల బంధాల్లో కూడా ఇదే జరిగింది. అయినా అర్థసిద్ధికి ఎక్కడా లోపం కలుగలేదు.

"చెడును బాగుపరచలేనప్పుడు
మంచినైనా వంచించకుండా ఉండాలె
అదీ చేతగానప్పుడు నోరుమూసి
కొనైనా ఉండాలె"—

అనీ, మంచి భావాలున్న ధీమంతులదే బలవంతులదే ఈ దేశం అనీ, మనిషిని సంస్కరించే సిద్ధాంతాల కోసమే మనం బ్రతకాలనీ, పరస్పరావగాహ నతో సుహృద్భావంతో మనుగడ సాగించాలనీ ఈ కావ్యం ద్వారా సందేశాత్మక మైన తమ ఆకాంక్షను అభివ్యక్తం చేసినారు శ్రీ జంగయ్యగారు. 'కాంతిచక్రం' రచనాధ్యేయం విశ్వశాంతి సముపార్జనమే. శాంతిమార్గం ద్వారానే కల్యాణం సమకూరుతుందనే సత్యం మానవోత్తములందరూ రకరకాలుగా బహుముఖాలుగా ఘోషించిందే.

సారస్వత రజతోత్సవాన్ని జరుపుకున్న శ్రీ జంగయ్యగారు స్వర్ణోత్స వాన్ని కూడా విజయవంతంగా జరుపుకోవాలని ఆకాంక్షిస్తున్నాము.

# ఆకాంక్ష

డా॥ బూదరాజు రాధాకృష్ణ

జంగయ్యగారితో నాకున్న మైత్రికి మైనారిటీ తీరిపోయింది. యుక్తవయస్సు వచ్చిందని ఆనందిస్తున్న సమయంలో తమ 'కాంతి చక్రము' ఖండ కావ్య సంపుటిని చేతికిచ్చి నా అభిప్రాయం రాయక తప్పదని ఆయన పట్టుబట్టాడు. 1981 లో ప్రచురించిన కావ్యాన్ని 1989 లో పరిశీలించటం భావ్యం కాదన్నా. దేశకాలాలు నిర్ణయించవలసిన సారస్వత ప్రతిష్ఠను ఒక్క సాధారణ వ్యక్తి నిగ్గుదేల్చ లేడన్నా. ఆయన వినలేదు.

నిజమే మరి. కుల మత ధనాధికార పదవీ ప్రాబల్యాలతో సాహిత్య ప్రపంచంలో స్థానం సంగ్రహించే కాలంలో అవేవీ లేని జంగయ్యగారు అవన్నీ ఉన్నవారి నుంచి కితాబు సంపాదించలేక పోయారేమో! తెలుగు సాహిత్య విమర్శను సొంత ఆస్తిగా భావించి, తమ అభిరుచుల ప్రకారం స్థాన నిర్ణయం చేయగల పీఠాధిపతుల ప్రాపు దొరక లేదేమో! మిత్ర ధర్మంగా ఈ సాధుజీవి రచనను గురించి రెండు మాటలు రాసి ప్రోత్సహించ లేకపోయినా శుభాకాంక్షలు చెప్తే తప్పేముందనిపించింది. అధికారం లేని విషయంలో అభిప్రాయ ప్రకటన యుగధర్మమై పోయింది కాబట్టి 'నలుగురితోబాటు నారాయణ' అన్నట్లు నాలుగు మాటలు రాస్తున్నా.

వ్యక్తినీ వ్యక్తిత్వాన్నీ వైయక్తిక రచనలనూ వేరుచేసి చూడలేకపోవటం నా బలహీనత. ఒక దుర్బలుడు మరో దుర్బలుణ్ని ఆశ్వాసించటం లోక సహజం. ఆ దృష్టితో నా మాటలు వినండి. 'కవుల గొప్పతనము కనుపించు రచనలో' అని జంగయ్యగారు 'నివేదన'లో రాశారు. అయినా 'ఒకని ముఖం-మరొకని కర్ద'మనే భ్రాంతి పోగొట్టుకోలేదు. శతాధిక సన్మానాలుపొందినా తనను గురించీ, తన రచనలను గురించీ లోకు లేమనుకుంటున్నారో తెలుసుకోవాలనే తపన పోలేదు. ఒక్కటి నిజం. జంగయ్యగారు భాషా విషయంలో ప్రయోగ

పద్ధతిలో సర్వతంత్ర స్వతంత్రులు. ఆయన క్లుప్తంగా రాసినప్పుడే భావస్ఫోర కంగా రచిస్తారని నా అనుభవం. రాసిన ప్రత్యక్షరం రమణీయార్థ ప్రతిపాది కంగా ఉంటుందని ఎవరి విషయంలోనూ చెప్పలేం. ఏ ఒక్కరిద్దరో తప్ప సార్వకాలికంగా సర్వజనామోదకరంగా రాయలేరనేది వాస్తవం. బౌద్ధులు సారస్వత మహాకాయ మనేది ఉందనీ, చిన్నా పెద్దా తారతమ్యం లేకుండా ఎందరో చేసిన కృషి ఫలితంగా మాత్రమే సాహిత్య సృష్టి జరుగుతుందని విశ్వసిస్తారు. అలాకాక జనాభా లెక్కలు ఒకే వ్యక్తి మాట్లాడే భాషలున్నాయని చెప్పినట్లు, ఏక మహాకవి రచనలే ఉపాదేయ మనటం అసంచర్యం.

కవిత్వ మొక తీరని దాహమని శ్రీశ్రీ చెప్పాడు. అది తీరని వ్యసనమని జంగయ్యగారు నిరూపిస్తున్నారు. పసిపిల్లల కథల నుంచి వేదాంత చర్చల దాకా సమస్తం జంగయ్య లేఖినికి కవితా వస్తువయింది. సంతోషం. ఆయన రచన లన్నిటినీ పరిశీలించి, వ్యక్తి వికాస కవితా వికాసాలను నిరూపించకుండా ఏకదేశ మయిన రచనను పరీక్షించి ఆయనకు సాహిత్యంలో ఉన్న, ఉండే స్థానాన్ని నిరూపించే సాహసం చేయదలచలేదు. అయినా ఆయన కావ్యప్రపంచం విస్తరిల్లా లనీ, ఇతోధిక గుణవంతంకావాలనీ ఆకాంక్షిస్తున్నా. ఆయనే అన్నట్లు 'చేరినచోటే గమ్యం - ఆగినచోటే అంతం'! ఆయనకు మేలుకలగాలని అపేక్షిస్తున్నా.

# లౌకిక తాత్త్వికవాదాల సహజీవనం జంగయ్య దర్శనం

- జి. వి. సుబ్రహ్మణ్యం

> "నాకొక రూపొసంగి కరుణన్ మధుజీవన మిచ్చి పెంచితీ
> వో కమలాక్ష! విశ్వనుత ఓ నవభావ సముజ్జ్వల ప్రభూ!
> నీకయి గుండె తంబురను నిర్మల నాదము లీన మీటితిన్
> రా! కయిసేయ రా కవిత రాగవసంతము లంది యాడగన్."

ఈ పద్యం శ్రీ నీలా జంగయ్యగారిది. దర్శనమనే ఖండకావ్య సంపుటి ఈ పద్యంతోనే మొదలౌతుంది. ఆ ఖండకావ్య శీర్షిక 'పల్లవింతు'. గుండె తంబురా మీటే శ్రీ నీలా జంగయ్యగారు వస్తుతః తత్త్వకవిలా గోచరిస్తారు. ఆయనలో కొన్ని వేమన పోకడలున్నాయి. అవి వేదనపడుతున్నప్పుడు పద్యాల్లాగా బైటపడుతుంటాయి. మరికొన్నిసార్లు పోతులూరి వీరబ్రహ్మం, సిద్దప్పల్లాగా ఏకాంతంలో ఆత్మచింతనలో మునిగే లక్షణాలూ, కాలంలోకిచూచి తత్త్వాలు పలికే వైఖరులూ కనపడతాయి జంగయ్యగారిలో. అయితే, వారికీ వీరికీ కొట్టవచ్చినట్లు కనపడే పెద్ద తేడా ఏమిటంటే - వారు జీవితంలో తిరిగి తిరిగి, కాచి వడబోసిన అనుభవాలనూ, చూచి సమీక్షించిన సత్యాలనూ విరక్తులై వెలువరించారు. శ్రీ నీలా జంగయ్యగారు విరక్తులుకారు, జీవిత రక్తులు. వీరు నాగరక జగత్తులో తిరుగుతున్నారు. మనిషిలోని నలుపు తెలుపులను చూస్తున్నారు. ఆ రెండింటికీ నడుమనున్న సంబంధాన్ని బుద్ధితో ఊహిస్తున్నారు; మనసుతో వ్యాఖ్యానిస్తున్నారు. వేమనాదులు ముఖ్యంగా తత్త్వ దృష్టిని వ్యక్తంచేసేవారు. వారికి కవిత్వం ఒక వాహిక; ఉపకరణం; ప్రచారసాధనం. కాని జంగయ్యగారు ముందు కవిగా ఆతరువాత తాత్త్వికుడుగా కనపడతారు. వేమనాదుల రచనల్లో తత్త్వం వెంట కవిత నడుస్తుండే - నీలా జంగయ్యగారి రచనల్లో కవిత్వం

వెంట తత్త్వం అనుసరిస్తున్నట్లుంటుంది. తత్త్వ కవిత్వాన్ని కవితత్త్వంగా జీర్ణించుకొని, కవితా తత్త్వంగా దర్శించే కవి శ్రీ నీలా జంగయ్య. అందుకే 'దర్శనము' అనే కావ్యాన్ని వెలువరించారు.

ఈ కావ్య సంపుటిలో 'దర్శనము' అనే శీర్షికతో ఉన్న ఖండకవిత కేంద్రబిందువుగా ఉన్నది. దాన్నే కవి గ్రంథ నామంగా ఉంచాడంటే దాని ప్రాధాన్యం వేరే చెప్పవలసినపనిలేదు. ఎత్తుకొన్నది శివపార్వతుల ప్రణయగాథ; చెప్పదలచుకొన్నది కవితాతత్త్వబోధ. ఇదీ జంగయ్యగారి దర్శనం. జీవితాన్ని, తత్త్వాన్ని కవితాతత్త్వం వైపు నడిపించే మార్గం వారి దర్శనం.

"తనను తాజూచు కొనగ దుస్తరమునౌట
ప్రకృతిలో బింబమై వెల్గు వాని పోల్కి
కావ్యమది కవిరూపమై గణుతి గాంచు
సోయగమ్ములు లావణ్య సుమము లగుచు."

ఇది ఈ ఖండకావ్యానికే కాదు ఈ కవితా సంకలనానికీ ఆత్మభూతమైన దర్శనం. తైత్తిరీయోపనిషత్తులో చెప్పినట్లు ప్రకృతిలో పరమాత్మ తత్త్వం ప్రతిఫలించి ఉంటుంది. దానిని దర్శించటమే దర్శనం. ఆ తరువాత ఆ తత్త్వమే తన ఆత్మతత్త్వమని అనుభవించటం జీవిత గమ్యం. ఆ గమ్యం చేరటానికి ముందు ఈ దర్శనం అవసరం. అలాగే కావ్యమనే ప్రకృతిలో ప్రతిఫలించేది కవి రూపమే. కవి యొక్క వ్యక్తిత్వం, దానినుండి వెలువడే దర్శనం, దానినుండి ఉద్భవించే ప్రక్రియ; తదనుగుణంగా ప్రసరించే రూపం, తత్పోషకంగా సాగే కళాసౌందర్యం ఇవన్నీ కవి నుండి పుట్టినవే. దాన్నిబట్టి కావ్యమంటే కవిరూపమునే దర్శించాలని నీలా జంగయ్యగారి ప్రబోధం. అయితే, కవి అంటే కవి యొక్క కవితా దర్శనమే అని అర్థంకాని, భౌతికాకారం కాదు. ఈ ఖండ కావ్యంలో శివపార్వతుల ప్రణయాన్ని వర్ణిస్తూ శ్రీ నీలా జంగయ్యగారు తమ కవితా తత్త్వాన్నీ, దర్శనాన్నీ రమణీయంగా, వ్యంగసుందరంగా అభివ్యక్తీకరించారు. వారే చెప్పినట్లు—

"కవి మహారస భావజలధుల గాంచి ఈదిన కారణమ్మున
కావ్యమై రాజిల్లె నీగతి కమ్మనగు దుగ్ధమ్ము పోలిక."

ఈ కావ్య సంపుటిలో ముప్ఫై మూడు ఖండికలున్నాయి. వస్తువులను ఎన్నుకోవటంలో కవి ఎంతో వైవిధ్యాన్ని ప్రకటించాడు. వస్తు వేదైనా అందులో వస్తు తత్త్వాన్ని దర్శించటమే జంగయ్యగారి ప్రవృత్తి. ఉదాహరణకు ప్రతిజ్ఞలో మొదటి పద్యం.

"హృదయమున ప్రశ్న యొక్కటి ఉదయమయ్యె
అంతుపట్టని ప్రకృతికి - అయ్య ఎవడు
అతని గన్న మహాశక్తి కాదిదైవ
మెవ్వరీ ప్రశ్న సన్నాయ కేడిపించు"

ఇది పైకి తేటగీతి పద్యమైనా అనవరతం కవి హృదయంలో జ్వలించే తాత్త్విక చింతన. ఇంత చింత ఉన్నవాడు సహజంగా యోగికావాలి; తాత్త్వికుడుగా వేదాంతిగా మారిపోవాలి. నీలాజంగయ్యగారు అలాకాకుండా మనలకు ఆయనను దక్కించచేసింది కవిత్వం. ఆలోచిస్తూ, అన్వేషిస్తూ ఆత్మవైపు నడిచి పోయేవాడు యోగి, ఆలోచిస్తూ, కవితగా ఆవిష్కరిస్తూ- సమాజంవైపు నడిచి పోయేవాడు కవి. నీలాజంగయ్యగారు యోగి కాబోయి దారితప్పివచ్చిన కవి. అందువల్లనే తాత్త్విక చింతనతోపాటు అభ్యుదయ భావాలను కూడా ప్రకటించి ప్రపంచ పరిస్థితులను సమీక్షిస్తుంటాడు. కవి లోకంతో యోగించకుండా, తత్త్వంతో యోగించలేడు. శ్రీ నీలా జంగయ్యగారి అభ్యుదయ భావాలిలా ఉంటాయి.

"మానవోన్నతి కాదర్శమానమయ్యు
సమసమాజ సమున్నత సరణినెంచి
కళలు కవితలు నవయుగాభ్యుదయమునకు
జయ జయ ధ్వాన రవములు సల్పుగాత!"

"కూడు లేక నిలువ నీడ
గూడు లేక తరతరాలు
వెనుకబడిన జనమంతా
విధిగ నేడు కదలాలి!
ఒక్కడెవడొ ప్రకృతి ధనము
మెక్కకుండ చూడాలి".

ఇలా ఎన్నోచోట్ల శ్రీ జంగయ్యగారు అభ్యుదయ భావాలను ప్రకటించారు. అయితే ఆదర్శ అభ్యుదయవాదాలు వారి దర్శనంలో అన్యోన్యంగా అందగించుకొని ఉంటాయి.

శ్రీ నీలా జంగయ్యగారు పద్యం, గేయం సవ్యసాచిలా నడపగలరు. పద్యంలో పరిపక్వమైన శైలి కనపడుతుంది. ఈ క్రింది పద్యాలు చూడండి.

"చచ్చెడు శాంతికై జన మచంచల దీక్ష ఘటించి భూమిపై
పిచ్చిగ ఘోరయుద్ధములు భీకర యోద్ధలునై యొనర్తురి, వా
రెచ్చట నైన శాంతి గని ఈ భువి సీమల నిల్పజాలిరే
పెచ్చుగ లేని దాని కయి పెద్దగ గోరి నశింత్రు మానవుల్".

"ఏబది కోట్ల భారత జనేచ్ఛకు దీపము, జీవనాడి, స్వే
చ్ఛాబల శాంతి సత్యగుణ శౌర్యవికాసము రమ్యకీర్తివి
ద్యా బహుమాన పత్రము, విధాతృ సమంచిత సృష్టి వాటిలో
రేబవ లద్భుతమ్ముగ చలించు త్రివర్ణ పతాక మెంచెదన్".

కవితా వేశాన్ని ధారగా పోగించగలిగే నేర్పూ, భావావేశాన్ని వాక్య విన్యాసంతో వ్యక్తీకరించే నేర్పూ, శబ్దార్థాలను ఆసక్తిజనకంగా కూర్చే నేర్పూ ముప్పేటగా ఈ పద్యాల్లో పెనవేసుకొని ఉన్నది. పద్యంలో సూక్తిని చిత్రించటం జంగ కవిగారి జీవ లక్షణం.

ఎట్లు పల్కినా డన్న దదేమి వలదు
ఏమి చెప్పిన దన్నదే యిపుడు వలయు
ఏదా చేస్తున్న హాడన్న దేమికాదు
ఏమి చేస్తున్న దన్నదే ఇపుడు వలయు".

శ్రీ నీలా జంగయ్యగారు ఒకే దృక్పథంతో ఒకే బాటలో నడిచేవారుకారు. తాను నివసిస్తున్న కాలంలోని అన్ని భావాలనూ అవగాహనచేసికొని, అన్వయించుకొని, స్పందించి, విశ్లేషించి, విమర్శనాత్మకంగా వివేచించి, తన ప్రతిస్పందనను వ్యక్తం చేయటం వారి లక్షణం. వీరు అందరిలో తిరుగుతారు; అన్నింటినీ వింటారు. అన్నింటికీ స్పందిస్తారు; కాని, తన అరగన్నుల తాత్త్విక దృష్టితో దర్శించి, తనకు నచ్చింది నిర్మొగమాటంగా చెపుతారు. లౌకిక తాత్త్విక వాదాల సహజీవన యోగం శ్రీ జంగయ్యగారి దర్శనం.



# కవితా రసోదయం

- శ్రీ పింగళి జగన్నాథరావు
ఎం. ఏ;ఎం. వో. ఎల్.

సుమధుర కవితోద్యాన సుందర సీమల్లో నిరంతర భ్రామితుడై నిత్య వసం[illegible] మధుర కవి వరేణ్యులు మా నీలా జంగయ్యగారు. తన కవితా పుష్పాలతో కమనీయ కంఠహారాలు రచించి, తెలుగు శారదను కైసేసిన మాలికుడాయన. పద్యమైనా, గద్యమైనా, సహృదయ హృద్యంగా చెప్ప గలిగిన ఆ కవిరత్నం రచించిన "కవితా-రసోదయం" వ్యాస సంపుటిని చదివి నప్పుడు నాలో కలిగిన అభిప్రాయాలే ఈ సమీక్షా వ్యాస సమాలోచనలు

ఏక సూత్రత కలిగిన అంశమేదో తీసుకొని వ్యాసరచనం చేయడంతో పాటు, తోచిన విభిన్న విషయాలపై తమ మనస్సులో మెదిలిన భావాలను వ్యాసాలుగా వ్రాసే సంప్రదాయం కూడా మన రచయితలలో కానవస్తుంది. అలాంటి కోవకు చెందినదే ఈ వ్యాస సంపుటి కూడ.

ఈ సంపుటిలోని వ్యాసాలు మొత్తం పన్నెండు. అవి వరుసగా 1. భారత కల్పవృక్షం-వసుమతీ వసంతం. 2. గురు ప్రతీక-విద్యా గంధం. 3. విశ్వంభర చదివిన తరువాత. 4. ముఖం చూసి బొట్టు పెట్టడం. 5. అజా గ్రంథమాల ఉద్యమం. 6. పద్యమే కవిత్వం. 7. కవితా రసోదయం. 8. దేశోద్ధారక గ్రంథమాల. 9. పురోగామి-తిరోగామి. 10. భారతీయుడు సృష్టించిన విమానం కథ. 11. ప్రసిద్ధ నృసింహ క్షేత్రాలు. 12. ఉండేల కవితా గాండీవం అన్నవి. విద్యావేత్తలూ, వినయ శీలురూ ఐన శ్రీ చల్లా సోమరాజారావు గారికి ఈ గ్రంథం అంకితం చేయబడింది.

ఈ వ్యాస సంకలన గ్రంథంలోని మొదటి వ్యాసం "భారత కల్ప వృక్షం - వసుమతీ వసంతం" అనేది. ఈ వ్యాసంలో ఆంధ్ర మహాభారతా

వతరణం, ఆంధ్ర వసుమతికి వసంతోదయమన్న అభిప్రాయం వ్యక్తం చేయబడింది, గ్రంథ రచనలో నన్నయ ప్రదర్శించిన నేర్పు, ఆయనలో గల లోకజ్ఞత మొదలగు అంశాలతో పాటు మహాభారత ప్రశస్తిని కూడా వివరించటం జరిగింది. "శ్రీ వాణీ గిరిజా శ్చిరాయ" అన్న ప్రారంభ శ్లోకంలో నన్నయ త్రిగుణాత్మకమైన ప్రకృతిని కొలిచినవాడన్న విషయాన్ని రచయిత విపులంగా వివరించారు. కవిత్రయం అనువదించిన భారత కథ; వైశంపాయనుడు. జనమేజయునికి చెప్పినదిగా" ఆంధ్ర మహాభారతం వలన తెలుస్తున్నది. కాని ఈ వ్యాసకర్త నన్నయ భట్టు వ్యాసప్రోక్త భారత ప్రతినే అనుసరించి, భారత రచనం చేసినాడని వ్రాసినారు. దానికి ఉపబలకంగా వారు చూపించిన అంశం నన్నయ్య వ్యాస భారతంలోని నూరు పర్వాలను పేర్కొని, వాటిని తానెట్లు పదునెనిమిది పర్వములుగా సంగ్రహించినాడో చెప్పడం. దాన్ని దిఙ్మాత్రంగా కాకుండా మరింత స్పష్టంగా నిరూపించి ఉంటే, బంగారానికి పరిమళం అబ్బినట్లుగా ఉండేది. నన్నయ ఆదికవి అనటానికి అనుశృతంగా ఆంధ్ర కవులు తమ గ్రంథాలలో చేసిన కవిస్తుతి ఒక ఆధారమని జంగయ్యగారన్న మాట యథార్థమే. "మహాభారత పారిజాతము" అన్న నన్నయ్యగారి వాక్యంతోపాటు 'భాగవతాఖ్య కల్పతరువు" అన్న పోతన్నగారి మాటను కూడా దృష్టియందుంచుకొని ఆధునికులైన విశ్వనాథవారు తమ రామాయణ కల్పవృక్షమునకు ఆ పేరు పెట్టిరి. అని చెప్పుట చాల యుక్తి, యుక్తముగా ఉన్నది.

రెండవ వ్యాసమైన "విద్యా గంథము"లో భారతీయ విద్యా వైశిష్ట్యాన్ని దానిలో గురువుకుగల ప్రాముఖ్యాన్ని చక్కగా వివరించటం జరిగింది. అంతేకాక విద్యలనుండి వంచనా ప్రయోజనాన్ని సాధించే వారిని గురించి నేటి కాలంలో అవిద్యలు విద్యలుగా చెలామణీ కావటాన్ని గురించి కూడా వ్రాశారు వ్యాసకర్త. విద్య గురువులాంటిది, సద్గురు స్మరణలేని విద్యలు వృద్ధికావు అన్న మాటలు అక్షరాలా నిజము.

"అణా గ్రంథమాల ఉద్యమం," దేశోద్ధారక గ్రంథమాల" అన్న వ్యాసాలు రెండూ ఒకనాటి నిజాం రాష్ట్రంలో తెలుగు పుస్తకాల ముద్రణను, ప్రచారాన్ని వృద్ధి పొందించిన శ్రీ కె.సి. గుప్త, కీర్తిశేషులు వట్టికోట ఆళ్వారు స్వామిగార్ల సాహిత్య సేవను వివరించటమే కాక అప్పటి తెలంగాణాలోని తెలుగు

సారస్వత పరిస్థితిని కన్నులకు గట్టినట్లు చెప్పిన వ్యాసాలు. ఆళ్వారు స్వామిగారి లాంటి మహా వ్యక్తులను గురించీ, వారి త్యాగబుద్ధిని గురించీ ఏ మాత్రం తెలియని నేటి యువతరం వారికి, వారిని పరిచయం చేయడంలో కృతకృత్యులయ్యారు వ్యాసకర్త. ఆంధ్ర దేశములో వైశ్య సంఘాభ్యుదయానికి పాటు పడటంతోపాటు, సారస్వత సేవనూ తద్వారా దేశసేవనూ చేసిన మహావ్యక్తులు శ్రీ కె. సి. గుప్తగారు.

ఆణా గ్రంథమాల ఉద్యమం ఎలా నిర్వహించబడిందో తెలియచేయటం వల్ల గ్రంథ ప్రచారోద్యమం చేపట్ట దలిచిన సాహితీ మిత్రులకు అందులోని మెలకువలను స్ఫురింపచేసే ప్రయత్నం చేసిన మూర్తిదృష్టి ఐంగయ్యగారిది. జంట నగరాలు కేంద్రంగా ఆంధ్ర దేశంలో గొప్ప సాహితీ సంచలనం సృష్టించిన యువభారతిలాంటి సాహితీ సంస్థలు, పుస్తక ప్రచురణ పూర్వ విరాళం లాంటి పద్ధతులను నెలకొల్పటం ఆ విధానాలు ఫలప్రదం కావటం గమనించదగ్గ విషయం.

"పద్యమే కవిత్వం" అన్న వ్యాసంలో ఛందోబద్ధమైన ఒకానొక లయమే కవిత్వానికి శాశ్వతత్వాన్ని కలిగిస్తుంది అన్న అభిప్రాయం వ్యక్తం చేయటం జరిగింది. ఇది చాలా సమంజసమైన అభిప్రాయం. ఎందుకంటే "గద్యం కవీనాం నికషం వదంతి". అన్న ప్రశస్తి గద్యానికిఉన్నా పద్యమే బహుళ జనాదరణం పండితులలో పొంది మనగల్గటంతోపాటు జానపదులలో కూడా లయాత్మకతమైన గేయమే లుప్తంకాకుండా రక్షింపబడుతుండటం. దీనికి నిదర్శనం.

"కవితా రసోదయం" అన్న వ్యాసం పేరే ఈ గ్రంథానికి పెట్టడం జరిగింది. దానిలో రచయిత కవిత్వం శాశ్వతమైనదని చెప్తూ, రసం అనేది పఠితలకు ఎలా ఆనందం కలిగిస్తుందో అది ఎలా ఉత్పన్నమవుతుందో చక్కగా వివరించారు. లోకంలో కవిత్వం ఒక్కటే దైవాంశ కల్గిన చైతన్య శక్తి అనీ కవితా రసోదయం జరగాలంటే ప్రతిభా, సౌందర్య, ధైర్యాలు మూడూ ఉండాలని ఈ వ్యాసంలో రచయిత అభిప్రాయ పడ్డారు. "ఈ సృష్టిలో స్త్రీ పరంగా విస్తరించేది సాంఘికం. ధనపరంగా వ్యాప్తిపొందేది రాచరికం. ఈ రెండూ చరిత్రాంశాలే". ఇలాంటి కొన్ని వాక్యాలు అద్భుతంగా చెప్పగల్గటం ఐంగయ్య

గారికే చెల్లుతుందా అనిపిస్తుంది. కాంతా కనకాలే చరిత్రలకూ, ఇతిహాసాలకూ మూలం అన్న ఈ మాటలు పరమ సత్యాలు. అలాగే భగవంతుడంటే ఎలాగుంటాడో చెప్పటం ఏ విధంగా సాధ్యం కాదో, కవిత్వమంటే కూడా ఎలా ఉండాలో చెప్పటం సాధ్యం కాదు అంటారు జంగయ్యగారు. కవితా స్వరూప వైశిష్ట్యాన్ని వివరించటానికి ఇంతకన్న గొప్ప నిర్వచనం ఇంకేముంటుంది !

"పురోగామి-తిరోగామి, "భారతీయుడు సృష్టించిన విమానం కథ" అన్న వ్యాసాల్లో తాను, కూడా గాలిలో ఎగరవచ్చు అన్న ప్రేరణ మానవునికి ఎలా కలిగిందో అనేక ఉదాహరణలతో చెప్పటంతో పాటు కర్ణాటక రాష్ట్రీయుడైన యస్వీ శ్రేష్ఠిగారు రైటు సోదరులకంటేముందే విమానాన్ని తయారు చేశారన్న విషయాన్ని మనకు క్రొత్తగా తెలిపారు వ్యాసకర్త. ఇది భారతీయులు గర్వించదగ్గ గొప్ప విశేషమే మరి.

"ప్రసిద్ధ నృసింహ క్షేత్రాలు" అన్న వ్యాసం జంగయ్య గారిలోగల పరిశోధనాసక్తి, బహుగ్రంథ పరిశీలనం అన్న ఉత్తమ గుణాలకు నిదర్శనం. తెలంగాణంలోని యాదగిరి క్షేత్ర ప్రాచీనతనూ దాని పురాణ ప్రసిద్ధినీ చక్కగా వివరించడంతో పాటు, వేల్పుగొండ క్షేత్ర విశిష్టతనూ అక్కడి దుర్గ నిర్మాణం మొదలైన చారిత్రకాంశాలను కూడా ఈ వ్యాసంలో చెప్పటం జరిగింది. ఇంకా అనేకమైన ఆంధ్రదేశంలోని నృసింహ క్షేత్రాలను పేర్కొనటం జరిగింది.

"విశ్వంభర చదివిం తర్వాత," "ఉండేల కవితా గాండీవం" అన్న వ్యాసాలు రెండూ సుప్రసిద్ధ కవితా మూర్తులిద్దరి సాహితీ వ్యక్తిత్వాలను తెల్పటానికి చేసిన ప్రయత్నం. డా॥ సి. నారాయణరెడ్డి, శ్రీ ఉండేల మాలకొండారెడ్డి గార్ల కవితా విశ్వరూపం ఆ రెండు వ్యాసాల్లో విపులంగా చర్చించబడింది.

తప్పొప్పుల తంటాల ఛాయలకూ అర్థాంతర సిద్ధాంతాల జోలికీ పోకుండా తాననుకున్న భావాన్ని తన ఎదలో మెదిలిన ఆలోచననూ అక్షర నిబద్ధం చేయగల అరుదైన వ్యక్తిత్వం నీలా జంగయ్యగారిది. వారికి పరమేశ్వరుడు ఆయురారోగ్య, ఐశ్వర్యాలనిచ్చి ఇంకా ఎన్నో అమూల్య కావ్య రత్నాలతో ఆంధ్ర సరస్వతిని అలంకరించునట్లు అనుగ్రహించాలని మనసారా ప్రార్థిస్తున్నాను.



# "పెళ్ళి తోరణాల" లో వెలుగులు

—డా॥ టి. గౌరీశంకర్

మానవ సమాజంలో, మనిషి జీవితంలో మనువు అన్నది ఒక మరపురాని ఘట్టం. మన వేదాలు, పురాణాలు, శాస్త్రాలు మనిషి జీవన ప్రస్థానాన్ని నాలుగు మజిలీలుగా మలచి, ఆ యా మజిలీలలో పాటించవలసిన నాలుగు ధర్మాలను గూర్చి ప్రబోధించాయి. అవే బాల్య, కౌమార, యౌవన, వార్ధక్యాలు - బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసాశ్రమాలు. వీనిలో యౌవనంలో గార్హస్థ్య జీవితాన్ని కొనసాగించాలన్నది లోకధర్మం. ఇందుకు కళ్యాణం అన్నది ఒక కట్టడి. పెండ్లి అంటేమైన బంధానికి ఒక నిబంధన. పెళ్ళి కాకుండా కాపురం చేయడం సంతానాన్ని కనడం లోక విరుద్ధం. దీనిని సభ్యసమాజం అంగీకరించదు. అందుకే నాగరక సమాజంలో పెళ్ళి ఒక అపూర్వమైన, అనిర్వచనీయమైన విశేషకర్మ. అందుకే శ్రీ సీలా జంగయ్యగారంటారు. "అన్య స్త్రీ పురుష సంయోగం చేయకుండా ఉండడానికే ఏర్పరచుకొన్న కట్టడి పెండ్లి అని తోస్తుంది. అంతేగాని సంతానం కోసం పెండ్లి ఏర్పడిందని చెప్పడం అబద్ధం" అని. నిజమే!

అటువంటి అతిపవిత్రమైన పెండ్లికి ఆప్తులు, బంధువులు, మిత్రులు, శ్రేయోభిలాషులు అంతా వస్తారు. ఆ జంటను దీవిస్తారు. వారి జీవితం మూడు పూలు ఆరు కాయలుగా వర్ధిల్లాలని ఆశిస్తారు, అభినందిస్తారు. వీరిలో సాహితీ వేత్తలు, కవులు వున్నట్లయితే వారి ఆశీస్సులు, అభినందనలు అక్షరబద్ధమై బంగారానికి తావి అబ్బినట్లుగా ఉంటాయి. పూర్వం రాజులు, జమీందారుల ఆస్థానాలలోని కవులు ప్రభువుల పెళ్ళిళ్ళలో పంచరత్నాలు, నవరత్నాల పేరిట అయిదు, తొమ్మిది పద్యాలు అల్లి, కుసుమాక్షతలుగా చల్లి, పెళ్ళి పందిట్లో పదుగురిని అలరింపజేయడమన్నది అనూచానంగా వస్తున్న సత్సంప్రదాయంగా కనిపిస్తున్నది. ఆ ఆనవాయితీలోనే ప్రముఖ కవులు శ్రీ సీలా జంగయ్య గారు

వారి బంధువులు, మిత్రులు, పరిచయస్తుల పరిణయాల సందర్భంగా రచించి సమర్పించిన పద్యాలన్నింటిని 'పెళ్ళి తోరణాలు' అనే పేరిట ఒక సంకలనంగా ప్రకటించడం ఒక కొత్తదనాన్ని చాటుతోంది.

ఈ గ్రంథం శీర్షికలోనే శుభం, సుభగత్వం ద్యోతకమవుతున్నాయి. తోరణాలు మంగళ ప్రదమైనవి. పర్వదినాలకు, పండుగలకు, వేడుకలకు ప్రతీయమానమైనవి. పెళ్ళి శుభకార్యం. కళ్యాణవేదిక పచ్చని మామిడి తోరణాలతో అరటి స్తంభాలతో, కొబ్బరి మట్టలతో అందంగా అలంకరిస్తారు. అందువల్ల ఈగ్రంథంలోని ఒక్కో పద్యం ఒక్కో తోరణ సదృశమై పెళ్ళి మంటప దృశ్యాన్ని కళ్ళ ముందు సాక్షాత్కరింపజేస్తుంది కాబట్టి 'పెళ్ళితోరణాలు' అన్న శీర్షిక సాభిప్రాయ ప్రయోగం.

అయితే ఈ సంకలనం కేవలం ఆశీర్వచన పద్యాలతో కూడుకొన్నదే కాదు. పెండ్లి మన వ్యవస్థలో దానికున్న ప్రాముఖ్యత, వేదశాస్త్రాలలో దీని చర్చ, దీని పర్యాయ పదాలు, ప్రపంచదేశాలలో దీని ఆచరణ విధానం వంటి విషయాలెన్నింటినో శ్రీ జంగయ్య గారు సాకల్యంగా చర్చించి దీనికి ఒక భూమికగా కూర్చారు. అందులో వీరు విపులీకరించిన వివిధ అంశాల యుక్తాయుక్త వివేచన వీరి విజ్ఞతకు, శాస్త్రావగాహనకు దర్పణం పడతాయి. ఒక్క ఆంధ్ర దేశంలో అన్ని కులాలలో, మతాలలో జరిగే వారి వివాహ సంబంధమైన పదజాలాన్ని సేకరిస్తే ఓ నిఘంటువు తయారయ్యే అవకాశం ఉందని ఈ పీఠిక చివర వీరు చేసిన సూచన ఒక విశ్వవిద్యాలయం వారు గానీ, ఒక పరిశోధక బృందంగానీ, చేపట్టి నిర్వహించవలసిన ప్రాజెక్టు బీజావాపనం. ఇంకా పెళ్ళికి సంబంధించిన చాలా అంశాలపై గహనమైన పరిశీలన, పరిశోధన జరగవలసి ఉన్నదని వీరు చెప్పకనే చెప్పారు. అంటే కేవలం వధూవరులను దీవించే వైయక్తికమైన పద్యాలే గాక ప్రతి ఒక్కరూ చదివి తెలుసుకోవలసిన వివాహ వ్యవస్థ విషయాలు కూడా ఇందులో నేపథ్యం కావడం దీనికొక సమగ్రతను సమకూర్చి పెట్టాయి.

దీనిలో మొత్తం ఇరవై పెళ్ళిళ్ళతో శ్రీ జంగయ్యగారు రచించి సమర్పించిన పద్యమాలికలు సురభిళించాయి. ఈ ఇరవై జంటల పేర్లు, వివాహాం

జరిగిన తేదీలు, వేదికలు వగైరా వివరాలతో, వధూవరుల కళ్యాణ వేళలోని ఫోటోలు కూడా ప్రచురింపబడినాయి. అయితే ఒక్క అయిదు జంటల ఫోటోలు మాత్రం - బహుశా లభించకపోవడం చేతనేమో ప్రచురింపబడలేదు.

ఇక ఈ పద్యాలకు పెట్టిన శీర్షికలు ఒక ప్రత్యేకతను కలిగి ఉన్నాయి. అవి - పూలు - నవరత్నాల పేర్లు కలిసి ఉండడం. 'మల్లెలు - మంచి ముత్యాలు', 'సన్నజాజులు - పగడాలు', 'కలువలు - వజ్రాలు', 'చంపకాలు- గోమేధికాలు', 'గులాబీలు - పుష్యరాగాలు', 'మొగలి రేకులు - మాణిక్యాలు', 'మందారాలు-మణులు', 'దోసపూలు - పచ్చలు', 'గుమ్మడి పూలు - ఇంద్ర నీలాలు' - ఇట్లా ఉన్నాయి. ప్రతి జంటకు పూలు ముత్యాలు [illegible] పేర్లు ఉన్నాయి. అంటే అవి వధూవరులన్న మాట. 'వధూవరులు' అని అంటామే కానీ వరూవధువులు అని [illegible] వాన్నలు వంటి వాటిలో స్త్రీకి ప్రథమ స్థానం. అందుకే [illegible] అంటే పెళ్ళి కూతుళ్ళు ముందు వరుసలో ఉన్నారు. [illegible] నిండుదనంగా, పరిపూర్ణాకృతిగా వరులు చోటు చేసుకొన్నారు. వధువులు పుష్పాలతో సమానంగా కోమలమైన సుహాసనాభరితమైన [illegible] వరులు నవరత్నాల్లాంటివారు. సామాన్యంగా మనం మగపిల్లల్ని మా వాడు మాణిక్యం, రత్నం, బంగారంలాంటి వాడనీ అంటామే గానీ మా వాడు పువ్వు లాంటి వాడని అనము. అది ఆడపిల్లల విషయంలో ఉపయోగిస్తాం. అందువల్లనే శ్రీ జంగయ్యగారు కూర్చిన ఈ శీర్షికలు ఆయా జంటలకు ప్రతీకలై ఎంతో ఔచిత్యాన్ని చాటుతున్నాయి. ఇంకా మరికొన్ని శీర్షికలు 'పంచరత్నాలు', 'పంచరత్న మాలికలు', 'నవరత్న మాలికలు' అంటూ సాగాయి. అవి కూడా సముచితంగా ఉన్నాయి. కళ్యాణానికి సంకేతం వధూ వరులు పూలదండలు వేసుకోవడం. మన సంప్రదాయంలో పెళ్ళికాని అమ్మాయి పరపురుషుని మెడలో పూలదండ వేయకూడదు. అంటే పెళ్ళిలో పూలమాల పాత్ర అతి విశిష్టమైనది. ఆ ఔచిత్యం ఎరిగిన శ్రీ జంగయ్యగారు పూలకల - శీర్షికలతో [illegible] సుమాల మాలలను వధూవరులకు అందించి వారికి [illegible] ఆదేశించి ఆశీర్వదించారు. ప్రతి శీర్షిక - చివర్న [illegible] ప్రాశస్త్యాన్ని తెలిపే సూక్తిమౌక్తి[illegible]దిగారు.

దీనిలోని పద్యాలు ఛందోబద్ధమై గణనియతితో సాగినవి. శ్రీ నీలా జంగయ్యగారి చవులూరించే పద్య రచనా వైదుష్యాన్ని చవిచూసిన సాహితీ ప్రియులకు ఈ పద్యాలలోని సౌరు, తీరు గురించి ప్రత్యేకించి పరిచయం చేయ వలసిన పనిలేదు. ఇందులోని ఒక్కొ ఖండిక ఒక రసగుళిక. ఈ సంకలనం వారి పాండితీ ప్రకర్షకు నికషోపలం.

'పద్యాలలో వధూవరుల పేర్లు, ఇంటిపేర్లు, వంశస్థుల ఔన్నత్యాన్ని గూర్చి ప్రతిభావంతంగా ప్రసంగించారు. అయితే వీనిలో కేవలం ఆయా జంటలకు సంబంధించిన వైయక్తికాంశాలే కాదు. సర్వులూ తెలుసుకోదగిన విజ్ఞాన విషయాలను కూడా శ్రీ జంగయ్యగారు స్పృశించారు.

"పాలలో కలిసి క్షుభితెట్టు పంచదార
తీయనౌ బంధముల దెల్పు తీర్పు నొప్పు"

అంటూ దాంపత్య జీవితంలోని మధురిమను ఆవిష్కృతం చేశారు.

సృష్టి, స్థితి లయకారకులైన త్రిమూర్తులను-
"శ్రీపతి సరస్వతీ విభు
డాపద్బాంధవి, యుమా మహారాణి ధవుం
డా ... ... ... ..."

అని ప్రసంగవశాన ప్రస్తుతించారు.

"శ్రీ కల్యాణ్వయ కల్పభూజమున", "శ్రీశుడు రమ్య లోకహిత సింధువునై", "సరస సరస్వతీ హరి ప్రసాద" వంటి పద్యాలు పదసౌరభం, సారళ్యంతో కూడుకొన్నవి. శ్రీ జంగయ్య గారికి పద్యం రాయడం 'వర్లేరుపై బండినడక' లాంటిదని దీనిలోని ప్రతి పద్యం నిరూపిస్తుంది.

'పెళ్ళి తోరణాలు' అనే ఈ గ్రంథం సాహితీ పిపాసువులకు పంచభక్ష్య పరమాన్న సదృశమైన మంచి విందుభోజనం. ఇటువంటి పెళ్ళి విందును అందించిన శ్రీ నీలా జంగయ్యగారు అభినందనీయులు.



# పదశారద వ్యాసాల్లో పరిమళించిన జ్ఞానప్రసూనాలు

శ్రీ ఎన్.సి.వి. రామానుజం ఎం. ఎ.

ఇటీవలనే ప్రచురితమైన పదశారద వ్యాస సంపుటిలోని వ్యాసాలు కవి రత్నగారు ఆయాసందర్భాల్లో వివిధ ప్రత్యేక సంచికల్లో మాస పత్రికల్లో వ్రాసి, ప్రచురించినవే. అడుగడుగున తెలుగుతనం ఉట్టిపడే ఈ వ్యాసాల్లో సామెతల్ని, లోకోక్తులు, జానపద బాణీలు, తెలుగు వారి ఆట పాటల్ని, పదర్యాసాలు, తత్త్వ చింతనాధోరణులు, పల్లెపదాలు, వంటివెన్నో విమర్శన దృష్టితో పరిశీలించ బడ్డాయి. ఆధునిక సాహిత్య వీధుల్లో ఈ గ్రంథ [illegible] విస్తరి ల్లుతున్న విశ్వాసం నాకు కలిగింది. ఈ కవి [illegible] విషయాన్ని స్పృశించి పరిశీలించినా ఆ విషయతత్త్వాన్ని [illegible] మాటల్లో చెప్ప జాలిన శక్తిమంతుడుగా కవిరత్న జంగయ్య [illegible] పద్యం వ్రాసినా గద్యం వ్రాసినా పాఠకుల తలలో [illegible] లాక్కుపోతారు. ఒక్కొక్క వ్యాసం ఒక్కొక్క [illegible] గ్రంథంగా ప్రకటించిన వారయ్యారు. తత్త్వమూ. అన్నమయ్యతో అన్నమయ్యమూర్తి మత్వాన్ని ఆయన పద సాహిత్యాన్ని చక్కగా లెక్కకట్టివారని చదివి తెల్సు కొన్నాను. హరిహరుల అభేదత్వాన్ని (అద్వైతాన్ని) జంగయ్య గారు తెలిపిన తీరు నన్నెంతో ఆకర్షించింది.

"అన్నమయ్య శృంగార భావప్రియుడు. సతి పతిని తనవైపు తిప్పుకొన డానికి అనుసరించే పద్ధతులన్నిటినీ అనుసరించి కీర్తనలు రచించాడు."

"అష్టవిధ శృంగార నాయకల స్వభావాన్ని అన్నమయ్య అనుసరించి జగత్పతియైన వేంకటపతిని కీర్తించినాడు". అని అన్నమయ్యను, అన్నమయ్య తత్వాన్ని సూటిగా నిర్ధారించారు.

"జానపద సాహిత్యము విలువలు, అనే ఈ వ్యాసంలో భాషకు సంబంధించిన విషయాలెన్నో ప్రస్తావించి ఈ జానపద సాహిత్యం" పని పాటల నుంచి ఆటపాటల నురచి పుట్టుకొస్తుంది అన్నారు. ఆట, పాట, బ్రతుకుపాటలు రెండు పక్కలుగా సాగివచ్చిన తీర్పు నిర్ణయించారు. ఈ సాహిత్యాన్ని అత్యున్నత స్థాయికి చెందిన కవి పండితులు అనుసరించారని వివరించినతీరు అత్యద్భుతంగా ఉన్నది. జానపద సాహిత్య దర్శనమ్మంటే జ్ఞానపథ సందర్శనమన్నారు. ఊళ్ళు బాగుండాలి ఊరిభాష రాజ్యమేలాలన్న ఆకాంక్ష ఈ వ్యాసం చివరతెలిపారు.

ఆటపాటలవిందు అనే ఈ వ్యాసంలో మౌనంగా పలుకు, అనుబంధంగా, సమూహం, పాట చిందు అనే మూడు తెరగులలో ఈ ఆటలు ప్రపంచంలో ఉన్నాయని ఎన్నో ఆటలు ఉదాహరించి వ్రాసిన ఈ వ్యాసం నిజంగా పాఠకులకు విందునే ఇస్తుంది. మనస్సుకు ఆహ్లాదాన్నిస్తుంది.

"ఆడే దెవ్వరు
పాడే దెవ్వరు
అని ఇకిలించక
అని నిందించక
ఆడించెడి వాడాదేవాడని
నాటకరంగం అవనీస్థలమని
ఆడరండోయి పాడండోయి
ఆటపాటల విందండోయి
వినికని ఆనందించండోయి"

అనే ఈ పాట ఈ వ్యాసం చివర చేర్చి ముగించిన తీరు కవిరత్న ప్రతిభకు మచ్చుతునకలా ఉంది.

తెలంగాణా ప్రాంతపు తత్త్వ కవులు అనే ఈ వ్యాసంలో జీవనతత్త్వాన్ని, సాహిత్య తత్త్వాన్ని తత్త్వ సాహిత్యాన్ని పరిశీలించి వ్రాసిన వ్యాసమిది. ఇందులో సిద్ధప్ప, అహమదొద్దీన్ బ్రహ్మంగారు వంటి తత్త్వ రచయితలెందరో గాక ఈ మార్గాన్ని పరిపుష్టంచేసిన రచయితల నెందరినో ఉదాహరించారు.

ఛందస్సంబద్ధంగా ఈ తత్త్వాన్ని విడదీసి ఒక బాణికి సంబంధించిన దానిగా, వేదాంత భావానికి సంబంధించిన దానిగా చెప్పి వేమన్నను దర్శించి ఆయన తత్త్వాన్ని తెలిపిన తీరు అత్యద్భుతంగా మన కవిరత్నగారి వ్యాసంలో తెలియ చేశారు.

"మోసాన్ని తెలిపెకి జమకట్టరావని
విగ్రహారాధన సామాన్యులకేనని
కులమత భేదాలు లేవని ఉండరావని
గురువే పరమాత్మ" అని ప్రతిపాదించిన సంగతులు జంగయ్యగారి శైలిలో సుమనోహరాలై సుశబ్ద సంశోభితాలై ఉదాహరించిన తత్త్వాలు ముచ్చట గొల్పుతున్నాయి. ఒకచోట జానపద సాహిత్యాన్ని సమాలోచిస్తూ "సముద్రమంతగా ఉన్న జానపద సాహిత్యాన్ని" కొలిచే మానాలు లేవన్నారు.

"నేనూ తురకౌతే
నా యాత్మా తురకౌనా
నా యాత్మా తురకౌతే
పరమాత్మా తురకౌనా" అని ఉదాహరించిన ఈ తత్త్వం తత్త్వ సాహిత్యానికే మణిమకుటంగా ఉందని చెప్పవచ్చు. సామాన్యుల్లోగల జ్ఞాన సత్తాను జంగయ్యగారు దర్శించిన తీరు రమణీయం. ఈ వ్యాసం 'పదశారద'లో తాలో తలంగా ఉన్నదంటే ఎవరూ ఆశ్చర్యపో నవసరంలేదు.

జావళి - విశిష్టత అనే ఈ వ్యాసంలో జావళీల పుట్టుక పెరిగిన పరిసరాలు ప్రస్తావించి వాటిని శృంగార దీపికలుగా ప్రకటించడం విశేషం. పరుగుపడిన ఈ ప్రక్రియను సేకరించిన జావళుల ద్వారా విలువలను సమకూర్చారనడంకంటే కట్టారనడం సబబు.

"శ్రీ భావజ సుందరా
నా చింత దీర్చారా." అన్న జావళితోనే జావళి రూప సౌందర్యాలను విడమరచి చెప్పారు.

తత్త్వము - గురు ప్రతీక అనే చివరి వ్యాసంలో గురువే సత్యస్వరూపుడు పరమాత్ముడు దర్శనీయుడు అన్న భావాన్ని ఎన్నెన్నో ఉపమానాలతో కొలిచారు జంగయ్యగారు.

ఈ గురు ప్రతీకలో ఆరు దర్శన శాస్త్రాల సారం వేదాంత తత్త్వం పంచీకరణ తత్త్వం మొదలైన వాటిని సమ్యగ్ భావంతో చిత్రించారు.

'సర్వం విష్ణుమయం జగత్, అనే లక్ష్యంగా ఈ వ్యాసం రచించడంలో జంగయ్యగారి ప్రతిభ పురులు విప్పి ఆనంద నృత్యం చేసింది. భక్తులు, జ్ఞానులు, యోగులు, దర్శించిన జ్ఞానరహస్యాలిందు పొందుపరిచారు.

స్వర్ణోత్సవాల సందర్భంలో ఈ గ్రంథంపై వ్యాసంవ్రాసే అవకాశం కలిగించిన సన్మానసంఘం వారికి జంగయ్యగారికి నా ప్రత్యేక వందనాలు సమర్పించుకొంటూ ముగిస్తున్నాను.

